# ఈ రచయిత కృతులు

శ్రీ జానకీ జానిశతకము 0—4—0

శ్రీ ఆంధ్ర తులసీ రామాయణము
బాలకాండము 2—8 —0

మిగిలిన కాండములొక్కొక్కటి ఒక్కొక్క సంపుటముగా
త్వరలో క్రమముగా వెలువడనున్నవి.

ప్రతులకు :—

మైలవరపు సూర్యనారాయణమూర్తి
కృష్ణంపాలెం : : ఎర్నగూడెంపోష్టు
పశ్చిమగోదావరి జిల్లా.

శ్రీ

# ఆంధ్ర తులసీరామాయణము

## బాలకాండము





# ఆంధ్ర తులసీరామాయణము



అను

## రామచరిత మానసము

(బాలకాండము)





ప్రథమ ముద్రణము
ప్రతులు ఐదువందలు



★

వెల రు. 2-8-0

దుర్ముఖి వసంతము

★

ప్రాప్తిస్థానము
మైలవరపు సూర్యనారాయణమూర్తి
కృష్ణంపాలెం
ఎర్నగూడెం పోస్టు
వయా కొవ్వూరు
ప. గో. జిల్లా.

# తొలిపలుకు

శ్రీ కేశిరాజు వేంకటనృసింహఅప్పారావు ఎం. ఏ.
ప్రిన్సిపాల్, ఆంధ్రగీర్వాణవిద్యాపీఠము.
కొవ్వూరు.

ఎందఱెన్ని రీతుల వచించిన రామకథా ప్రసంగముల్
సుందరతావహంబులె వసుంధర నట్టి సువృత్తమున్ సుధన్
జిందు స్వకీయ వాక్కులను జిత్తము రంజిలఁ జెప్పినట్టి ధ
న్యుం దులసీ సునామకవి నుల్లము నందుఁ దలంతు భక్తిమై.

భారత భాగవత రామాయణములు భారతీయసంస్కృతికి మూలకందములు. అందు భారతము ఇతిహాసము, భాగవతము పురాణము, రామాయణము కావ్యము, మూఁడిటి ప్రయోజనము ఒక్కటియే. అది మానవుని పురుషార్థపరునిగా నొనర్చుట. అయినను ప్రభుసమ్మితముగా బోధించు పంచమవేదము కంటెను, మిత్రసమ్మితముగా బోధించు పురాణముకంటెను, కాంతాసమ్మితముగా బోధించు కావ్యమగుటచే రామాయణమునకే యెక్కువ ప్రచారము కలదు. భారతదేశమునకే కాక, ప్రపంచమునకే ఆదికవియగు వాల్మీకిచే రచింపఁబడుటచే నిది ప్రపంచమునకే ఆదికావ్యము. కాలముచేతనే కాక కావ్యగుణముచే కూడ నీ రామాయణము నేటికిని ప్రథమగణ్య మగుట మఱియొక ఆశ్చర్యకరమగు విషయము. కావుననే పెద్దలు భారతమునకు వలెనే దీనికి వేదతుల్యత్వము నిట్లు పాడించిరి.

"వేదవేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే
వేదః ప్రాచేతసా దాసీత్ సాక్షాద్రామాయణాత్మనా"

దీనిని బురస్కరించుకొని సంస్కృతముననే అధ్యాత్మరామాయణాది గ్రంథములు శ్రీరామచంద్రుని అవతారపురుషునిగా అడుగడుగున బోధించునవి బయలుదేరినవి. వాల్మీకి శ్రీరాముని ఆదర్శమానవునిగా బ్రదర్శించుటకు జేసినంత యత్నము అవతారపురుషునిగా

జూపుటకు చేయలేదు. కావుననే భక్తశిరోమణి యగు తులసీదాసు వాల్మీకిరామాయణము కంటె అధ్యాత్మరామాయణమునే అధికముగా అనుసరించి 'రామచరితమానసము ను' రచించెను. ఇది హిందీవాఙ్మయములో సర్వోత్కృష్టమగు కావ్యరాజము. దోహా-సోరఠా-చౌపాయి అను పేర్లుగల గేయచ్ఛందస్సులో నుండుటచే నిది పండితులకు, పామరులకు స్త్రీలకు గూడ నుపాదేయమై యున్నది. వేయేల! ఉత్తరహిందూదేశమున తులసీరామాయణము గ్రంథరూపమున నున్న ఇలవేల్పు అని చెప్పిన అతిశయోక్తి కాదు. దీని కితరభాషలలో ఎన్నో అనువాదములు, దీనిపై హిందీభాషలో నెన్నో వ్యాఖ్యానములు బయలుదేరుటయే దీని ప్రాశస్త్యమునకు పరమప్రమాణము. కవి కావ్యమున బ్రతిబింబించు ననువాక్యము తులసీదాసునందు అక్షరశః సార్థకము. అతని భక్తిపారవశ్యము రామచరిత మానస మందలి ప్రతి యక్షరమునను ద్యోతకమై శ్రోతలను మానస సరస్తరంగములపై నూగులాడు హంసలవలె నానంద డోలికల నూగులాడించును. ఆంధ్రకవులలో నితనితో సరిపోల్పదగిన వాఁడు పోతనామాత్యు డొక్కఁడే.

> "ఒనరన్ నన్నయ తిక్కనాది కవు లీయుర్విన్ బురాణావళుల్
> దెనుఁగున్ జేయుచు మత్పురాకృత శుభాధిక్యంబు తా నెట్టిదో
> తెనుఁగున్ జేయరు మున్ను భాగవతమున్ దీనిన్ దెనింగించి నా
> జననంబున్ సఫలంబుఁ జేసెద పునర్జన్మంబు లేకుండఁగన్"

అని ఆత్మతరణమునకే తాను భాగవతము నాంధ్రీకరించుచున్నానని పోతన చెప్పుకొన్నట్లే, తులసీదాసును – 'స్వాంతస్సుఖాయ' అని అంతరాత్మప్రీతికై రచించుచున్నానని చెప్పుకొన్నాఁడు. ఇట్లు భగవదధీనచేతస్కులై రచించిరి కావుననే వారు తరించుటయే కాక మనలను గూడ తరింపఁజేయగల్గిరి.

తెనుఁగునగూడ ననేక రామాయణములు వాల్మీకిరామాయణము ననుసరించి వ్రాయఁబడినవి కలవు. ఇందు ఎఱ్ఱాప్రగడ రామా

యణమే మొదటిదిగా కాన్పించును. కాని అది కన్పించుటలేదు. భాస్కర రామాయణమునకు గర్త మంత్రిభాస్కరుఁడను పక్షమున అదియే మొదటిదగును గాని, యది హుళక్కిభాస్కరకృతమని బహుజనాభిప్రాయము. రంగనాథరామాయణము ద్విపదకావ్యము. ఇవియును గోపీనాథరామాయణము మున్నగు పద్యకావ్యములును స్వేచ్ఛానువాదములు. ఆధునికులలో ఆంధ్రవాల్మీకి శ్రీ వావిలికొలను సుబ్బారావుగారు; కవిసార్వభౌమ- శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రులుగారు రచించినవి వాల్మీకిరామాయణమునకు మూలానుసారములుగా నున్నవి. ఇంకను శ్రీ విశ్వనాథ సత్యనారాణగారి రామాయణ కల్పవృక్షము మున్నగు స్వతంత్ర రచనలు పుట్టుచున్నవి. ఇవి యన్నియు బ్రధానముగా సంస్కృతమందలి వాల్మీకిరామాయణముననుసరించినవే. వాల్మీకిరామాయణమున కెంత ప్రచారము కలదో అంతకంటె ఎక్కువ ప్రచారముగల తులసీరామాయణమును గూడ తెనుఁగులోనికి దెచ్చుకొని, అందలి రసాస్వాదనము జేయుట ప్రతి ఆంధ్రునికిని గర్తవ్యమై యున్నది. అట్టి కొఱఁతదీర్చుటకై శ్రీ భాగవతుల నరసింహశర్మగారీ తులసీరామాయుణమును ముప్పదిసంవత్సరములకు బూర్వము పద్యములలో స్వేచ్ఛానువాద మొనర్చి ప్రకటించిరి. దీనికి కీ. శే. కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారు పీఠిక వ్రాయుచు దీనిని మూలానుసారముగా గూడ ననువదించిన తులసీదాసుని యభిప్రాయములు యథాతథములుగా దెలిసికొనుటకు వీలుగా నుండునను అభిప్రాయమును వెలిబుచ్చిరి. ప్రకృతము శ్రీ మైలవరపు సూర్యనారాయణమూర్తిచే ననువదింపఁబడిన యీ తులసీరామాయణము పూర్తిగ మూలానుసార మగుటచే దీనికి బునరుక్తిదోషము లేదు. ఇతఁడును తనకు పరీక్షాభాగముగా బెట్టిన తులసీరామాయణము నందలి కొన్ని పద్యముల జదివి అందలి భక్తిరసముచే బ్రభావితుఁడై – 'స్వాంతస్సుఖాయ' అను సూత్రమునే అవలంబించి మొత్తము గ్రంథమంతయు ననువదించి తాను రసాస్వాదనము చేసి

మునచే జేయించుచున్నాఁడు. ఇందీకవియొక్క ఆశయము ఉదాత్తము. ఇతనిని నేను జిన్నప్పటినుండియు నెఱుఁగుదును. శ్రీరామచంద్రునివలె పితృభక్తిపరాయణుఁడు. సత్యసంధుఁడు. వినయశీలుఁడు. ప్రహ్లాదునివలె జిన్నప్పటినుండియు దైవభక్తుఁడు. ఇంతకు మున్నీ బాలకవి జానకీజాని శతకమును మృదుమధుర శైలిలో రచించి తన తండ్రిగారికే అంకిత మిచ్చియున్నాఁడు. హిందీలో రాష్ట్రభాషావిశారద పట్టమునందినాఁడు. సంస్కృతాంధ్రములలో తగినంత పరిజ్ఞానము కలదు. చిన్నప్పటి నుండియు గవితావ్యసనము కలవాఁడు. ఇవి యన్నియు స్వయంకృషి చేతనే పొందుట విశేషము. నివాసము చిన్నపల్లెటూరు. వృత్తి కర్షకవృత్తి. ఈ విధముగా బోతనామాత్యుని లక్షణము లన్నియు పట్టిన యీతఁడు తులసీరామాయణము ననువదించుట ఎంతయు సము చితముగా నున్నది. ఈతని కవితాశైలియు జాలవర కాతని ననుస రించునదిగనే కనవచ్చును. అందును జాతీయములగు చక్కని తెలుఁగుపదముల కూర్పుతో కూడిన భావసంపద కొన్నియెడల నీతని కవితాశక్తిని నిరాఘాటముగా చాటుచున్నవి. ఉదాహరణమునకు కృత్యాదినుండి యొక పద్యము—

> "చల్లని తండ్రి కూఁతురగు చల్లనితల్లి నొకర్తు సామెయిం
> జల్లనితల్లి నింకొకతె సమ్మతినా దలఁదాల్చి భూషగాఁ
> జల్లనకెల్ల నెల్లయగు చందురుఁ దాల్చి కృపారసంబుఁ బై
> నెల్లెడఁ జల్లునల్ల పరమేశుఁడు చల్లని కంటఁ జూచుతన్."

అనువాదమును గూడ జాలమంది వలె మక్కికి మక్కిగా గాక మూలమునందలి భావము చెడకుండునట్లు తెలుఁగు నుడికారమున కనుగుణముగ తెలుఁగు సేయునేర్పు ఈ కవికి సహజముగ అలవడి నట్లు గాన్పించును. స్వతంత్రముగా జదివిన నేది యింకొక పద్యమున కనువాదముగ భాసింపదో అదియే సరియైన అనువాదము. ఈ కవి యనువాదమం దీ లక్షణ మించుమించు సర్వత్ర పట్టినది.

ఉదాహరణమునకు :— "సీతారామ గుణగ్రామ పుణ్యారణ్య విహారిణౌ
వందే విశుద్ధవిజ్ఞానౌ కవీశ్వర కపీశ్వరౌ."

దీని కనువాదము :- "సీతా రాముల గుణసం
ఘాతంబను దురవగహన కాంతారమునం
బ్రీతిఁ దిరుగు విజ్ఞానుల
నేతఱిఁ నేఁ గొల్చెదన్ గవీశుఁ గపీశున్."

"భణితవిచిత్ర సుకవికృతజో ఊ, రామనామబిను సోహనసో ఊ
బిధుబదనీ సబ్ భాఁతి సఁవారీ, సోహన బసన వినా వరనారీ"

దీని కనువాదము :- "సొమ్ముల నెన్నిటంబొలిచిసొంపెసలారిన మోము చంద్రబిం
బమ్మును బోలినం బొలఁతి వస్త్రవిభూషిత కామి నామిటా
రమ్మది వమ్మెయౌ నటులు రాముని పేరునఁ జేరకోని కా
వ్యమ్మదిసర్వలక్షణసమన్విత మయ్యు రహింప దెన్నఁడున్."

ఈ క్రింది పద్యము నడక గంగానదివలెనే ప్రసన్న గాంభీరము.

"సేవకశాలి పాలనకు జీవనదం బయి యిష్టసిద్ధికిన్
దేవమహీజమై యరుణ దీధితి యౌచు దమస్తమిస్రకున్
శ్రీవిభు శంభు సన్నిభ సుసేవ్యముసై శ్రితజీవసార్థమై
దేవనదీ వినిర్మలగతిన్ రఘురామచరిత్ర మొప్పెడున్" (165)

మహాత్ములు పార్వతియెదుట నీశ్వరుని గుఱించి లాఘవముగా మాట్లాడుపట్టునఁ గవి యుపయోగించిన అచ్చ తెలుఁగుపదములతో ఈ క్రింది ఆట వెలది పద్యము వివక్షితమగు లాఘవమును చక్కఁగా జోపించుచున్నది.

"ఉండఁ గొంపలేదు పండఁ బాన్పును లేదు
బండతోలు చట్టుబండ కాని
బుస్సకొట్టు విసపుఁ బురువు సొమ్ములవాఁడు
దిసమొలాఁడు కాటఁదిరుగువాఁడు."

ఈ క్రింది పోతన యనుకరణము లీ కవి కాతనియందు గల యభిమానమును సూచించుచున్నవి.

(1) "శౌరి గాథ వినని శ్రవణరంధ్రంబులు
వల్మీక రంధ్రముల్ వనజగంధి" (484)

(2) "ఆశ్రితసహాయుకు, భక్తజనేప్సితార్థ సంధాయుకు, భక్తలోకసుఖ దాయుకు, శ్రీరఘువంశ నాయుకున్" (107)

"హారణంబులు భవరజ నీ
కిరణంబుల కగమసుగమ కీర్తిత భగవ
చ్చరితాత్మక రత్న మణి
స్ఫురణంబులు గురుపదనఖ శుభకిరణంబుల్"

సాధారణముగా నెల్ల కవులయందు ప్రథమావస్థలో గానవచ్చు యమకానుప్రాసప్రియత్వ మీ కవియందును దఱచు కానవచ్చు చున్నది. అయినను ఈ శబ్దాలంకారములు ప్రయత్నపూర్వకముగ వేసినట్లు గాన్పింపక రసపోషకములే యగుట మెచ్చుకొనదగి యున్నది—

ఉదాహరణమునకు :-

"ఎపుడుఁ గనికరమునఁ బ్రోచుఁ గనికరంబు"
"చిత్తరి యత్తఱిన్ మిగుల భీతిలి" (262)
"తూలనాడు ఫలమేనును మేనుఁ ద్యజింతుఁ గాక" (294)
"అని నమస్కరింప నా మస్కరి వచించె" (657)
"అని మనమున నణుమానము ననుమానము లేక" (703)
"మాఱుంగద కాకి కోకిలగఁ గ్రుంచమె యంచగ" (21)
"పాలకడలి పరుండు కృపాపరుండు"

దుష్కరప్రాసము న క్లిష్టముగాఁ గూర్చుట కీ క్రిందిపద్య ముదాహరణము కాదగును.

"వృషాటాధి వరాంగదాదిక మహావీర ప్లవంగావళిన్
బుషాధ్యక్షు విభీషణ ప్రభుతులన్ హీనాంగులై రామరా
ట్సాక్షాత్కారముఁ గొన్నవారలను నిష్కామాత్ములై నిచ్చరా
మక్షోణీశు భజించు జంతుజన సామాన్యమ్మునుం గొల్చెదన్"

ఈ విధముగ నుదాహరణము తీయవలెనన్న గావ్యమంతయు నుదాహరింపవలసి యుండును.

ఇక నీ కావ్యమునందుఁ గొలఁదిగా నచ్చటచ్చట అలాక్షణిక ప్రయోగములును లేకపోలేదు. కాని, అవి "ఏకోహి దోషోగుణ సన్ని

పాతే నిమజ్జతీందోః కిరణేష్వివాంకః" అను కాళిదాసు సూక్తి ననుస రించి గణింపఁదగినవి కావు. ఈ విషయము నెత్తుకొని స్వయముగా తులసీదాసే యిట్లు వచించియున్నాఁడు.

"ఫుల్లాంబుపాలుఁ దెల్లని
వల్లవె మేలంచుఁ గొందు రందఱు నటె శ్రీ
వల్లభు సుయశోవల్లిని
నల్లినయుక్కృతి గ్రామమయ్యుఁ బ్రియంబౌ" (70)

తులసీరామాయణ మంతయు నాంధ్రీకరింపఁబడినను వ్యయా ధిక్యముచే బాలకాండము మాత్రమే ప్రకృతము ప్రకటింపఁబడు చున్నది. రామాయణరసలోలుపులగు సహృదయులచే నియ్యది యాదరింపఁబడి తక్కిన కాండముల ప్రకటనకు ద్వరలో ప్రోత్సాహము లభింపగలదని ఆశించుచున్నాను. హిందీభాషానభిజ్ఞులైన ఆంధ్రమహా జనులకు తులసీ రామాయణమునందలి రసమును యథాతథముగా గ్రోలు నవకాశము నీ విధముగా గల్పించిన యీకవి ఆంధ్రవాఙ్మయ మునకొక నూతనాలంకారమును గూర్చినవాఁడై ఆంధ్రుల మన్ననలకు బాత్రుఁడగుచున్నాఁడు. ఇంత చిన్నవయసున నిట్టియుద్గ్రంథమును అందును నేటి ప్రతికూలవాతావరణములో సృజింపఁగల్గుటపూర్వపుణ్య విశేషమని చెప్పగును. ఈ విధముగా శ్రీరామచంద్రుని యశో గానముచే ధన్యుఁడైన యీకవి చిరాయురారోగ్య భాగ్యములనంది యింకను ఇట్టి యుత్కృష్ట రచనలచే ఆంధ్రభారతి నారాధించుఁగాక!

కొవ్వూరు
2 – 5 – 56

ఇట్లు, బుధవిధేయుఁడు.
కే. వేం. నృ. అప్పారావు.

# విన్నపము

పదునెనిమిది సంవత్సరముల క్రిందట 1938 ॥ లో నేను పరీక్షార్థినై వెళ్ళినపుడు మౌఖిక పరీక్షకులు నన్ను హిందీభాష నేల చదువుచుంటివని యడుగగా తులసీరామాయణము తెలుఁగు సేయుట కని చెప్పితిని. అటు లంటినే కాని తులసీదాసు రచన మెట్టిదని కాని, ఆ రామాయణ గ్రంథ మేస్వరూపమున నుండునని కాని, అది నాబోటికి తెలియవచ్చునాయని కాని నాటికి తలంపే లేదు. అప్పటికి తోచిన సమాధానమెద్దియో చెప్పివైచితిని. తులసీదాసుని రచన లన్నిటిలోనే కాక హిందీసాహిత్య భండారమున కంతయు ఈ రామ చరిత మానసకావ్యము తలమానికమని మాత్ర మెఱుఁగుదును.

అదిగాక ఈ మానసామృత సింధువున నిరంతరకృషి సలిపి, మథించి, భక్తులకు మానసామృతసారము గీతామృతానుపానముతో సంతరించి యిచ్చు పూజ్యులు మా మేనమామగారైన బ్రహ్మశ్రీ కొత్తపల్లి వేంకటేశ్వరులుగారొకప్పుడు నా చిన్నతనములో మా యింటికి వచ్చినపుడు మేముకోరగా నీ రామాయణమున అంగదుని రాయబారపుఘట్టము పురాణముచెప్పి వినిపించిరి. అదివిన్నది మొద లుగ సమ్మదాశ్చర్యములు బెనగొని నా మదిని తులసీదాసుని రచ నమున భక్తిశ్రద్ధాభిరుచుల మొలకెత్తించినవి. కొంతకాలమునకు నే నొకించుక హిందీభాషాపరిచయ మలవరచుకొని, పరీక్షా పాఠ్య భాగమున తులసీదాసుని కొన్నిపద్యములజదివి యా మానసాభిరుచిని మరల కొనసాగించితిని. తరువాత మా మేనమామగారి నడుగగా వారు నాకొక సవ్యాఖ్యాన తులసీరామాయణపు ప్రతినిచ్చిరి. అదివారు నాకిచ్చిన వేళావిశేషముననో, వారిహస్తగుణ విశేషముననో కాని మానసాభిరుచి నాకు మెండై, వ్యాఖ్యాన సహాయమున పూర్తిగా జదివి యానందింప గల్గితిని. చిన్నప్పుడే నామది మానసాభిరుచి మొలకెత్తుటకు కారణభూతులై, తా మిచ్చిన గ్రంథముద్వారా నా మానస జ్ఞాన వికాసమును బెంపొందించిన మా మేనమామగారికి

నమశ్శతము లర్పింతును. మానసామృత సింధువున నిరంతర మట్టు లానందవీచికల నోలలాడుచు, ''ఏకస్స్వాదు న భుంజీత'' అను న్యాయమున ఆ యానంద మొక్కడనే యనుభవింపక, తోడివారలకు చదివి వినిపించుచు సంతుష్టి పడుచుండెడివాడను. అటుపై రసవత్తరములగు కొన్ని పద్యముల ననువదింపవలెనని బుద్ధిపుట్టగా నెంచ మొదలుపెట్టితిని. తుదకట్టివి గ్రంథమున నూటికి నూఱుపాళ్లుగా దేలినవి. నా యల్ప బుద్ధికి మానసామృతము జూఱగొని భాషాంతరీకరించు మహాసాహస కార్య మేటికి కేతాము నెత్తుట వంటిదని తోపకపోయె. అటు పద్యము లెంచి వ్రాయుటకాదని విడివిడిగా గొన్ని కథావృత్తాంతముల దీసికొని వ్రాసి అటుపైన సక్రమమునవానిని బూరించితిని. ఈవిధమున సుమారు ఆరు వేల పద్యసంఖ్యగల రామాయణ మేడు కాండములు నించుమించు అయిదు వేల పద్యములలో యథాశక్తి ననువదించి శ్రీరామాను గ్రహమున గ్రంథము సంపూర్తి జేసితిని. తులసీదాసుని రచనమున సర్వత్ర గోచరించుచుండు భక్తిభావావేశమే నన్నీ యశక్త సాహస కార్యమునకు బురిగొల్పినది కాని, నాకుగల భాషాసాధన సంపత్తియు, రచనా పాటవమును గాదు.

ఈ ఆంధ్ర తులసీరామాయణ రచన మిప్పటి కెనిమిది సంవత్సరముల క్రితమే పూర్తియైనను ప్రకటించుట కెప్పటి కప్పుడే రచనను తిరిగి చూచుకొన్నకొలది నసంతుష్టితోను జంకు గొంకులతోను నుపేక్షవహించి యూరకొంటిని. ఒకసారి శుద్ధప్రతియనుకొని వ్రాసిన దానిలోనే మఱొకసారి చూచుకొనగ కొన్నిసవరణము లవసరమని పించి. దిద్దుబాటులు హంసపదములు బెట్టుటయు, దానికి తిరిగి శుద్ధ ప్రతివ్రాయు నవసరమును వచ్చినది. ఇట్లెన్నిసారులు చూచుకొన్నను దిద్దుబడులకు హద్దు లుండవనియు, సంతుష్టి ఎప్పటికి గలుగ నేరదనియు. యథాశక్తి సవరించి దీనిని బ్రకటింప సాహసించితిని.

ఈ గ్రంథప్రకటనకు మా నాయనగారి సంత్సంకల్పబలమే కారణము. దీనికి ప్రోత్సాహకులు, ప్రకాశకులు, పోషకులు, రాజ, మహారాజ పోషక, శాశ్వతపోషకు లని యేమనిను వారినే యనవలెను. ఏమనిన

ఈ గ్రంథముద్రణమున కాద్యంతమును నైన వ్యయమంతయు, దమ సొంత సొము త్తములోనుండి వ్యయించుటేకాక, ముం దుత్తరకాండ ప్రకటనమునకు కూడ బూనుకొని తమ యర్థమును బరమార్థ సాధనమునకు సార్థకబరచు చుండిరి. వారికెంతయు విధేయుడనై నమస్కృతము లర్పింతును.

"ఆనందకాననే హ్యస్మిన్ జంగమస్తులసీతరుః
కవితామంజరీ యస్య రామభ్రమరభూషితా"

అని మధుసూదన సరస్వతి యతీంద్రులవంటి సమకాలీన విద్వన్మణులచే సర్వథా ప్రశంసింపబడిన సర్వజ్ఞశిఖామణియు, యోగిపుంగవుడునై తులసీదాసు నిరహంకారియు, నిరాడంబరుడునై-

"కబినహోఉఁ నహిఁ వచన ప్రవీణా!
సకలకలాసబ్ విద్యాహీనా!"

"కవినింగాను ప్రవక్తగాను సుధియుంగా నక్షరార్థంబులన్
గవితాంచద్గుణ దోషనిర్ణయమునం గావ్యాంగముల్ నేర్వనే
వివిధంబౌ రసభావభేదములలో విజ్ఞుండఁగానెందునె
య్యావియున్ నేర్వను ఛందముల్ గళలు గావ్యాలంకృతుల్ వేనినిన్"

అని కేవలము బుధవిధేయుడై వినయము జూపుటకు చెప్పెనే కాని మానసగ్రంథ పరిశీలనమున పైపలుకు లాతనియెడ సార్థములుగ గనుపింపవు. కాని నా యెడల అక్షరశః అవి సార్థము లౌనని విన్నవింతును.

ఇచ్చట తులసీదాసునిగురించి యొకింత స్మరింపవలసియున్నది. భక్తశిఖామణియగు తులసీదాసు తన్నెవ్వరేమనిన సహించునేకాని తనయిష్టదైవమగు శ్రీరామచంద్రుని నరుడనినమాత్రము సహింపడు. అట్టివారిని భక్తిభావోన్మత్తుడై బ్రువ్వదిట్టును. తనరామప్రభువు నెచ్చట నరుడనికొని పాదురోయను శంకనుగానోపు తన మానస కావ్యమును అడుగడుగునకు, దివ్యసుమాసార సౌరభముతో, దివ్య దుందుభి నినాదములతో, దివ్యజయధ్వానములతో, సర్వత్ర దివ్య ప్రసంగములతో నింపినాడు. ఒక్కొక్కచో తాను భక్తిపరవశుడై

కథాప్రవాహమున కడ్డునిలిచి రామునిదివ్యగుణ నామాను సంకీర్తన మొనర్చి, తనతోపాటు శ్రోతలనుగూడ మానసామృత సరస్తరంగముల నోలలాడించుచు, భక్తిభావోన్మత్తుల జేసిగాని విడువడు. ఈతని గాఢభక్తి గనుగొన్నచో, వీరశైవులు, వీరవైష్ణవులన్నట్లే ఈతడు రఘువీరుని వీరభక్తుడనిపించును; కాని, మతావేశ పరవశులవలె అన్యమత నిరసనబుద్ధిలేదు సరికదా, ఈతనికి సర్వమత సంప్రదాయ సమన్వయబుద్ధియు, సహిష్ణుతయుకలదు. కావుననే తన మానసకావ్యమును సర్వమత సంప్రదాయములవారికి నచ్చుబాటుగా నుండునట్లు, సర్వ జనాదరణీయ మగునట్లు, సర్వదేవతల నిందు స్తుతించియు, శివకేశవుల యభేదభావము నిరూపించియు, ధర్మగ్రంథ స్వరూపమును జేసినాడు. కాశీప్రాంతమున నానాడు మేరమీఱు మత ద్వేషములనణంచి, సర్వమతసమీకరణ మొనర్చుటే గ్రంథోత్పత్తికి పరమాశయముగా గానవచ్చును. ఇటు లీమానసము దఱచిచూచిన నెన్నియేని విశేషములు గనవచ్చును. కవి మానసతలమువలెనే ఈ మానసతలమును గనుగొనుట దుర్లభము. కాని, అమృత మానసమునజొచ్చి, యథాశక్తిగ కడుపార నమృతము గ్రోలుటయేగాక తల స్పర్శకై యుక్కిరిబిక్కిరి గానేల?

తులసీదాసుని మూలగ్రంథమునకిది "మక్కికి మక్కియైన తెలుఁగుసేఁత"యనిమాత్రము చెప్పసాహసింపను. సాధ్యమైనంతవరకు మూలానుసరణమే కావించితి. ఒక్కొకచో భగవన్నుతుల పట్టుల తులసీదాసుని భక్తిభావావేశమునకు నాకైతవైత్యము తోడై వెఱ్ఱితలలువేసి మూలకారుని సిద్ధాంతములకు భంగముదెచ్చియుండ వచ్చును. నా శబ్దాడంబరలాలస యొక్కొకచో మానసామృత పిపాసుల రసాస్వాదనమున కడ్డుపగిలి, వారిస్వాంత ప్రశాంతికి భంగము దేవచ్చును. అట్టి నా యనభిజ్ఞతాదోషములు మూలకారున కాపాదింపక నాకే విడిచెదరుగాతయని మానసాభిజ్ఞుల వేడికొందును.

తాము నిరంతర బహుకార్య వ్యగ్రులయ్యును, ఈ గ్రంథము నంతయు సావధానమున బరిశీలించి, వీలైనపట్టుల సంస్కరించి, తొలు

పల్కుఁబోలు తమతొలిపల్కుతో గ్రంథప్రాశస్త్య మినుమడింప జేసిన మాన్యులు కొవ్వూరు సంస్కృత కళాశాలా ప్రధానాచార్యులు శ్రీ కేశిరాజు వేంకట నృసింహ అప్పారావు, ఎం. ఏ. గారి సహృదయ వాత్సల్యమున కెంతయు గృతజ్ఞుడనై, యభినందించుచు, వారు నన్నుఁగూర్చి వ్రాసిన విశేష వాక్యముల యాధిక్య మేమియు నాలో లేకపోయినను, వారిపల్కు లాశీస్సులుగా భావించి గ్రహింతును. నా వ్రాత తప్పుల కచ్చుకూరుపు తప్పులు తోడుగాగా వానిని బెక్కుసారు లోపికతో బరిశీలించి సవరించి ఈ మాత్రము నిర్దుష్టముగా గ్రంథస్వరూప మొసగిన మా మిత్రులు శ్రీ అనంత రామయ్యగారికి నా కృతజ్ఞతాభివందనములు.

గ్రంథరచనమునకు, ప్రచురణమునకు ఇదియే నా ప్రథమ ప్రయత్నమగుటచే నిందు పెక్కుస్ఖాలిత్యము లనివార్యములై దొరలినవి. ఆంధ్రభాషాభిమానుల ఆదరాభిమానములు ద్వితీయ ముద్రణావసరమున లభించినచో దానిలో నివిసవరించుకొందునని నా వినయ పూర్వకమగు విన్నపము.

కృష్ణంపాలెం
16 – 5 – 56

ఇట్లు, విధేయుడు
మైలవరపు సూర్యనారాయణమూర్తి

# విషయానుక్రమణిక

| విషయము | పుట |
|---|---|

శ్రీ

# ఆంధ్ర తులసీ రామాయణము

## బాలకాండము

---

## పీఠిక

### ఇష్టదేవతాస్తుత్యాదికము

ఉ. శ్రీగిరిజార్ధదేహుఁ డల శ్రీదయితాంఘ్రిధునీశిరస్కుఁ డా
శ్రీగిరివాసుఁ డీశ్వరుఁడు శ్రీదసఖుండు భుజంగభూషుఁ డా
శ్రీగళుఁ డష్టసిద్ధిదుఁడు శ్రీఫలలోలుఁడు మ మ్మనుగ్రహ
శ్రీగొదకోఁ గనుం గొనుచు శ్రీయుతుఁ జేయుత నాశుతోషి యై. 1

ఉ. చల్లని తండ్రి కూతురగు చల్లనితల్లి నొకర్తు సామెయిం
జల్లని దల్లి నింకొకతె సమ్మతి నొదలఁదాల్చి భూషగాఁ
జల్లన కెల్ల యెల్ల యగు చందురుఁ దాల్చి కృపారసంబుఁ బై
నెల్లడఁ జల్లు నల్ల పరమేశుఁడు చల్లనికంటఁ జూచుతన్. 2

ఉ. నాకుల పట్టుకొమ్మయి యనాకులులం బొనరింప నాకులన్
నాకులగొంగ నెత్తురును నాకిన తల్లి పినాకిపత్ని యై
నాకులతోడఁబుట్టు లలనాకులపావని సర్వభద్ర యా
నాకసరిత్సపత్ని కృప నాకొనఁ గూర్చుత సర్వభద్రముల్. 3

ఉ. నల్లనివాఁడు నాభినళినమ్మున బమ్మను గన్నవాఁడు, జా
బిల్లి యనుంగుజెల్లిలిని బేర్మి నురమ్మునఁ గొన్నవాఁడు, నా
పెల్లగు పాలవెల్లిపయి వేయి మొగంబుల పాపపాన్పునం
జల్లగఁ బండి లోకముల సాఁకెడు నాహరి మమ్ము బ్రోవుతన్. 4

ఉ. అమ్మలఁ గన్నయమ్మ, యనయ మ్మెద నిల్కడలేని కొమ్మ, యా
బొమ్మను బొడ్డుదమ్మిఁ గనుఁబ్రోడ యురమ్మున నాడుకొమ్మ, నె
త్తమ్మి వసించు నమ్మ, విరిదమ్ములఁ దాల్చెడు ముద్దుగుమ్మ, సం
ద్రమ్మొగిఁ గన్నయమ్మ, సిరి, తా సిరిసంతు లొసంగి ప్రోచెడున్. 5

మ. తొలివే ల్పాకటివేల్పుబొడ్డువిరికిం దొల్పాలు, ప్రాఁబల్కుప
ల్కులకున్ విద్దెలకెల్ల పెద్దదొర, పల్కుందొయ్యలిం గూడి యా
తెలిదమ్మిం గొలువుండుప్రోడ, పలువిద్దెల్ గూర్చు పెన్దంట, యా
నలుమోముల్ గల వేల్పుపెద్ద కరుణన్ మాకిచ్చు దీర్ఘాయువుల్. 6

ఉ. తెల్లని యెక్కిరింతఁ గడుఁ దెల్లని గద్దియఁ దెల్లవీణియన్
దెల్లనివల్వలన్ మిగుల దెల్లనయై నిలువెల్ల తెల్లనౌ
చల్లనితల్లి, వాణి దయఁ జల్లెడు చల్లని చూడ్కిఁ జూచుచున్
సల్లలితోక్తులన్ ననుఁ బ్రసన్నమతిం బలికించుఁ గావుతన్. 7

సీ. రాజరాజేశ్వరీ రాజరాజసఖువు
రాణదంపతుల గారాబు బిడ్డ,
గిరిసార్వభౌముని యరిమిలి మనుమఁడు,
నమరసేనానికి ననుఁగుఁదమ్ముఁ
డల వెండికొండను నెలవుండు బలియుండు,
నాదిపూజ్యుండు విఘ్నాధి పతియుఁ,
గరిరాజముఖుఁడును గణరాజు నయ్యును,
వ్రేలుడు పెనుబొజ్జ వేల్పు నయ్యు
గరికిపరకల పూజకె కరము మెచ్చు
నల్పసంతోషి యంచు విఘ్నాళినెల్ల
మాన్చు మం చడ్డు లెన్నంచు మన్చుమంచు
మంచుమలముద్దుమనుమని యెంచువాఁడ. 8

ఉ. అయ్యచలా భరావతరణార్థము పొక్కిలిదమ్మి బమ్మఁ గ
న్నయ్యకు మాఱురూపయి నరాకృతిఁ బుట్టిన యయ్య, లచ్చిఁ గ
న్నయ్యను గట్టినయ్య, హనుమయ్యను బ్రోచిన మేటిజియ్య, రా
మయ్య, తలంచు నయ్యల యహమ్మతిఁ బాపెడు నయ్య ప్రోచెడున్. 9

ఉ. అమ్మకు నమ్మ, యమ్మరుని యమ్మ, జగమ్ములఁ బ్రోచు కొమ్మ ల
చ్చమ్మకు మాఱురూపయిన యమ్మ, వసుంధర కన్నయమ్మ, లో
కమ్ముల పట్టుకొమ్మ, రఘుకాంతుని కూరిమి ముద్దుగుమ్మ, సీ
తమ్మ హితమ్ముఁ గూర్చి యనయ మ్మనయమ్ము లడంచి ప్రోచుతన్. 10

మ. మతి నెంతున్ హనుమంతుఁ గీశకులసామంతున్ సుధీమంతు సు
ప్రతిభావంతు ననంతు లంఘిత సరస్వంతున్ దరస్వంతు నా
సతతాబ్జాక్షపదాబ్జచింతనరతస్వాంతుం గృపాస్వాంతు సం
తతసద్భక్త మనోనిశాంతు నతిశాంతస్వాంతు సుస్వాంతునిన్. 11

## కవిస్తుతి

శా. శ్రీరామారమణుండు మున్నొకపు డుర్వీభారముం దీర్పఁగా
శ్రీరామాకృతిఁ దాల్చి చేసిన కథం జిత్రించి మున్ముందుగా
నారామాయణ మాదికావ్యముగ సర్వాంగీణసంశోభితం
బారీతిన్ వెలయించు నాదికవియా నావాల్మికిం గొల్చెదన్. 12

తే. పుట్టపుట్టువు నా గిరిం బుట్టి రహిని
రామవిభుఁ డను మేటి సంద్రానఁ గలిసి
ముజ్జగమ్ములఁ బావనముం బొనర్చు
పుణ్యరామాయణాపగ బుద్ధి నెంతు. 13

తే. వ్యాస వాల్మీకిముని కాళిదాస దండి
బాణ భవభూతి భారవిప్రభృతులైన

శ్రుతిపురాణాదికావ్య విశ్రుతసుకావ్య
కర్తలగు సత్కవీశుల గణుతి సేతు. 14

ఉ. నన్నయభట్టుఁ దిక్కమఖి, నర్మిలి నెఱ్ఱన సోమభీమ పో
తన్న హుళక్కిభాస్కరుల నాదట నైషధకావ్యకర్తఁ బె
ద్దన్నను బాండురంగకవిఁ దమ్మనఁ దిమ్మన సూరనార్యులన్
మన్ననఁ గొల్తుఁ గొల్తుఁ గవిమాన్యులఁ దక్కినవారి నందఱన్. 15

తే. రామకథ లాంధ్రభాష మున్ వ్రాసినట్టి
రంగనాథుని భాస్కరు రామభద్రుఁ
గోపినాథము వెంకనఁ బాపరాజుఁ
దెలుఁగువాల్మీకుల్ వావిలికొలను సుబ్బ
రాయ శేషాద్రిశర్మలఁ బ్రస్తుతింతు. 16

క. అచ్చపుబత్తి నుతించెద
లచ్చనముగ దాశరథివిలాసకృతి బుధుల్
మెచ్చ రచించిన బుధు నల
లచ్చయకవిఁ గ్రొత్తపలికులపయోధి విధున్. 17

ఉ. కోమలశయ్యఁ గావ్యములు గూర్చి శతాధిక కావ్యకర్తనాన్
భూమిఁ బ్రసిద్ధుఁడై వరలు భూరియశున్ బుధుఁ గ్రొత్తపల్లివం
శామలసింధుశీతకరు నర్థి నుతింతు మదీయ కావ్య మి
ట్లీమెయిఁ దీర్చి దిద్ది వెలయించిన సుందరరామ సత్కవిన్. 18

## భక్తజన వందనము

చ. సతతము రామనామగుణ సంస్మరణం బొనరించు టొండె కా
కితర మెఱుంగ నట్టి యఘహీనులఁ గొల్చెద రామభక్తులన్
హితమతి మారుతిన్ గుహు మహేశు నుమాసతిఁ ద్యాగరాజు నా
తత మతిఁ బోతనం దులసిదాసుఁ గబీరుని రామదాసునిన్. 19

క. త్రేతను వాల్మీకి యనన్
ఖ్యాతిని గాంచిన మహర్షి కలికాలమునం
దీ తులసీదాసుం డయి
ధ్మాతలమున నవతరించె గలివాల్మికినాన్. 20

క. ము న్నాత్మారామునకును
సన్నుతమతి హులసినాఁగ సాధ్వీమణికిన్
మున్నూరేండ్లకుఁ బై బడి
మున్నొకయెడఁ దులసిదాసు భువి జన్మించెన్. 21

తే. దుష్టనక్షత్రమునఁ బుట్టుదోషమునను
గన్న తలిదండ్రు లకట యక్కటిక వాసి,
బిడ్డ నాగాంగతటి వీడి వెడలి చనిరి
జడిసి నక్షత్ర గండదోషంబువలన. 22

ఉ. అంత నృసింహదాసను దయామతి యాపసివానిఁ దీసి, య
త్యంతముదంబునం బెనిచి, యర్మిలి రామకథావిశేషముల్
వింత లెఱుంగఁ జెప్పుచును విద్దెలఁ బెద్దయొనర్చి; వీడె స
త్స్వాంతుఁ డతండ యీతులసిదాసను వాసినిఁ గాంచెఁ బెద్దయై. 23

ఆ. దీనబంధుసుత సతీమణి రత్నావ
ళిని వివాహమాడి యనయ మాతఁ
డామెతోడిదె జగమన్నట్లులై కామ
కేళి లోలుఁ డౌచుఁ గేరుచుండె. 24

చ. అటుపటు కామకేళిపరుఁడై సతితోడిదె లోకమంచు న
న్నిటి మఱువన్, సతీమణి చనెం దనపుట్టినయింటి కొక్కనాఁ

డటు పతి యింటలేని సమయమ్మునఁ దోడ్కొనిపోవఁ దమ్ముఁ డం
తట నిలుసేరి యత్తులసిదాసును బ్రేయసిఁ గాన కింటిలో. 25

తే. ఆయుదంత మదంతయు నచటివారి
నడిగి కనుఁగొని మదిఁ దత్ప్రియావిరహము
క్షణము సైపక నడురేయి గంగదాఁటి
యత్తయిలుసేరి సతిఁగూడ నామె యనియె. 26

ఉ. సిగ్గుఁ దలంప కిస్సిరో ! నిశీథిని నన్ వెనుకాడి వచ్చితీ
వెగ్గన కస్థిచర్మమయ మీమలినాంగమునం దొనర్చు నీ
యగ్గలమైన ప్రేమ మిది యారఘురామునియం దొనర్చితే
లగ్గగుఁ గాదె నాథ ! భవలంపటముల్ దెగి ముక్తిఁ గాంచవే. 27

మ. వనితారత్న మిటన్న పల్కెదెదకున్ బ్రహ్మోపదేశంబుగాఁ
గను సంసార మసార మంచపుడ లోఁ గన్విప్పి నిర్విణ్ణుఁడై
యనఘుం డిల్విడి సర్వసంగసుఖసన్న్యాసంబుఁ గావించి చే
ర్చెను గాంతాకనకాంగసక్తమగు తచ్చిత్తంబు రామాకృతిన్. 28

తే. అటు పటు విరాగియై కాశి కరిగి ప్రేత
పరిచయమ్మున హనుమనిఁ బట్టి, యతని
పనుపునం జిత్రకూటాద్రిఁ జని తపించి
రామదర్శన విభవంబు రాణఁ గాంచె. 29

మ. అటుపై నచ్చోటువాసి వెల్వడి యయోధ్యాపట్టముం జేరి, య
చ్చట శ్రీరామచరిత్రమానసకృతిన్ సర్వాంగ సంశోభితం
బటుభక్తిప్రతిపాదినిన్ హరిహరాద్వైతార్థ సంధాత్రి నా
దట మీఱన్ రచియించె నల్ల తులసీదాసుండు సామాన్యుఁడే. 30

క. రామాయణముల నెల్లను
నా ముని మును నూఱుకోట్లు లంచనె నయ్యా
రామాయణముల సారము
నేమఱక గ్రహించి వ్రాసె నితఁ డిద్ధానిన్. 31

మ. కలికాలంబున యోగయాగజపముల్ గావింపఁ గావంచు నీ
తులసీదాసుఁ డెఱింగి లోకహితముం దోరంబు వాంఛించుచున్
లలి నీ రామచరిత్ర మానసకృతిన్ లాలిత్య మొప్పారఁ గాఁ
గలి కల్యాణనిధానకల్ప తరువోఁగాకంచు నిర్మించె మున్. 32

## తులసీ రామాయణ మాహాత్మ్యము

క. అవ్వారి బత్తిఁ జదువుదు
రెవ్వారు తులసీప్రణీత మీకథ నిలలో
నవ్వా రీ భవవారిధి
కవ్వలి దరిఁ జేరుకొందు రశ్రమములోచున్. 33

ఉ. సుందరమైన రామకథ సొంపుగ విన్న శుభంబు లిచ్చు నెం
దొందు రసాయనంబునకు నుద్దిని సిద్ధిని గూర్చు టందు మే
లిందలి యేడుకాండము లి వింద్రపురంబున కేడు మెట్లులై
యందము మీఱఁ బారకుల యచ్చపు నిచ్చలఁ దీర్చు నిచ్చలున్. 34

మ. అమరన్ సుందరమైన ఛందములఁ జెన్నొ మేటి చౌపాయిలం
గ్రమమై యొప్పెడు నాల్గు పాదములు ధర్మార్థంబులం గామమో
క్షములన్ నాల్గిటిఁ గూర్చు, నిందలి యలంకారంబులున్ రమ్యమై
యమరంజేయును గాంచుమాత్రమునఁ గామ్యార్థంబులన్ నిచ్చలున్.

ఉ. నిచ్చలు నీచరిత్రమును నెమ్మది నెంచినఁ బాపతాపముల్
విచ్చు, సమర్చనల్ సలుప భీతి తొలంగును భూతకోటిచేఁ,
జొచ్చుటకుం దలంకుదురు చూ జము బంటు లి దింట నుండినన్
హెచ్చును సంపదల్ సిగుల వెంతయు దీనిఁ బఠించునంతటన్. 36

శా. రాణించుం గవిచిత్తపద్మములకుం బ్రాభాతమార్తాండమై,
ప్రాణిస్వాంతచకోరవారమునకుం రమ్యంపు జ్యోత్స్నంబునై,
క్షోణిం గల్గు కుబుద్ధికాకములకున్ సూయాణబాణంబునై,
ప్రాణం బొచుఁ బురాణదేహమున శ్రీరామాయణం బీమహిన్. 37

సీ. దుఃఖద్రుమంబులఁ ద్రుంచు కుఠారంబు,
దారిద్ర్యకరికిఁ గంఠీరవంబు,
పాపాంధకారంబుఁ బాపు సూర్యాంశువు,
క్రౌర్యలోభాటవిఁ గాల్చు చిచ్చు,
మోహమనర్థ్మఁ దున్ను ముక్కంటివేలుపు,
నాశాపిచువుఁ గాల్చు నగ్నివేల్పు,
దుఃఖశోకభయాదితోయదంబులఁ ద్రోయు
వాయురూపకమును బావనమును,

బుద్ధి వికసింపఁజేసెడు పూజ్యవాణి,
నవరసాంభముఁ గురిపించు నవఘనంబు,
భవమహాంభోధి దాఁటించు ప్లవమునగుచు
మహిని వెలయును దులసిరామాయణంబు. 38

సీ. కుంఠితగతిఁ గాక కుంటి దీనిఁ బఠింప
నర్తకుఁ బలె నర్తనంబుసేయు,
ముదముతో నీకృతిన్ మూఁక వీక్షించిన
వాచస్పతినిఁ బోలు వక్తయగును,
త్రికరణశుద్ధితో దీని గ్రుడ్డి వినంగఁ
దమ్ములఁ బోలు నేత్రమ్ము లమరు,
ద్విజగోవిఘాతుకుల్ దీని భక్తిఁ దలంప
ముక్తిఁ గాంతురు పాపముక్తు లగుచు,

వేయునేల దీనిఁ బాయక పఠియింప
వివిధ జపతపముల వితరణముల
యజనభజన తీర్థయాత్రాదులను నేనిఁ
గాంచరాని ఫలముఁ గాంత్రు జనులు. 39

## స్వీయవంశ వర్ణనము

తే. భక్తిఫలమాధురిఁ రఘుప్రభునిఁ దనిపి
భరత పరివారమును భోగవైభవముల
ముంచి, తనిపించి, విందుఁ గల్పించినట్టి
యతుల సుతపోమహామహిమాన్వితుండు. 40

తే. ఇద్ధరామకథా శ్రవణైకపరత
యాజ్ఞవల్క్యుల నోటఁ గొండాడఁ బడిన
ధన్యమతియైన యా భరద్వాజమౌని
పేరిటన్ గోత్రమొండు పెంపారె నందు. 41

క. భారద్వాజసగోత్ర
క్షీరార్ణవపర్వపూర్ణశీతాంశుఁ డనన్
సారాచారుం డచ్చన
గారొప్పెను మైలవరపు ఘనకులమణియై. 42

చ. కులమణి యాతఁ డచ్చన సుకోమలచిత్తుఁడు, సత్ప్రవృత్తుఁ డా
కొలచిన వంశపావనినిఁ గోమలిఁ బల్లమసాధ్విఁ బెండ్లియై
నలువురఁ బుత్రులం బడసె నర్మిలి నారమణీమణిం గడున్
సలలితమూర్తులం బరమ శాంతుల దాంతుల సత్ప్రవృత్తులన్. 43

సీ. కలశధారాహతిఁ గులిశధారగఁ జేసి
పులి నొవ్వ మోఁదిన బలియుఁ డొకఁడు
విశదగతిం బంచదశకర్మముల్ బొన
ర్పింపనేర్చు సుధీవరేణ్యుఁ డొకఁడు
స్నానసంధ్యా జపధ్యానదేవసమర్చ
నాద్యనుష్ఠాన పరాయణుఁ డొకఁ
డతి చిత్రలేఖనాచితి నతిచతురుం డ
లౌకిక ప్రజ్ఞావిలాసుఁ డొకఁడు
రామ సుబ్బ కోదండరామ నాంబ
నాఖ్యు లవ్వారు నలువురు నతిసుకృతులు
స్నానసంధ్యా జపాద్యనుష్ఠాన పరులు
సతతనిష్ఠాగరిష్ఠులు సాధుమతులు. 44

క. అచ్చన సచ్చరితకుఁ బ్రతి
వచ్చెను యచ్చనకుమార్గవర్తన మని లో
నచ్చెరు వందఁగ భూప్రజ
లచ్చతురకుమారు లలరి రనఘచరిత్రులై. 45

చ. అనుజహితానువర్తనమునం దల రాముఁడె సాటి రామ నా
ర్యున కనిపించుకొంచు విబుధోత్తముఁ డచ్చన పెద్దబిడ్డఁ డా
యనఘచరిత్ర విస్సమ మహాసతిఁ బెండిలి యాడి కాంచె నా
సునయన యందు నచ్చనను సుబ్బన కామన రామనార్యులన్. 46

క. రామానుజుండు సుబ్బన
రామానుజకీర్తి నెగడి భ్రాత్రనురక్తిన్
ధీమతి సతి నాపుల్లమ
ధామామణియందుఁ గాంచె రామాఖ్యసుధిన్. 47

క. అమలినుఁ డచ్చన మూఁడవ
కొమరుఁడు కోదండపతియుఁ గ్రొత్తపలి కుల
ద్యుమణి యల వెంకనార్యుని
కొమరిత సుబ్బాంబఁ గేలుగొని యాసాధ్విన్. 48

క. సుతులఁ దతమతుల జనస
మ్మతచరితుల సాధుమతుల మాన్యాకృతులం
జతురుల నతిసుకృతుల నీ
క్షితి నచ్చన రామనామశిష్టులఁ గనియెన్. 49

ఆ. అచ్చన కడచూలి యాయంబనార్యుఁడు
వెంకమాఖ్య సతినిఁ బెండ్లియాడి
వితతయశునిఁ గాంచె వేంకటసుబ్బరా
యాఖ్యసుతుని సుకృతి నమలమతిని. 50

ఉ. తాతను బోలువారలు సదాచరణంబున, భూరికీర్తి మాం
ధాతను బోలువా, రల విధాతను బోలెడువారు విద్యలం
దాతతకీర్తు లాయనఘు లచ్చన మన్మలు సచ్చరిత్రు లా
భ్రాతలు దేవతార్చనపరాయణు లందఱు సాహితీయుతుల్. 51

క. అచ్చన మనీషిమనుమలఁ
గుచ్చిత మొక రెఱుఁగరందుఁ గోదండసుతుం
డచ్చనసుధి మిగులం బ్రజ
మెచ్చందగు సచ్చరిత్ర మెలఁగి యలఘుఁడై. 52

మ. అనఘుం డాతఁడు క్రొత్తపల్లికులవంశాంభోధి పూర్ణేందురా
మనవిద్వన్మణి పుత్రి బ్రహ్మమ సతీమాన్యం దగం బెండ్లియై
కనె నాపుణ్యచరిత్రయందు సుతలం గాంతాకులోత్తంసలం
బ్రణుతిన్ సుబ్బమసాధ్వి, సత్యవతి నాపైరామమన్ సూరమన్. 53

ఉ. తమ్ముని బిడ్డలంచు సతతమ్ము హితమ్మునఁ జూచుఁగాని, చి
త్తమ్మున నొండుఁ గాఁ గనఁ డతండల యచ్చనమాన్యుఁ డేమి య
బ్రమ్మది బ్రహ్మమాంబయు మరందియు సత్యము నాత్మసంతతిన్
నెమ్మది నొక్కరూపున గణించి కనుంగొను నన్న నిచ్చలున్. 54

చ. వినునదు వండిపెట్టఁగను వేవురకేన్ నదురేయి నన్నముం,
గొనరదు చేతినిండ నిడుకోఁగను భిక్షము భిక్షుకోటికిన్,
వినువదు బిడ్డలెంత విసివించిన నాగడమెంత చేసినం
గసరదు, బ్రహ్మమాంబసరిఁ గాంత్రెవ రల్లసతీమతల్లికల్. 55

ఉ. వాఁడియుఁ బంట నింటను నవారిగ నుండఁగ నచ్చనార్యుఁ డుం
జేడియ బ్రహ్మమాంబ తనుఁజేరి భజింపఁగఁ దోడఁబుట్టు వె
వ్వాడిని రామనార్యుఁ డనువ్రతుఁడై గృహకార్యభారముం
దోడయి తీర్పఁగాఁ బ్రవరతుల్యుఁ డనం దగె సచ్చరిత్రుఁడై. 56

సీ. అనుమానమును మాని తనుమానివోనియు
నతిథి కన్నము పెట్టు నన్నదాత,
గతిమాలి బ్రతిమాలు నతిదీనులను గాంచి
పైఁ బుట్టమేనిడు వస్త్రదాత,
బక్కచిక్కనయాల బలుపెక్క మేఁపించు
నిరత గోరక్షణ నిరతబుద్ధి,
గుప్పెడు గింజల గుప్పి పుట్లాదిగఁ
బండించు హస్తప్రభావశాలి,
యతులసద్గుణమతి యతిథిపూజారతు
డతిదయామతి జననుతచరితుఁడు
బహుపురాణ మననపాఠన శ్రవణాను
రక్తుఁ డతని కొకఁడుఁ బ్రతి కలండె. 57

క. కన్యాదానము లొసఁగె య
థాన్యాయముగాఁగ నాల్గు స్థాపించెను స
న్మాన్యుఁడు వనకూపంబుల
ధన్యాత్ముం డతని కెనయె ధాత్రి నొకండున్. 58

క. అచ్చన సచ్చరితం బల
నచ్చుగ వేనోళ్ల పాపకైన గణింపన్
వచ్చునె యనుచున్ జనములు
మెచ్చఁగ మనె నరువదేండ్లు మేదురకీర్తిన్. 59

క. ఆతని కనుజన్ముం డయి
పూతయశుఁడు రామమూర్తి పుణ్యచరిత్రుం
డాతతమతి తగు సుగుణ ప
రీతుఁడు కోదండ పతికి రెండవకొడుకై. 60

మ. కొమ రొప్పారఁగ నచ్చనానుజుఁడు తత్కోదండసూనుండు స
ద్విమలాచారుఁడు రామమూర్తి తొలుతం బెండ్లాడి సాధ్వీమణిన్
విమలాత్మన్ గరిపెద్ది సుబ్బయసుధీ వెంకాంబికా పుత్రికన్
సుమతిన్ సీతమ నా సతీతిలకమున్ సొంపార నమ్మోదటన్. 61

ఆ. క్రొత్తపల్లి సత్కులోత్తముఁడౌ వెంక
యార్యున కల మంగమాంబికకును
ననుఁగుఁ గూఁతురైన యాసుబ్బమాంబను
బెండ్లియాడె నతఁడు వితతయశుఁడు. 62

క. ఆడదు పరుసముఁ బతికెదు
రాడదు తన్నొకరు నొవ్వనాడిన యేన్ మా
టాడదు నవ్వులకేన్ బొం
కాడదు తత్సుబ్బమాంబ యమలచరితమ్మై. 63

క. పీడదు సత్యవ్రతమును
వేఁడదు స్వస్థితికి మించు వేడుక లెవియుం
బాడిఁ దొరఁగినుడి యాడదు
నీడే సుబ్బమసవిత్రి కే యంగనయున్. 64

తే. పుణ్యగుణనిధి యారామమూర్తి సుధియు
నైహికాముష్మికగతుల కడ్డులేని
గతిదయాసత్య శౌచముల్ గలిగి మనును
సతతనిష్ఠాగరిష్ఠుఁడై సద్వ్రతుఁ డయి. 55

మ. తమి మీఱంగ గడు శ్రద్ధ స్నానజపసంధ్యావందన బ్రహ్మయ
జ్ఞము లాపైఁ బితృతర్పణంబు రవిహృత్సంస్తోత్ర పారాయణం
బమరన్ దేవసమర్చనావిధియు రామాఖ్యాయికా పాఠముం
బ్రమితిం దారకమంత్రరాజ జపముం బంచాక్షరీ జాప మా
యమలాచారుఁ డొనర్పకుండఁ గుడువం డన్నంబు నేఁ ప్రొద్దునన్. 66

ఉ. తారకనాము రాము భవతారకమంత్రము వేలకొల్ది నే
వార మహర్నిశంబెపు డవారి జపించుచునుండు నా సదా
చారుఁడు సర్వకాలముల సన్నియమంబునఁ జిత్తవృత్తి నే
కోరికిలేక యేపనిఁ దగుల్కొనినన్ క్షణమూరకుండకే. 67

ఉ. వార్ధకమందు నేన్ బయిరుబాగరయం బశుపర్యవేక్షణన్
అర్థిఁ బొలాన కేగుచు గృహంబున స్నానము సందెవారుపున్
బ్రార్థనముం బొనర్చుచును భాగవతార్థములే పఠించుచున్
వ్యర్థకథా ప్రలాపముల నర్థనిమేషము వ్యర్థపుచ్చకే
సార్థకముం బొనర్చుఁ జరితార్థుఁడు జీవన మెల్లరొనసన్. 68

క. ఆయన సుకృతివిశేషము
వ్రాయను దరమౌనె సతతరామాయణ పా



భవవిదారక తారక భవ్యమంత్ర
సంతతధ్యాన మనన దీక్షారతుండు
శ్రుతిమతాచారపరుఁడు మత్పితృవరుండు
రమ్యగుణమూర్తి, సత్కీర్తి, రామమూర్తి.

రాయణ పరాయణుం డెపు
డాయన పలుమాట లింక నాడఁగనేలా. 69

తే. యాజుషస్మార్తమంత్ర తంత్రాంగ మెఱఁగి
పంచదశకర్మములను సమంచితగతి
నొనరిపింపఁగనేర్చి తానొనరనేర్చి
చేసెఁ దనయంతవారిగా శిష్యవరుల. 70

ఆ. జ్యోతిషంబున సుముహూర్త భాగమెఱింగి
సంస్కృతాంధ్రములను సాహితిఁ గని
మంచిచెడ్డ లరయు మంచిసమంచిత
ప్రజ్ఞఁ డితఁ డనంగ వాసిఁ బరఁగె. 71

తే. తీర్థయాత్రాపరుం డౌచుఁ దిరిగి సుకృత
రాశి కాశీగయాతీర్థరాజములను
జననము ఫలింప గంగమజ్జనమొనర్చి
దేవదర్శన మొనరించి తృప్తిమీఱి. 72

తే. నిత్యతర్పణమునఁ గాక నియతిఁ దనిపి
తన పితాళ్లగయాపిండ తర్పణమున
తత్పితౄణవిముక్తుఁడై ధన్యుఁడయ్యె
రమ్యగుణమూర్తి కోదండరామమూర్తి. 73

ఆ. అమలవర్తనమున నాపుణ్యదంపతు
లిహాపరగతుల గడియించుకొనుచు
సీతమాచ్యుతాఖ్య స్త్రీసంతతిని నన్ను
నేకపుత్రుఁ గాంచి రేనునందు. 74

## స్వవిషయ ప్రస్తావనము

ఉ. అందని మ్రానిపండ్లఁ గయి మ్రాఁచుటకుం దగువాఁ డనంచు నే
నుం దగువాఁడనంచును దెనుంగొనరింపఁ గడంగినాఁడ హిం
దిం దులసీసుధీంద్రుని కృతిన్, వరభక్తిరసప్రధానఁ, ద
త్సుందరరామగాథఁ గవిసూరియశంబు గడించు నాసతో. 75

ఉ. పద్దెముఁ బట్టి పద్దెమును వ్రాయుటె కాని తదీయ లక్షణం
బెద్దియనన్ వచింపఁ జన నిట్టిడి నేటికి వ్రాసి తందు రేన్
దద్దయుఁ బ్రేచె నా తులసిదాసుని నిస్తులభావవైభవం
బద్ది తెలుంగునాటి ప్రజకందఁగఁ జేయు తలంప నన్నిటుల్. 76

ఉ. మున్నిది గద్యపద్యముల మున్నిటివారె తెనుంగు సేసి రీ
వు న్ననువొప్ప నియ్యదియ పూని రచింపఁగ నేటికన్న వి
ద్వన్నుతమైన యత్తులసిదాస సుధామయవాణియందు రా
మన్న చరిత్ర మెందఱెటులాడిన వింతయువిందుఁ గూర్పదే. 77

చ. మృదుమధురంబు గాదనుచు మించి రసంబది తేనెవాకలై
యొదవదటంచు నాదుకృతి నొం డెవరేనియు వెక్కిరింతు రం
చదవద యేల నాకు నరుణాన్వయపావను సచ్చరిత్రముం
బాదవిని భక్తవర్యునుడువుల్ జుడి దీనికి మూల మన్నచో. 78

క. హరికథ లపశబ్దంబులఁ
బరఁగియు నఘహరములంచుఁ బాటించియు నేఁ
సరసు లిడి యాదరింతురు
మొఱకు సరకు సేయకున్న మోదమ యాఁగా. 79

# కృతి సమర్పణము

ఉ. మానుగ మున్ను తెలుచును మానిత రామకథా స్రవంతిలో
మానినిఁ గూడి తారకసుమంత్రజపం బొనరించు నెవ్వఁ డ
వ్వాని కతిప్రియం బిదని పట్టముఁ గట్టుదు సర్వమంగళా
జానికి జానకీధవుని చారుచరిత్రము దీని నియ్యెడన్. 80

షష్ఠ్యంతములు :—

క. శంకరునకు నిజభక్తవ
శంకరునకు, దుష్టదైత్య సందోహవినా
శంకరునకు, నఘహరునకుఁ
బంకరుహాభ వార్చితాంఘ్రిపంకరుహునకున్. 81

క. హరునకుఁ, బురసంహరునకు,
నురగాభరణునకు, నాశ్రితోద్ధరణునకున్,
గిరిజాహృత్సరసిజబం
భరునకు, నాశాంబరునకు, భవహరణునకున్. 82

క. గజచర్మాంబరధరునకు
గజపూజాలోలునకును, గజముఖపిత, కం
గజరిపునకు, గజరిపున క
గజాననసరోజరవికి, ఘను నజగవికిన్, 83

తే. మది సమర్పింపఁగోరి యిమ్మై రచింపఁ
బూనినట్టి రామచరితమానసాఖ్య
మైన యీయాంధ్రతులసిరామాయణ కృతి
కెలుకపరతుఁ గథావిధం బెట్టిదనిన. 84



శ్రీరామచరిత మానస రచనానిమగ్నుఁడు శ్రీ తులసీదాసు, హనుమల్లక్ష్మణ సహితుఁడై తన చరితమును మధురకవితారూపమునఁజూచి మురిసిపోవుచున్న శ్రీరామచంద్రుఁడు.

శ్రీ

# ఆంధ్ర తులసీరామాయణము

## బాలకాండము

---

### మంగళాచరణము

క. శ్రీకరమగు వర్ణములకుఁ
ప్రాకటఛందోర్థములకు రసములకు శుభా
నీకమునకుఁ గర్తలరగు
నాకమలాసనసతీ గజాస్యులఁ గొలుతున్. 1

శా. సిద్ధుల్ స్వాంతపదస్థులై వెలయు నా జీవాంతరవ్యాప్తులన్
శ్రద్ధావిశ్వసనంబు లెవ్విడి కాంచం జాలరో యట్టి స
చ్ఛద్ధావిశ్వసనాత్ములై పరఁగు దుర్గాభర్గులం గొల్చెదన్
శుద్ధంబౌ గురుభక్తి హత్తుకొనఁ గేల్జోడించి యెల్లప్పుడున్. 2

ఉ. ఎందున వక్రచంద్రుఁ డతఁడెవ్వని యాశ్రయమంది యెల్లచో
నందెను వందనార్హతను నట్టి మహేశ్వరరూపు మద్గురున్
సుందర సద్గుణాన్వితుని సుస్థిరు నిత్యుని జ్ఞానరూపు నే
వందన మాచరింతు నతిభక్తిని మస్తము నేల నత్తుచున్. 3

క. సీతారాములగుణసం
ఘాతంబను దురవగాహకాంతారమునం
బ్రీతిఁ దిరుగు విజ్ఞానుల
నేతలఁ నేఁ గొల్చెదం గపీశుఁ గపీశున్. 4

తే. సంభవమునకు సంస్థితిసంహృతులకు
నంతకును దా నిదానమై వంతలెల్ల
బాయఁ జేయుచు శ్రేయముల్ దాయఁజేయు
సీతకున్ భూతమాతకు జోతఁ జేతు. 5

ఉ. ఎవ్వని మాయ నిజ్జగములెల్ల నజాదిసురాళి బద్ధమౌ,
నెవ్వని శక్తి రజ్జున నహిభ్రమ మట్టు లనిత్యసృష్టిపై
నివ్వటిలున్ సదూహ, భవనీరధి కేనిపదంబ తెప్పయౌ
నవ్విభు రామదేవుఁ డనునాఖ్యఁ బరంగు హరిన్ స్మరించెదన్. 6

మ. అల నానానిగమాగమాంచితపురాణాంగీకృతంబై భువిన్
నలువౌ వాల్మికిరామకావ్యకథ కన్యత్రానుసంధేయగా
థలఁ గొన్నింటినిఁ గూర్చి దీనిఁ దులసీదాసుండు భాషాప్రబం
ధలసన్నిర్మితిఁ జిత్తశాంతిసుఖసంధానార్థమై చేసెడున్. 7

క. శ్రద్ధాభక్తులఁ గొలిచిన
సిద్ధిని జేకూర్చునట్టి శివగుణసదనుం
డిద్ధగుణరాశియగు నా
సిద్ధిగణేశుండు సఫలుఁ జేయుత నన్నున్. 8

ఆ. మూఁగ యెవ్వనికృప వాగీశసముఁ డౌనొ
కుంటి యెవ్వనికృపఁ గొండలంటు
నా కృపాళుఁడు దురితాపహారి యెపుడుఁ
గనికరమునఁ బ్రోచుఁ గని కరంబు. 9

తే. నల్లకలువల చాయ మైనలుపువాఁడు
తనరు కెందమ్ములం బోలు కనులవాఁడు,
పాలకడలి పరుండు కృపాపరుండు,
శాంతిఁ గొనుత మత్స్వాంతనిశాంతమునను. 10

ఆ. ఇందుకుందములకు నీడొందు మైచాయ
నెగడి దీనులందు నెమ్మిఁ జేయు
చుండు న య్యుమేశుఁ డోముతఁ గృపఁజూపి
మదనమదవిదారి సదయహృదుఁడు. 11

## గు రు వ ం ద న ము

క. భంజనమగు మోహతమః
పుంజమునకు నెవనిపలుకు ప్రొద్దువెలుంగౌ
నంజలి యిదె యాగురుపద
కంజములకు నృహరిరూపకరుణోదధికిన్. 12

సీ. ఘోరసంసారరుగ్వారము వారింప
సుందరామృతమూలచూర్ణ మిద్ది,
నిజభక్త హృదయ మన్ నిద్దంపు టద్దంబు
శుద్ధం బొనర్చెడు చూర్ణమిద్ది,
పూతమై మోదప్రసూతమై యొప్పు
భూతేశుమైపూఁత భూతి యిద్ది,
తిలకమ్ము నిడ ఫాలఫలకమ్మునందున
సుగుణంబు లొనఁగూర్చు చూర్ణమిద్ది,
సరస సుస్వాదువాసనాసంయుతాను
రాగగురుపదపద్మపరాగ మిద్ది,
సాఁగి మ్రొక్కెదఁ దత్పత్పరాగమునకు
గురుతరంబైన గురుభక్తి గుదురుకొలిపి. 13

క. గురుపదనఖమణికాంతుల
స్మరియింపఁగ దివ్యదృష్టి సరగుసఁ గలుగున్

బోరవిడు హృన్నేత్రములకు
వరమతి నవ్వాని నిల్పువారలె మాన్యుల్. 14

క. హారణంబులు భవరజనీ
కిరణంబుల కగమ సుగమకీర్తిత భగవ
చ్చరితాత్మక రత్నమణి
స్ఫురణంబులు గురుపదనఖశుభకిరణంబుల్. 15

శా. సిద్ధుల్ సాధకులుం గనుంగవకు నాసిద్ధాంజనం బూని యా
వద్ధాత్రిం గల చిత్రముల్ గనుగతిన్ వర్చోర్థినై కండ్ల దృ
క్శుద్ధిం గూర్పఁగ దృగ్రుజం బణఁపఁ జక్షుఃపేయ మాచార్య స
త్పద్మాళ్యంజన మద్ది సంసృతివిడన్ వర్ణింతు నీసత్కథన్. 16

## సుజనవందనము

ఉ. ముందుగ దోయిలింతు మది మోహసముద్భవసంశయంబులం
జిందఱసేయు భూసురులఁజేరి తదంఘ్రులఁ గొల్చి యాపయిన్
వందన మాచరింతు గుణపాళికిఁ దావళ్లైన సత్సుధీ
బృందము నంతకున్ మిగులఁ బ్రేముడి నానుడు లాదరింపఁగన్. 17

మ. అరయన్ నీరసమున్ గుణాత్మకఫలం బౌచుం బరచ్ఛిద్రముల్
పరగం గప్పుచు మానరక్షణ మొనర్పం బుట్టనై పుట్ట దు
ర్భరకష్టంబులకోర్చి జీవనము సర్వంబుం బరార్థంబుగా
నుర కర్పించెడు ప్రత్తిమా నటు పరార్థోజ్జీవనుల్ సాధువుల్. 18

ఉ. మంగళమౌ సుకర్మమను మండలితో రఘురామభక్తి నా
గంగను, గర్మగాథయను కల్మషహారిణియౌ యమస్వసన్
రంగవిభూత్తమస్మృతి సరస్వతితోడను గూడియుండు నా
జంగమతీర్థరాజమగు సాధుసమాజముఁ గొల్తు నిచ్చలున్. 19

సీ. శ్రవణమాత్రమునను శివదాయకంబగు
హరిహరచరితాళియను త్రివేణి,
నాత్మధర్మమనెడు నచలత్వమునుగల్గు
విశ్వాసమను వటవృక్షమునను
నలరుచుండెడు నిది యనుపమానమ్మును
మోదమంగళ మయంబై దళకొని
యకథనీయమ్ము సుప్రకటమహిమము నై
సద్యఃఫలంబు లొసంగుచుండి,
యెల్లవేళల నెల్లచో నెల్లరకును
సులభసేవ్యంబు శ్రితదుఃఖ శోషకంబు
నగుచు వెలయును సాధుజనాళి భువిని
జంగమాత్మక తీర్థరాజం బనంగ. 20

ఉ. జంగమతీర్థరాజమును శ్రద్ధమెయిన్ వినినం దలంచినన్
బ్రుంగిన బొందితోడుతనె పొందుదు రాపురుషార్థసిద్ధు లె
న్నంగఁ దదీయసంగతిని స్నానఫలంబు వినుండు దాన మా
ఱుంగద కాకి కోకిలగఁ గ్రుంచమె యంచగ నబ్బురంబుగన్. 21

ఉ. పుట్టను బుట్టియుం, గడవఁ బుట్టియుఁ, దొల్లిటిపుట్టు తొత్తునం
బుట్టియు సాధుసంగతినె పూనికి నింతటివారమైతి మం
చిట్టులు తాము తామ వచియింపరె స్వస్వజనుర్విశేషసం
ఘట్టములెల్ల వాల్మికు లగస్త్యులు నారదమౌని మువ్వురున్. 22

తే. క్షోణిఁ గల చతుర్విధజీవకోటి నెవ్వఁ
డెందొకింతేని యున్నతి నొందెనేని
మహి నదెల్లను సత్సంగమహిమనె సుఁడి
ధాని మించెడుగతి శ్రుతినైన లేదు. 23

తే. ఇట్టి సత్సంగ మిదిలేని యెడల జ్ఞాన
మెనయఁ బోదది రామకృపైకలభ్య
మిదియ మూలంబు మంగళవృద్ధులకును
ఫలము సంసిద్ధి తద్యత్నములె సుమములు. 24

ఉ. లోఁగక దుష్టసంగతికి లోఁబడి యుండియుఁ దాస్వభావజం
బౌగుణ ముజ్జగింపఁడు మహాత్ముఁడు నాగఫణామణిం బలెన్
బాగుపడున్ సుసంగమునఁ బారద మంటిన లోహరీతిగా
నోగును సాధుసంగఫల మూరక డాచిన డాగఁ బోదిలన్. 25

తే. మువురు మూర్తులు వాణియుఁ గవులు బుధులె
సాధుమహిమంబు వర్ణింపఁ జాల రనఁగ
దాని వర్ణింప నాతరమా నె కూర
బేరగాఁ డెట్టు మణులకు విలువకట్టు ? 26

ఉ. దోసిటఁ గల్గుపూలు కయిదోయికిఁ దావుల నొక్కరీతిగా
వీసము వామదక్షిణ విభేదములేక యొసంగునట్టుగన్
వీసము మిత్రశాత్రవ విభేదములేక హితమ్ము లెల్లచో
వాసి నొనర్చు సర్వసమవర్తన చిత్తులఁ బ్రస్తుతించెదన్. 27

తే. మత్స్వభావంబు స్నేహంబు మదిఁ దలంచి
చాల నమ్రమనివేదన మాలకించి,
రామపాదాంబుజాతానురక్తి నిడుఁడి
సరళచిత్తుల్ జగద్ధితుల్ సాధులార ! 28

## దుష్టజన వందనము

చ. పరహితహానిచే నెపు డపారముదంబును బొంచు చుంటయున్
బరహిత లాభమూలమున వంతలఁ జింతల వేఁగుచుంటయుం
బరగి నిరర్థకంబుగను బక్షవిపక్షము లూనుచుంట లె
వ్వరికి స్వభావసిద్ధములో వారలఁ గ్రూరులఁ గొల్తు ముందుగన్. 29

తే. నిద్దురకుఁ గుంభకర్ణున కుద్ది యగుచు
దురితధనమున ధనపతితుల్యు లౌచు,
నగ్ని తేజము మహిషాసురాగ్రహంబుఁ
గలిగి వర్తిలు ధూర్తుల గణుతిసేతు. 30

తే. క్షితిజతతికెల్ల నొకరీతిచేటుఁ గూర్ప
నాఖలోదయ ముల్కోదయమ్ము సుమ్ము
హరిహరులసద్యశశ్శశి నణఁచి మ్రింగఁ
దులువలెల్లరు రాహుకేతువులు సుమ్ము. 31

తే. పరులఁజెఱచి తానుం జెడు పలువబ్రతుకు
చేలపంటలఁ జెఱచి తా నేలఁ గలియు
మంచుగడ్డల బ్రతుకులటంచుఁ దలఁచి
చేతులొగ్గుదు నాఖలజాతి కెపుడు. 32

సీ. పాఁపరాయనివలెఁ బదినూఱు నోళ్లను
గల్గియుందురు పరాఘముల నాడ,
వేల్పురాయనివలె వేయిగన్నులు గల్గి
యుందురు పరదురితౌఘ మరయఁ
బృథురాజు విధమున వేయివీనులఁ గల్గి
యుందురు పరదురితౌఘము విన,
గార్తవీర్యనృపాలు కరణి వేచేతులఁ
గల్గియుందు రకార్యకరణములకు,
నిట్లు పరహితఘృతమున నీగలౌచు
హితసురాదరణంబున నింద్రులౌచు,
వజ్రకాఠిన్య మూనఁగ వజ్రులగుచుఁ
బరగు ఖలులకు దరిఁజేర కెరఁగుచుందు. 33

క. ఇలను హితాహితులఁ దట
స్థులకును మేల్సేకుఱంగఁ జూడఁగ లేకే
వలవలలాడు నసూయా
కలితమతుల్ ఖలులకెల్ల కయిఁజోడింతున్. 34

ఉ. దోయిలినొగ్గి నే నిటులు తోరపుబత్తి నుతించుచున్న నీ
ర్ష్యాయుతచిత్తు లోర్త్రా తమసాజగుణంబుల మాననేర్తురో
షాయని ప్రేమఁ బ్రత్యహముఁ బాయసముం దినిపించి పెంచినన్
వాయస మెట్లు వాయుఁ దననంజుడు దిండి తలంపు సాజమున్. 35

క. కొలుతు మది సాధ్వసాధుల
నిల వారిర్వురును దుఃఖహేతుకు లైనన్
దొలఁగి కలఁచు నొకఁ డొక్కఁడు
కలియుచునే కలఁచు నందుఁగల భేదమిదే. 36

ఉ. ఒకయెడ నీటనే జనన మొందినఁ దమ్ముల జెల్లు జుమ్ములం
దొక యెడ నబ్ధినే జనన మొందిన నయ్యమృతాసవంబులన్
గకవికలై గుణాగుణవికారము వేఱుగఁ గానవచ్చు న
ట్లొకయెడఁ బుట్టినన్ సదసదోఘము తద్గుణముల్ విభిన్నమౌ. 37

క. అమృతామృతాంశు గంగా
సము లనఘులు గరళవాయుసఖకర్మనశా
సములు ఖలు లియ్య దెఱిఁగియుఁ
దము నచ్చిన వెంట్రుతు తారతమ్యముఁ గనకే. 38

క. అమర నమృతత్వ మొసఁగఁగ
నమృతము, మృతిఁగూర్చ విషము, యశమొందు క్రియన్,
దమతమ కర్మానుగతిన్
క్షమ సదసద్యశముఁ గాంత్రు సదసజ్జనముల్. 39

క. గుణముఁ గొను బుధుఁడు, ఖలుఁ డవ
గుణమునె కొను వారివురు గుణనిధు లగుటన్,
గుణదోషము లెఱిఁగించితి
గుణమెఱుఁగఁగవలయుఁగాదె కూడన్ వీడన్. 40

శా. రేయిన్ మాపును స్వర్గదుర్గతుల నుర్వీనాథులన్ బేదలన్
మాయన్ బ్రహ్మము నల్లజీవుఁ బరమాత్మం గల్మిలన్ లేములం
బీయూషంబును గాలకూటము నొగిన్ బృథ్వీసురున్ హింస్రునిన్
దోయం బుండెడిచోట్ల లేనియెడలం దోయంబులం బెక్కుఁటిన్. 41

శా. ఇష్టానిష్టము, లుచ్చనీచముల, దేవేంద్రారిసంఘంబులం,
గష్టామోదములన్, వృషాఘముల, గంగన్ గర్మనాశానదిన్,
భ్రష్టుల్ శిష్టులఁశోడుతన్ సకలతిర్యక్‌స్థావరాత్మంబుగన్
సృష్టించెన్ గుణదోషయుక్తముగ సంసృష్టిన్ విధాతృం డొగిన్. 42

ఉ. మంచిని జెడ్డ రెంటిని సమంచితరీతి సృజించు స్రష్ట ప్రా
పంచిక సృష్టి దోషగుణభాజన మంచును బల్కుచుండి తా
మెంచి గుణాగుణాంతరము లేర్పరుపన్ భువి వేదశాస్త్రముల్
గొంచక దుర్గుణంబు విడి కొంద్రు గుణంబుల సాధుహంసముల్. 43

ఆ. పాలఁ గ్రోలి నీటిఁ బాయు హంసమువలె
గుణమె కొను బుధుఁ డవగుణము విడిచి
యిట్టి గుణవిభేద మెఱిఁగిన యానాఁడె
గుణముఁగొను మన సవగుణము విడిచి. 44

తే. కాలకర్మస్వభావానుగతిని సుకృతి
ప్రకృతివశుఁ డయి సౌఖ్యంబు బాసిపాసి
పాడువడియును దిరిగి తాఁ గీడుగోడు
లన్నిటిం బాసి చక్కంబడు న్నరుండు. 45

తే. కాలకర్మస్వభావానుగతి ఖలుఁడును
జెట్టలనువీడి సుజనుల చెలిమిఁ జేసి
మే లొనర్చినఁ దిన్నగాఁ జాల దతని
ప్రకృతివక్రంబు మలినస్వభావ మెపుడు. 46

శా. వేషం బూనుచు సాధుఁబోలె ఖలుఁ డావేషప్రతాపంబునన్
మోసం బందునఁ ద్రోచి మూఢజనులన్ మ్రొక్కుల్ గొనుంగాని, యా
వేసంబుల్ తుదిఁ గాలనేమియును దుర్వృత్తుండు పౌలస్త్యుఁ డౌ
వ్వానిన్ రాహువుగొన్న వేషముగతిన్ బాటింపరా వెప్పుడున్. 47

ఉ. పూతులు హేయరూపమును బొందియుఁ బూజ్యులెకారె, జంతుసం
జాతుల నుద్భవించియును జాంబవదాదులు వాయుసూతియున్
బూతచరిత్రులై నటులు, భూతల మందున కీడు మేళ్ల సం
గాతము లోగుబాగులకు గారణముల్ శ్రుతివిశ్రుతంబుగన్. 48

సీ. మిన్నుఁ దన్నును ధూళి మింటిచూలిని గూడి
యదె నీటికూటమి నడుమునఁ బడుఁ
బలుకు సుజనునింటి చిలుక 'రామా' యని
చెట్టయింటి చిలుక తిట్టనేర్చు
ధూమ మంజనమౌను దుర్మైత్రి, నదె సుసం
గమున మసియయి శాస్త్రముల వ్రాయు ;
నాధూమమే జీవనాధారమౌ మేఘ
మగు గాలినిప్పుల నప్పులంటి
గాలియును నీరు గాములు చేలము లిటు
మేలివౌ మేలివస్తుల మేళమునను
జెట్టచెలుములఁ జేపట్టి చెట్ట లవును
జనులు తల్లక్షణంబులఁ గనుచు నుంద్రు. 49

క. వెలుఁగుం జీఁకటి పక్షం
బుల రెంట సమానమైన భువినవి భిన్నా
ఖ్యల శశిపోషక శోషక
ములుగా సదసద్యశంబు మొనయుం గాదే! 50

శా. ఉర్విన్ స్థావరజంగమాత్మక చతుర్యోని ప్రకారంబులన్
సర్వం బెన్బదినాల్గులక్షల తెగల్ జన్మించి యస్రభంబునం
దుర్విన్ దోయములం జరించు నల ప్రాణౌఘంబు లన్నింటికిన్
'సర్వం రామమయం జగ' త్తనునుడిన్ మన్నించి కేల్మోడ్చెదన్. 51

క. సురలసురలు గంధర్వులు
నరకిన్నరగగనచరులు నాగులు భోగుల్
కరుణింపుఁడు మీకెల్లర
కొరగెద నేఁ గరములొగ్గి యురుతరభక్తిన్. 52

## తులసీదాసుని స్వవిషయ వర్ణము

మత్తకోకిల:

ఆస సుంతయులేక నాకెద నాత్మబుద్ధిబలంబులన్
దోసిలించి నుతింతు నాదగు దోషముల్ పరికింపకే
వీస మొచ్చెము పొచ్చెమెన్నక విద్వదగ్రణులార! మీ
దాసుగాఁ దలపోసి నన్నెదఁ దద్దయున్ దయఁ జూడుఁడీ. 53

తే. వ్రాయఁ దలకొంటి నేను శ్రీరామగాథఁ
బోధపడ దొండు కవితాంగసాధనంబు
బోధపడాఁ బేదమది కెట్లగాధగాథ?
కొంచమదిపేద కీరాచకోర్కి తగునె! 54

క. ఎల్లిదుఁడు కొలఁదిమించిన
బల్లిదపుం గోర్కి సేయఁ బ్రల్లదమాఁ గాఁ
జల్లకయి యేడ్చు దేబెకుఁ
జెల్లునె యమృతాభిలాష సేయఁగ నెందున్. 55

ఉ. పిల్లల చిల్కపల్కులను బ్రీతి వినం దలిదండ్రు లట్ల యీ
పిల్లని పల్కులెల్ల వినువిందుగ విందురు సాధుహంసముల్
ప్రల్లదనంబు సైఁచి యిఁకఁ బ్రల్లదులెల్లరు గేలిసేసి యిం
దొల్లమిఁ దెల్పుచుండ్రు గుణమొల్లమి వారల సొమ్మగుం గదా! 56

చ. తమతమకైతముల్ రసయుతంబయినన్ రసహీనమైననేన్
బ్రమదము నొందురీతిఁ బరభాషితముల్ విని మెత్తురే ప్రజల్,
తమకెరటంపుఁ గల్మికి ముదంబునఁ బొంగు నదుల్ ప్రపూర్ణుఁడౌ
నమృతమయూఖు నున్నతికి నాకసమంటు సముద్రుఁ బోలునే! 57

ఉ. ఇంచుక నాదుభాగ్య మెదనెంచు దురాశ దురాసదంబు, నా
యెంచిన నమ్మకం బిదె సుఁడీ, తనివోవ బుధాళి, కించు లో
క్కించుక గేలిసేసినను, నేర్పడ దెట్టి కొఱంత దీని, కెం
దంచల పల్కులున్ బకసమంచును గొంచలు వెక్కిరించవే! 58

ఉ. ఎంచదె కాకి కోకిలము, నెంచదె భేకముఁ జాతకంబు, న
ల్లించిన మాత్ర నేమియగు? నే నిపుణుండనుగాను భాషయం
దించుక నారితేర, నగియించుచునే నిది రాఘవాంఘ్రియు
గ్మాంచిత భక్తిలేని వెడకైసపులన్ సయితంబుఁ దన్పెడున్. 59

తే. రామపాదాంబుజాతానురక్తి లేని
శఠుల కియ్యది తోఁచు నిస్సార పూచు
హరిహరాంఘ్రిలసద్భక్తి నలరు నమల
మతుల కిది తోఁచుఁ గడు శ్రుతిమధుర పూచు. 60

తే. భక్తిభూషితమతి గాఁగఁ బడసి దీని
సాధులెల్లరు శ్లాఘింత్రు సంతతంబు,
నిందు నాకున వ్రాసి వాక్రొందు నిజముఁ
జదువరింగాను మేటికై సరుఁడఁ గాను. 61

మ. కవినింగాను, ప్రవక్తఁగాను, సుధియుం గా, నక్షరార్థంబులం
గవితాంచద్గుణ దోషనిర్ణయమునం గావ్యాంగముల్ నేర్వ, నే
వివిధంబౌ రసభావభేదములలో విజ్ఞుండఁగా, నెందు నె
య్యవియున్ నేర్వను ఛందముల్ కళలుఁ గావ్యాలంకృతుల్ వేనినిన్.

ఉ. సర్వసులక్షణంబుల నసంగతమయ్యు మదీయకావ్యమున్
సర్వజగత్ప్రసిద్ధ మయి సచ్ఛుభమూల మభద్రహారియై
సర్వపురాణసార మయి శైలసుతాప్రియజప్యమంత్రమై
పర్వెన రామనామమున భాసిలుటన్ జనమాన్యమౌ నిలన్. 63

ఉ. సొమ్ముల నెన్నిఁటం బొలిచి సొంపెసలారిన మోము చంద్రబిం
బమ్మును బోలినం బొలఁతి వస్త్రవిభూషితకామి నామిటా
రమ్మది వమ్మెయై నటులు రాముని పేరునఁ బేరుకోని కా
వ్యమ్మది సర్వలక్షణ సమన్విత మయ్యు రహింప దెన్నఁడున్. 64

తే. గుణరహితమైనఁ గాకవిభణితమైన
గ్రంథమది రామనామ సంఘటితమైన
సాదులది వింద్రు వాక్రొంద్రు సాదరమునఁ
భ్రమరముల భంగి సద్గుణగ్రహణు లగుచు. 65

మ. కవితాలక్షణ మబ్బ దింతయిన నాకబ్బంబు రామప్రభా
వవరిష్ఠంబవు సాధుసంగమున నెవ్వా రున్నతిం బొంద రీ
యవనిన్ దివ్యసుగంధ బంధురమునై యాఘ్రాణయోగ్యంబునై
పావయుం గారుతనంబుఁ బోవిడుచుఁగాఁ బొం దొంది కాలాగురున్.

క. అగరున సుగంధ మొందెడు
పొగవోలెను నాదు కవిత పొసఁగని దైనన్
జగతీమంగళకరమయి
సొగసగు నారామకథను సొంపెసలారున్. 67

శా. మాంగళ్యావహ దుష్కృతాపహ యునౌ మర్త్యావ్యసచ్ఛయ్య యా
గంగాస్రోతసువోలె వక్రమయినం, గంజాక్షుసత్కీర్తితో
సంగాతం బొనరించి పూతమయి సత్సాధ్వోఘముం దన్పు నెం
చంగా నౌఁగదె కాటిబూదియు మహేశానాంగరాగంబుగాన్. 68

క. చందనము పొందు నందిన
నందలి తరువుల్ సుగంధ మందిన యట్టుల్
విందగు నందఱికిది రఘు
చందన సుయశస్సుగంధసంభరితంబై. 69

క. పుల్లావు పాలుఁ దెల్లని,
వల్లవె మేలంచుఁ గొందు రందఱు నటు శ్రీ
వల్లభు సుయశోవల్లిని
నల్లిన యిక్కైత గ్రామ్య మయ్యుఁ బ్రియంబౌ. 70

మ. మణులుం గెంపులు ముత్తెముల్ తమకు జన్మస్థానమాన్యంబులౌ
ఫణిభోగాచల కుంభికుంభములపై భాసిల్ల బోకెల్లెడన్
బ్రణుతిం జెందును రాట్కిరీటముల సద్భామాంగముల్ జేరియా
ఫణితిన్ సత్కవికావ్యముల్ విలసిలుం బ్రాంతాంతరవ్యాప్తిమై. 71

ఉ. ఇందలి భక్తిహేతువున నిందునఁ బర్విడివచ్చు వాణి తా
నందిన సేద తీరఁ జరితాపగ నిందు మునుంగకుండ నా
నందము నొందఁబోదది మనంబున నెంచి బుధుల్ కవీశు లీ
భందము వాపు విష్ణుకథఁ బాడుచు నుందురు నిచ్చలిచ్చమై. 72

క. ఈకరణి హరినిఁ బాడక
వాకొని ప్రాకృతుల వాకు వమ్మొనరింపన్
వాకులిడి సాకు వాక్సతి
యాకులపడి తెగచు వగచు నను తాపమునన్. 73

చ. హృదయ పయోధిలో నొదవు నీమదిము త్తెపుఁ జిప్పలందు వా
క్సుదతియ స్వాతికార్తెయయి కూడి తలంపులవానఁ జిక్క నా
యదనునఁ గైతముత్తియము లౌ నవి రామచరిత్ర సూత్ర మం
దదికి యుపాయసూచికను నయ్యది తాల్చిన భక్తి శోభిలున్. 74

ఉ. కాంచనకామినీరతులుఁ గాపథవర్తులు నొచు వీడి తా
మంచిత వేదమార్గమును నంచల వేసముఁ గాకి చెయ్యులన్
వంచకభక్తులంచుఁ దలవంబడు నీకలికాలనేములన్
మించిన పాపభాజనుల నేఁ దొలుదొల్త గణింప నయ్యెదన్. 75

క. ఈధర్మధ్వజు నవగుణ
గాథ యదంతయును నుడివి కడతేరఁ జుఁ డీ
గాథ నని తలఁచి మచ్చన
కీర్ధోరణిఁ బలికినాఁడ నెఱుఁగుఁ డిఁక బుధుల్. 76

ఆ. వివిధగతుల నాదు విన్నప మాలించి
యిందు దోసఁగు లెవ్వ రెంచకుండుఁ
డిందుపైన దోసఁగు లెంచుచునుండిరే
వారు నన్ను మించువారె సుండు. 77

తే. కవివరుఁడఁగాను జతురుండఁ గాను గాని
రామకథ వ్రాయఁ దలఁతుఁ బారంబుఁ గనని
చరిత మదియేడ సంసారసక్తిఁ దగులు
మది యిదేడని తలపోయ బెదురు గలుగు. 78

క. శ్రీరామమహిమ మెన్నఁగ
నేరరు శేషాదు లన్న నే నెటు నేర్తున్
మారుతవశమున మేరువె
ధారుణిఁ బడఁ దూల మెట్లు తాళును నిలువన్. 79

తే. నాలుగైదారువేయి మొగాలవారు
వాణియును వేదశాస్త్రపురాణతతియు
నెవనిగుణము లనంతమం చెంచుచుండు
నెల్లవేళల గానమం దిచ్చఁ దగిలి. 80

తే. అట్టి రఘునాథు మహిమంబు లిట్టి వనుచు
నెఱిఁగియును బాడకుండెద రెవ్వరతనిఁ
గీర్తనంబును స్మరణంబు మూర్తిపూజ
మున్నుగా భక్తి నాలుగు తెన్నులౌట. 81

సీ. రూపరహితు, విశ్వరూపు, విశ్వవ్యాప్తుఁ
బాపాపహరణు, సంతాపహరణు,
గతదోషు, నతతోషుఁ, గరుణావిశేషుని,
నపగతేషణు, స్వభక్తార్థవేషు,
బలవిశాలు, నబలపాలనాశీలుని,
భక్తపాలుఁ, గృపాలుఁ, బ్రణతపాలు,
నామజన్మవిహీను, రాముఁ, బరంధాము,
సచ్చిదానందుని నిచ్చ నెఱిఁగి,

తద్యశంబును వర్ణించి తమదు వాణి
సఫల మొనరించుకొందురు సత్కవు లని
యాతలఁపుబల్మి మదికిఁ బెన్నాత గాఁగ
రామవిభు నెంచి తచ్చరిత్రము రచింతు. 82

క. పుట్టం బుట్టిన ముని మును
బుట్టించిన చరితసరణిఁ బోవుట యనువోఁ
బట్టపుదార కట్టించిన
కట్టం బడి చీమ లేఖుఁ గడచిన యట్టుల్. 83

శా. ఆరీతిం దలపోత నూతఁ గొని మున్నాశ్రీహరిం బాడు నా
పారాశర్యవరాది పూర్వకవులన్ భాషాకవుల్ పూర్వులన్
శౌరిం బాడెడు వర్తమానకవులం జక్రిన్ నుతింపంగ నా
వారిన్ భావికవీశులం గొలిచి నే వర్ణింతు నీసత్కథన్. 84

క. ఇల రామకథల వ్రాసెడు
కలికాలపు గవులఁ గొలుతుఁ గరుణను గావ్యం
బిల సాధుజనాదరణము
వలనను బెంపొందు ననుచు వర మీయంగన్. 85

ఉ. పండితు లాదరింపని ప్రబంధసుసంఘటనా ప్రయాసముల్
దండుగలౌను బాలకవి తాఁబడు నట్టి ప్రయాసరీతి గ
న్పండువ గాఁగ సర్వసులభం బయి సార్వజనీనమౌ సరి
త్కాండము లట్టు లుండఁ దగుఁ గావ్యలసద్గుణ భోగసంపదల్. 86

చ. మెరమెర యేల నాకుఁ గడుమెత్తన రామచరిత్ర కైతయో
పరుస మటంచు నారలకుఁ బట్టునఁ గుట్టినయంచు రీతి నీ
చరిత మెసంగు మీకృపను సత్కథఁ బాడఁగఁ జాలు వాణియున్
సరళకవిత్వమున్ వరయశంబు నె మెత్తురు సాధుకోవిదుల్. 87

చ. పరులును సాజమౌ పగలువాసి వినందగ నుత్సహించు నా
సరళకవిత్వ మేర్పడదు సౌహృద మేర్పడ కట్టి ధీబలం
బరయ నొకింత లేదు కృప నర్భకు విన్నప మాలకించి స
చ్చరితసరోవిహార బుధసత్తమహంసములార! ప్రోవుఁడీ. 88

క. ఖరదూషణయుత మయ్యును
ఖరదూషణ మింత వడక కమనీయముగా
విరచించె రామకథ నే
పరమ తపోధనుఁడు వానిపదములఁ గొలుతున్. 89

క. కలనేని విసిగి వేసర
కల కలకాలంబు రామయశ మెంచెడు ని
స్తుల భవజలధి ప్లవముల
నలువేదంబులను గొలుతు నర్మిలి మీఱన్. 90

తే. సుజనుల సుధా సుధాకర సురభుల గతిఁ
బాపచిత్తుల విషసురారూపముగను
సంసరణవార్ధి సృజియించె స్రష్టయెవఁడు
వాని పదధూళి నిదె నేల్రవాలి కొలుతు. 91

క. సురభూసుర గురుబుధవర
చరణసరోజములఁ గొలుతు సాంజలి నగుచుం
బరమప్రసన్నమతులయి
కరుణను మదభీష్టసిద్ధిఁ గావింపంగన్. 92

మ. తలఁపుం బాపములెల్ల నోర్తు తన నీర్ద్రాగంగఁ దోఁగంగఁ, దన్
స్మరియింపన్ విన వాక్కొనం దొలఁచు నజ్ఞానంబు వేఁడోర్తె, యి
శ్వరునుం బూతచరిత్రలున్, భగవతుల్, పూజార్హులై మింతు, రా
హరిపాదోద్భవయున్, సరస్వతియు, నే నర్థింతు నాయిర్వురన్. 93

క. తల్లియుఁ దండ్రియు గురువులు
నెల్లగతులఁ దులసిదాసహితులును సీతా
వల్లభసఖగురుసేవక
వల్లభులును నా నుమా కపర్దులఁ గొలుతున్. 94

తే. మహిని లోకహితార్థ ముమామహేశు
లిష్టశాబరమంత్రముల్ సృష్టిసేయ
నక్షరార్థ సంయోగ మింతైన లేక
ప్రకటమహిమంబు లాయె నెవ్వారిమహిమ. 95

ఆ. అట్టి పార్వతీశు లనుకూలురౌఁ గాతఁ
గైతఁ గూర్తు రామగాథ నిపుడు
వారి జోతఁ జేసి వారిసత్కృపఁ జేసి
తత్కథానురక్తిఁ దగుల మిగుల. 96

మ. శశితారాయుతమా నిశీథినివలెన్ జానొందు మత్కావ్య మా
పశుపత్యంఘ్రికృపన్ బఠింప విన సౌభాగ్యంబుఁ జేకూర్చు, స
ద్యశమున్ రామపదానురక్తి నిడు, నార్యాశంకరుల్ నాపయిన్
వశులైనం గలనైన వారికృప నాపల్కుల్ నిజంబౌఁ జుఁడీ. 97

సీ. సకలపాపధ్వంసి సరయూపునీతమౌ
సాకేతపురమును సన్నుతించి,
ప్రభుకృపామృతవర్షపాత్రులౌ తత్పౌర
నరనారులకు భక్తి నతియొనర్చి,
జానకీ దూషకజనపాపమును బాపి
పరమపదం బిచ్చుప్రభుఁ దలంచి,
ఖలకమల తుషారుఁ గాకుత్స్థ శశిఁగన్న
ప్రాగ్రూప కౌసల్య భక్తిఁగొలిచి,
పుణ్యమంగళమూర్తి నా బుద్ధిఁ దలఁచి
దశరథేశ్వరు మహిషీత్రితయసమేతుఁ
జిత్తవార్తను శుద్ధినిజేరి కొలుతుఁ
బుత్రసేవకు నన్ గృపఁబ్రోవు మనుచు. 98

ఉ. వేనిని సృష్టిసేసి యల వేలుపుఁ బెద్దయుఁ బెద్ద యయ్యె, నే
మానితమూర్తి మారసుకుమారకుమారుఁడు కాన కేగ నా
సూను వియోగవేదనను సొంపిరిపోయి తృణంబు మాదిరిన్
మేను త్యజించి చూపెను వినిర్మలరామపదానురక్తి న
చ్చో నిజముం బొనర్చి, సుతసూనృతవత్సలు నెంతు, నవ్విభున్. 99

క. ఎవ్వని గూఢప్రేమము
నివ్వటిలుచు యోగభోగనియమంబులలో
నవ్విభు రాముని గన్న నె
మవ్వపుఁ దమి వెలసెనట్టి మైథిలుఁ గొలుతున్. 100

సీ. రామపదాంభోజరక్తిఁ బాయక యుండు
నేని చిత్తము లుబ్ధభృంగము వలె,
నట్టి యవర్ణ్యసంయమ నియమవ్రతు
భరతుఁ గొలిచి భక్తిభరితుఁడ నయి,
యద్యశం బల రామసద్యశోధ్వజమున
దండరూపకమాచుఁ దనరు, నట్టి
శేషాంశసంభూతు, శీతలు, సుభగు, స
మాశ్రితసుఖదు, దయాసముద్రు,
భూభయ మడంప నరరూపముననుఁ బుట్టి
నట్టి లక్ష్మణుఁ గరుణార్థినౌచు మ్రొక్కి,
శత్రుహంతను భరతానుచరునిఁ దలఁచి
తత్పదంబుల కర్థి వందన మొనర్తు. 101

ఉ. ఎవ్వనికీర్తి, దాశరథియే స్వముఖంబున సన్నుతించె ము,
న్నెవ్వని చిత్తమందిరమె యిమ్ము ధనుర్ధర రామమూర్తి, కే
నవ్విభు, నమ్మహాబలు, మహాబలపుత్రు, ఖలాటవీదవున్
మవ్వపు బత్తిఁ గొల్చెదను మక్కువతో నల యాంజనేయునిన్. 102

శా. వృక్షాటాధిపరాంగదాదికమహావీరప్లవంగావళిన్,
ఋక్షాధ్యక్షవిభీషణప్రభృతులన్, హీనాంగులై రామరా
ట్సాక్షాత్కారముఁ గొన్నవారలను, నిష్కామాత్ములై నిచ్చ రా
మక్షోణీశు భజించు జంతుజనసామాన్యమ్మునుం గొల్చెదన్. 103

క. ఉందురు రామోపాసకు
లెందఱు ఖగమృగసురాసురేంద్రుల నరులం
దందఱఁ గొనర్తు వందన
మిందున నిష్కామసేవ నెసఁగెడివారిన్. 104

క. ఘనవిజ్ఞాననిధుల్ శుక
సనకాదులు నారదాదిసకలమునీంద్రుల్
నను నాత్మీయునిగాఁ గని
యనుకంపఁ దలంపుఁడయ్య యంజలిఁ గూర్తున్. 105

ఆ. జనకజాత సీత సకలజగన్మాత
ప్రీత రామచంద్రభూతలపతి
కట్టి పుడమిపట్టి యడుగులఁ బట్టెద
నిద్ధబుద్ధి వడయు బుద్ధితోడ. 106

ఉ. పాయక దోయిలించెదను బాయని భక్తి నియుక్తిఁ జిత్తవా
క్కాయకశుద్ధిఁ బాణిధృతకార్ముకసాయకు మోదదాయి న
బ్జాయతనేత్రు నాశ్రితసహాయకు భక్తజనేప్సితార్థసం
ధాయకు భక్తలోకసుఖదాయకు శ్రీరఘువంశనాయకున్. 107

క. ఎన్నుదు వాగర్థంబుల
తెన్నున జలవీచిగతిని దెలియఁగ భిన్నా
భిన్నాత్ములైన రఘువుల
పున్నెపుదంపతుల ధరణిపుత్రీధవులన్. 108

తే. ఇనని శాకరపావక హేతుకంబు
విధి హరిహరాత్మకంబును వేదమయము
నగుణసగుణాత్మకంబు గుణాశ్రయంబు
నైన శ్రీరామనామంబు నర్థిఁ దలఁతు. 109

సీ. కాశికాకైవల్యకారకం బేనామ,
మెద్దాని జపియించు నీశుఁ డెప్డు,
డేనామ మహిమంబు నేకదంతుఁ డెఱింగి
యాదిపూజ్యుం డయ్యె నేది తలఁచి,
వ్యత్యస్తగతినైన యన్నామము జపించి
మున్నాదికవి యయ్యెఁ బుట్టతబిసి,
భూతేశుఁ డెవనిపే ర్నమ్మామ్ము దలఁచిన
వెయిరెట్ల ఫలమిచ్చు విధముఁ దెలిపె,
గౌరి దేని జపింప నమ్మారవైరి
మేటిగాఁ జేసి బోటి సామేనఁ దాల్చె,
నతఁ డెఱుఁగు రామనామమాహాత్మ్య మెల్ల
నతని కద్దానఁ గాదె చే దమృత మయ్యె. 110

క. ధర నీ తులసీదాసుఁడె
పరినాఱగు, రామభక్తి వర్షర్తు వగున్
బరఁగును దన్నామాక్షర
వరములె శ్రావణము భాద్రపదమాసమునై. 111

సీ. జిహ్వాయశోదకు శ్రీబలకృష్ణులు,
భక్తమనః పద్మబంభరములు,
సన్ముక్తిమయసుధాస్వాదసంతుష్టులు,
కమఠశేషాహులు క్షమ వహింప,
జగముఁ బాలింపఁ బెంపఁగ నరహరివిభుల్,
భువనైకహితమున రవిశశాంకు,
లిలఁ దులసీదాసహితమున రాఘవుల్,
భక్తివధూశ్రవోభరణములును,
నగుచు రెండును మధురరమ్యములు వర్ణ
నేత్రముల్ నిజభక్తహృన్నేత్రము లయి,
తలఁప వాకొన నూకొన సులభము లయి
తనరు రామనామాక్షరద్వంద్వ మిలను. 112

తే. బ్రహ్మజీవాత్మ లట్టులు రామనామ
వర్ణయుగము మిళితమై స్వభావమునను,
వర్ణమైత్రిని విడువక వర్ణనమున
నైహికాముష్మికసుఖంబు లందఁజేయు. 113

క. అక్కజముగ 'రామా' యను
నక్కరముల నొకటి ఛత్ర మనఁ బైనుండుం,
దక్కినది మకుటమణివలె
నక్కరముల నన్నిఁటన్ మహత్తున నెగడున్. 114

ఉ. నామము రూపమున్ సమము నాయకసేవకభావ ముండు నా
నామము రూప మొండిఁటను, నామము రూపము నీశుమాయలౌ
నామ మనాదిరూపము సనాతనమౌ నది వీనియందు నొం
డేమెయిఁ దారతమ్యముల నెంచి విభేదమొనర్చ నెగ్గగున్. 115

శా. నామాకారచరిత్ర మెంచిన నవర్ణ్యం బౌను జేసున్ననే
నామంబుం గనకుండ రూపమెఱుఁగన్ రాదెందుఁ దద్రూప మా
నామాధీనము గాన రూ పరయకే నామస్మృతిన్ నెయ్యమౌ
నామంబే సగుణాగుణాంశయుగళిన్ వాక్రుచ్చు సత్సాక్షియౌ. 116

క. మానస తమోంధతమసముఁ
బోనిడ, నంతర్బహిఃప్రబోధద్యుతికై
పూనుము జిహ్వాగేహాళి
మానితమౌ రామనామ మణిదీపంబున్. 117

ఉ. సాధులు నామసంస్మృతిని సంసృతిఁ బాసి తమ స్తమస్వినిన్
బోధమునొంది మేల్కొని యబోధ్య మకథ్య మనాదిరూప మే
బాధయులేని బ్రహ్మసుఖభాజను లయ్యెద రాత్మతత్వ సం
బోధన మౌను నామమునఁ బొందును సాధకుఁ డష్టసిద్ధులన్. 118

క. ఆర్తుఁ డల రామనామముఁ
గీర్తించిన నార్తిఁ బాసి క్షేమయుతుం డౌ
నార్తుఁడు జిజ్ఞాసువు న
ర్థార్తుఁడు జ్ఞాని యను నలువురర్చింత్రు విభున్. 119

ఉ. వారలు నాల్గుజాతులగు వార లుదారులు పాపదూరు లం
దారయ జ్ఞాని యొక్కఁడె మహాప్రియుఁడౌ రఘురామమూర్తికిన్
వారికి నామ మొండెగతి, వారికె కాదు చతుర్యుగంబు లం
దారయ నాల్గువేదముల నోఁ గలితారక మొక్కనామమే. 120

తే. కామనాహీను లౌచును రామభక్తి
రసమునన్ లీనులౌ భక్తరత్నములును
ననిపిరి మును నామానురాగామృతమయ
మానసమ్మున నిజమనోమీనములను. 121

తే. అగుణ సగుణాత్మకమయి బ్రహ్మస్వరూప
మది యవర్ణ్య మనుపమ మనాదియు నగు
నట్టి బ్రహ్మంబుకంటె పై మెట్టు నామ
మది గుణాగుణాత్మల రెంటఁ గుదురు కొంట. 122

తే. దారుబహిరంతరాగ్ని విధంబు తోఁప
భువిని బ్రహ్మవిచారము ద్వివిధమౌను
సగుణ నిర్గుణరూపకమగుచు దీని
బుధులు కనుగొంద్రు, నామతమున్ వినుండు. 123

తే. సగుణనిర్గుణ సాధన మగమము నయి
నామమున సుగమ మగును నామమె ఘన
మగును రామపరబ్రహ్మ మఖిలమంధు
నిండియుండును నిత్యుఁ డజాండములను. 124

చ. పరుఁ డవికారుఁడై పరగు బ్రహ్మము నెల్లర నిండియున్ననున్
ధరఁ గల జీవు లెల్లరును దైన్యముఁ గాంతు రెఱుంగ కాతనిన్
బరగఁగ నామసాధనమె బ్రహ్మనిరూపణసాధనం బగున్
ధర వరరత్నమూల్యమునఁ దద్దయు రత్నమె హేతువౌనటుల్. 125

తే. నిర్గుణాధిక మగుచును నెగడు నామ
మహిమ మెన్నఁగనంచు నిమ్మై వచించి
రామమహిమము మించుఁ దన్నామమహిమ
మంచుఁ బల్కెద నిజవిచారానుసరణి. 126

క. రాముఁడు భక్తహితార్థము
బాములపాలౌచుఁ దాను వనుల వగర్పన్
నామం బశ్రమమునఁ దనుఁ
బ్రేముడి జపియింప సౌఖ్యవిభవము లొసఁగున్. 127

సీ. భవధనుర్భంజనుఁ డవు నన్న రాముఁడు ;
భవభయభంజనం బవును నామ,
ముద్ధరించెను రాముఁ డొకసతిన్ ; నామము
కోటికూటమతులఁ గుదురుపరచె,
రక్షసానీక విరాముఁడు రాముఁడు ;
నామంబు కలుషప్రనాశనంబు,
దండకవనపావనుండు రాముఁ ; డనేక
భక్తహృద్దండపావనము నామ,
మఖిలమునిజనహితమున కర్థి రాముఁ
డణఁచెఁ దాటక నాత్మపుత్రాన్వితనుగ,
నామమో, దాసుల దురాశలనామ మణఁచు
నుష్ణరశ్మి తమోరాశి నుడుపు మాడ్కి. 128

శా. కానన్ రాముఁ డిడన్ జటాయుశబరీకై వల్య, మానామ మం
హానీకంబును దిద్దె, రాఘవుఁడు కుయ్యాలించి యాభానుమ
త్సూనునన్ దానవనాథునిన్ మనిచె నచ్చోఁ గాని, తన్నామమో,
దీనానేకశరణ్య మా నిది జగద్వేదశ్రుతం బెల్లచో. 129

క. కోతుల నెల్లులఁ గూరిచి
సేతువుఁ గట్టింపఁ గాసిఁ జెందఁగ రాముం,
డాతని నామం బశ్రమ
నాతతభవసింధుకోటి నదె యింకించున్. 130

ఉ. రాముఁడు పుత్రమిత్రయుతు రావణునిం దెగటార్చి వచ్చి సీ
తామదిరాక్షిఁ గూడి గడితప్ప కయోధ్యపురంబు నేలఁ, ద
న్నామము జాపకావళి మనంబులఁ గామమదాది షడ్రిపు
స్తోమముఁ బాఱఁద్రోలి యిలఁ ద్రొక్కు నకంటక శాంతిరాజ్యమున్.

తే. అగుణసగుణాధికం బయి యలరుచుండి
వరదులౌ వారికే తాను వరద మగుచు
వరలు నారామనామమె హరుఁడు గొనియెఁ
బ్రాణమంచును శతకోటి రామకథల. 132

ఉ. నామకృపన్ మహేశుఁ డవినాశనుఁడై తదభద్రవేషముల్
క్షేమమయంబు లయ్యె నిఁక సిద్ధులు యోగిసనందనాది ని
ష్కాములు బ్రహ్మసాత్కృతిని గాంచిరి నారదుఁ డయ్యెమా రమా
కాముల కిష్టభక్తుఁడయి గణ్యతఁ గాంచెను భక్తకోటిలో. 133

శా. భక్తాగ్రేసరుఁ డయ్యె నామమహిమం బ్రహ్లాదుఁ, డంతర్వ్యథా
యుక్తుం డయ్యును నామసంస్మృతి ధ్రువుం డుచ్చస్థితిం బొందె, ను
న్ముక్తిం బొంది రజామిళేభములు, రాముస్ లోఁగొనె వాయుజుం
డుక్తుల్ వేయు నిఁకేల నామమహిమం బూహింప శక్యం బొకో. 134

మ. కలికల్యాణనిధాన కల్పతరువౌ కాకుత్స్థ నామం బెదం
దలవం బట్టియె భంగు భంగిగఁ బరిత్యాజ్యుం డమాన్యుండునౌ
తులసీదాసుఁడు పూజ్యుఁడయ్యెఁ దులసీ తుల్యంబుగా, రాముఁడే
తెలియన్ లేఁడన స్వీయనామమహిమాధిక్యంబు వేయేటికిన్. 135

తే. నలుశ్రుతులఁ ద్రికాలములను నలుయుగముల
నామజపమున జీవు లనామయు మయు
లౌదు రారామభక్తి పుణ్యౌఘఫలము
వేదవాది పురాణాదివాద మిదియ. 136

క. తొలియుగమున ధ్యానంబుల,
మలియుగమున మఖములను, సమర్చనముల న
వ్వలి యుగమున, హరియలరును
మలజలనిధి కలిని జనుల మనములె మీఁలౌ. 137

మ. కలి నీనామ మఘుం బడంచి వర మీఁ గల్పాగమం బౌ నికన్
గలిదంభాత్మక కాలనేమి నిలఁ బోకార్పన్ మరుత్సూతి యౌఁ
దలియుం దద్రుడియునౌదు రెందు హితముం దార్పన్ నృసింహుం డగుం
గలిదైత్యుం దునుమాడి దైత్యసుతు నాఁగన్ జాపకుం బ్రోవఁగా.

క. ఘోరంబౌ నీకలి నీ
డేరవు సద్ధర్మభక్తు లిద్ధవిరక్తుల్
శ్రీరామనామ మొకఁ డా
ధారంబౌ భవ తితీర్షతతికిఁ దరింపన్. 139

ఉ. కామమునన్ విరోధమునఁ గాని ప్రియంబున నీర్ష్యనేని, య
న్నామము సంస్మరించిననె నల్గడలన్ శుభ మావరించు, నా
రాముని నామముం దలఁచి రక్తిఁ బదంబులఁ గొల్చి వ్రాయుదున్
రామగుణేతిహాసమును రంజిలఁజేయు నమేయ సత్కృపన్. 140

క. అనుకంపను గనుపింపను
దనివో దెవ్వాని మనసు దయఁ గను నతఁడున్
ననుబోటి చెడుగు లేటికిఁ
దనబోటికిఁగాని తనువుఁ దనుఁ గని హైనన్. 141

చ. నుతులను విన్నయంతనె మనోగతభావ మెఱుంగుచుంద్రు భూ
పతు లిది వేదవిశ్రుతము ప్రాజ్ఞులు దీనధనాఢ్యు లజ్ఞులుం
జతురులు సత్కవుల్ గుకవిజాతులు జానపదాళి నాగరుల్
క్షితిపతి నీశ్వరాంశుని సుశీలుని సాధునిగా యథామతిన్. 142

క. వందించుచుండ నిజమతి
నందఱఁ గని వారివారి స్వాంతప్రీతిన్
డెందము చందముఁ గనుఁగొని
యందఱఁ గడు గారవింతు రవనీనాథుల్. 143

క. ప్రాకృతనృపు లిట్లెఱిఁగిన
నేకరణిని రామవిభుఁ డిదెఱుఁగకయుండుం
జేకొను జడులనె యతఁ డన
నాకంటెఁ గలండె జడమనస్కుం డొకఁడున్. 144

క. ఖలుఁడ నగు నన్నుబోటుల
చెలిమియుఁ దాఁ బెద్దసేయు సీతావిభుఁ ; డా
జలముల శిలలం దేల్పఁడె,
ఎలుగులఁ గోఁతులను జేయఁడే మంత్రులుగన్. 145

తే. 'జానకీనాథుఁ బోలెడు సత్ప్రభుండు
ధరణిఁ దులసీసమానుఁడౌ దాసవర్యుఁ'
డంచుఁ బల్కు లోకోక్తి సహించుఁగాక
రామచంద్రకృపాసాంద్రుఁ డేమెయి మహి. 146

చ. మతి యతిశాఠ్యదౌష్ట్యముల మానదు, నాగతిఁ గాంచినంత దు
ర్గతియును మోము ముడ్చునని కాఱియ నొందెదఁ ; గాని, రాముఁ డీ
స్మృతియ యొనర్పఁబోఁడు, విని చిత్తమునం గని దివ్యదృష్టి నా
స్తుతిఁ గయికోఁగలాఁ డనుచుఁ దోఁచెడు భక్త్యనురక్తుఁ డౌటచే. 147

చ. శ్రితజన దోషముల్ గనక, చేకొను వారి విశుద్ధభక్తినే
శతవిధులన్ రఘూద్వహుఁడు, శక్రసుతుం బరిమార్చె నెట్టి దు
ష్కృతమున నట్టి దుష్కృతమె చేసె నినాత్మజుఁ డాత్తరాజ్యుఁడై,
క్షితిని విభీషణుం డటుల చేసె, నతం డవి యెంచెనే కలన్. 148

ఉ. అంతియకాక వారల సమంచితరీతి సభాంతరంబునం
దెంతయు గారవించి నుతియించెను భ్రాతృసమాగమంబునం
దెంతయు భ్రాతృతుల్యులుగ నెంచుకొనెన్, నిజదాసకోటి వృ
త్తాంతము నందునున్నఁ దను త్ప్రస్థలి నున్నను భేదమెంచెనే ? 149

తే. 'జానకీశ ! భవచ్ఛ్రేయుమా నదెల్ల
ప్రాణితతులకు శ్రేయస్కరం' బటన్న
నానుడి యొకండు నిక్కవం బౌన యేని
నీ తులసి కెట్టు శుభము లీడేరకుండు. 150

శా. ఈరీతిన్ గుణదోషముల్ పలికి నే నిం దందఱం గొల్చుచుం
ప్రారంభింతును యాజ్ఞవల్క్యుఁడు భరద్వాజర్షికిం దెల్పు నా
శ్రీరామాయణగాథఁ గావ్యముగ వర్ణింపన్, వినుం డాదటన్
సారాచార విచారులార ! కలిదోషంబెల్ల శోషిల్లఁగన్. 151

శా. మున్నీగాథ శివుం డొకప్పు డుమకున్ మోదంబుతోఁ దెల్పి, యా
తెన్నుం గాకభుశుండికిం దెలిపె, భక్తిం దెల్పనా నం చతం
డన్నిం దెల్పఁగ యాజ్ఞవల్క్యున ; కతం డాడెన్ భరద్వాజుతో,
నన్నింటిం దెలియన్ సమర్థులుచుమీ యా శ్రోతలున్ వక్తలున్. 152

క. విజ్ఞులు సమశీలురు స
ర్వజ్ఞులు సమధర్మమతులు స్వజ్ఞానసుకా
లజ్ఞులు హరితత్త్వజ్ఞులు
ప్రాజ్ఞులు వా రంద రట్టివక్తలు శ్రోతల్. 153

తే. కరతలామలకక్రియఁ గాలగతుల
నన్నిఁ దెలియుచు నుండెద రాత్మబుద్ధి
వార లేకాక చతురసద్భక్తవరులు
బహుగతుల వించుఁ దెలియుచుఁ బలుకుచుంద్రు. 154

క. మున్నే గురుముఖమున నిది
విన్నదియే కాని, యెన్ని విధులఁ దెలిపినం
జిన్నప్పుడప్పు డజ్ఞత
నున్నప్పుడు, తెలియనైతి నొక్కం తేనిన్. 155

తే. అవనిశ్రోత్రువక్త లభిజ్ఞులైననే, యు
గాధ రఘునాథగాథ సుబోధ మగును,
గాక కలికల్మషగ్రస్త ఖలులకెటు ల
గాధ రఘునాథగాథ సుబోధమగును ? 156

శా. ఐనంగాని, గురుండు తెల్ప బహుపర్యాయంబులన్ నామదిన్
జ్ఞానం బించుక కల్గె, దాని నిట భాషాబద్ధముం జేతు, మద్
జ్ఞానజ్ఞప్తిబలానుసారముగ, సుజ్ఞానార్థినౌచున్, నిజా
జ్ఞానభ్రాంతివినాశకంబుగను, సంసారాబ్ధి పోతంబుగన్. 157

## రామాయణ మాహాత్మ్యము

సీ. కలికామధేనువు కాకుత్స్థ వరగాథ,
భ్రమభేకముల మ్రింగఁ బన్నగంబు,
కలికాలకాలాహి నులుచంగ భరణియౌ,
నరణియౌ సద్వివేకాగ్ని నిలుప,
సురవైరిరూపక నరకవినాశి, జీ
వన్ముక్తిహేతువు వారణాశి,
సాధుసజ్జనదేవ జనయిత్రి యదితి, నా
రామభక్తిప్రేమ సీమ యిద్ది,
మహిని రామగాథ మందాకినీనది,
చిత్రకూట మమలచిత్తవృత్తి,
స్నేహభక్తివనమె శ్రీరఘువరులు వి
లాసకేళిఁ దిరుగు హాసుశోట. 158

ఉ. ధాత్రి సుధాతరంగిణియు, ధాత్రియు విశ్వభరంబుఁ బూన, స
త్పాత్రసుసజ్జనోదధి కపాంపతి పుత్రియుఁ, గాలుబంట్లకున్

శాత్రవి సూర్యపుత్రియును, సాధుహితంబునుగూర్ప శైలరా
ట్పుత్రియు నౌను బంక్తిరథపుత్రపవిత్రచరిత్ర మెమ్మెయిన్. 159

క. తులసివలెన్ రామప్రియ,
హులసివలెన్ దులసిమానసోల్లాయి, హిమా
చలసుతవలె నీశప్రియ,
యిల సంపద్రాశివలె నభీష్టద మిది యౌ. 160

క. భంజనములు కలికల్మష
పుంజములకు నవని సకలబుధజనసుమనో
రంజనములు సుజనములకు
సంజీవనమూలములు దశరథసుతు కథల్. 161

సీ. శ్రీరామచరిత మాశ్రితమతిసత్యాభ
రణము చింతామణి రమణ మీఱు,
దారిద్ర్యదావాగ్ని వారింప వారిద,
మతిథిపూజ్యము త్రిపురారికెపుడు,
సకలనియమవ్రత సద్ధర్మబీజంబు,
మాతాపితలు రామమైత్రిఁ బెనుప,
సద్గురుండు విరతిజ్ఞానయోగాళికి,
నాశ్వినుల్ భీమభవామయముల,

కైహికాముష్మికప్రియాధ్యక్షతఁ దగు
జనమనోవృత కామాది శత్రుహస్తి
దంభ మణఁపఁగఁ గేసరిడింభకంబు
నగుచు శ్రీరామచరితము సొగసు మీఱు. 162

ఆ. అవనిజేశుగుణము లఖిలశివకరమ్ము
లతని కథలు పూరుషార్థదములు
విషయసర్పవిషము విడిపించు మణిమంత్ర
మజుని వ్రాతదోసఁగు లన్ని మాన్చు. 163

చ. సుకవిమనశ్శరన్నిశకుఁ జుక్కలవోలె, సమస్తపుణ్య స
న్నికరఫలంబు భోగమటు, నిష్కపటప్రియ మాచరింపఁగా
సుకృతిగతిన్, విచారనృపశూరునిఁ బ్రోవ భటాళి యట్లు, సే
వకజనచిత్తమానసవికాసి మరాళగతిం దనర్చెడున్. 164

ఉ. సేవకశాలిపాలనకు జీవనదం బయి, యిష్టసిద్ధికిన్
దేవమహీజమై, యరుణదీధితి యాచుఁ దమస్తమిస్రకున్,
శ్రీవిభుశంభుసన్నిభ సుసేవ్యమునై, శ్రితజీవనార్థమై
దేవనదీ వినిర్మలగతిన్, రఘురామచరిత్ర మొప్పెడున్. 165

క. కుపథ కుతర్కకువర్తన
కపటేర్ష్యాదంభనాస్తికత్వాదిక పా
పపటలసమిద్ధహన మొన
రుప రామప్రభుగుణాళి రూక్షాగ్నియగున్. 166

తే. అఖిలజనమోదసంధాత్రి జ్యోత్స్నవోలె
రామచరితంబు జనమనోరంజక మయి
యందునున్ సచ్చకోరకల్హారహృదుల
కెద నమందమహానంద మొదవఁ జేయు. 167

క. ఎవ్విధిఁ బ్రశ్నించెను శివ
యెవ్విధి శివుఁ డుత్తరంబు నిడె నది యెల్లన్
మవ్వపుఁ బ్రబంధ మొనరిచి
యవ్విధము సహేతుకముగ నాఖ్యానింతున్. 168

శా. మున్నెన్నం డెఱుంగనట్టి సుజనమ్ముల్ నివ్వెఱం బొందఁ బో
కెన్నే తెన్నుల గల్గు రామకథ లూహింపుం డెదన్, దీనినిన్
విన్నన్ జ్ఞానులలౌకికప్రతిభమై వింతం బొనర్పంగఁ బో
రెన్నేనిం గలవంచు రామచరితానేకత్వతత్త్వజ్ఞులై. 169

మ. వివిధంబుల్ రఘువీరు జన్మములు, వేవే లండ్రు తద్గాథలున్,
వివిధర్షుల్ రచియించి రాతని కథల్ వేర్వేఱు కల్పంబులన్
సువివేకజ్ఞు లెఱింగి దీనిని రఘుక్షోణీశుగాథల్ గణిం
ప వశంబేయని నివ్వెరం బ్రమయ రెవ్వారున్ వినుం డాదటన్. 170

మ. అనుమానంబుల నెల్లఁ బో నడఁచి, యిట్లాచార్యపాదాబ్జ ధూ
ళిని శీర్షంబునఁ దాల్చి, యందఱకుఁ గేల్గీలించి, సద్భక్తిమై
వినుతిం జేసి మహేశు, రామకథ విన్పింపన్ దొరంకొంటి నా
ఘనసుశ్యామలు నెంచి షోడశశతైకత్రింశదబ్దంబునన్. 171

క. మధుశుద్ధ నవమి నీకథ
పృథివీసుతవాసరమున వెలసె నయోధ్యన్
బృథివిని శ్రీరామజనన
తిథిగ శ్రుతిప్రథితమైనతిథి నవమితిథిన్. 172

మత్తకోకిల :

నాఁడయోధ్యపురంబునన్ రఘునాథజన్మ మహోత్సవం
బాడి చూడఁగ దేవమానవయక్షరాక్షసకోటులున్
వాడవాడలనుండి వత్తురు పాడుచుండ్రు యశంబు లం
దూడిగంబుల రామజన్మమహోత్సవంబులఁ జేయుచున్. 173

ఉ. సజ్జనకోటి మజ్జనము సల్పుచు నా సరయూతరంగిణిన్
హృజ్జలజంబులన్ జనకజేశుని శ్యామలకోమలాకృతిన్
సజ్జతఁదాల్చి కొల్తు రల స్పర్శనదర్శన పానముల్ మఱిన్
మజ్జనముం బొనర్పఁ గొలమానుపు నానది నెంచ శక్యమే. 174

క. గురుతరదురితము లన్నిటి
హరియించును సరయు వనుచు నాడును శ్రుతులున్
ధరణిం బురాణము లన్నియుఁ
దరమే తన్మహిమ మెన్నఁ దద్భారతికిన్ ! 175

తే. రామసాయుజ్య సంధాత్రి క్షేమదాత్రి
భువనపావని సాకేతపురినిఁ బుట్టు
పుణ్యజనములు పుట్టువుల్ వొంద రింక
నెట్టియోనులఁ బుట్టువారేనిఁ గాని. 176

తే. ఇష్టసిద్ధి ప్రదంబని యెదఁ దలంచి
యఖిలవిధముల సంపన్న మైనదంచు
నీ పురిని వ్రాయఁ దలఁకొంటి నీచరిత్ర
వినినఁ గామాది షడ్రిపువిసర మణఁగు. 177

## రామచరితమానస వర్ణనము

క. 'రామచరితమానస' మని
నామ మగున్ దీని కిట్టినామము విన వి
శ్రామమగుఁ బ్రాణికోటికి
క్షేమము విషయాగ్నితప్తచేతః కరి కౌ. 178

తే. విషయవనవహ్ని లోఁ బడి వేగుచుండు
చిత్తమత్తేభముల్ శాంతిఁ జెందు నిందు
మానసంబునఁ బడి దీని మానసమును
భవుఁ డొనర్చె జనావనపావనముగ. 179

చ. కలికలుషాళిఁ గాల్చఁగను గాయకవాచకమానసవ్యథా
కులములఁ గాల్చ, దైన్యములఁ గూల్చ దవప్రతిమాన మీకథన్
దొలి మది నించి యుంచి యిది ధూర్జటి దుర్గకుఁ దెల్పె నంచుచే
వెలయు మహేశమానసనివేశముచే నిది మానసాఖ్యమై. 180

తే. నామకరణం బొనర్చె శ్రీరామచరిత
మానసం బని దీని కుమామహేశుఁ
డాదరాయత్తచిత్తులై యవధరింపుఁ
డనఘమతులార ! వాకొందు నాచరితము. 181

క. రామచరితమానసయశ
మేమెయి వ్యాపించెఁ బుడమి నీ మెయి దానిన్
సోమధరు సోము మదినిడి
శేముషిఁ దోచినవిధంబుఁ జెప్పెద వినుఁడీ. 182

తే. ఈశుకృపఁ జేసి సుమతిప్రకాశ మొదవెఁ
గాననే మానసగ్రంథకర్త నైతి
నే యథామతిఁ బల్కెద మీయెడఁదల
చక్కఁ గనరయ్య ! సాధుసజ్జనులు దీని. 183

తే. శ్రుతిపురాణ మయాబ్ధుల సుకృతఘనము
చెలఁగి రామయశోవారి సేకరించి,
బుద్ధి భూస్థలి వర్షింపఁ బొలుపుమీఱి
మానసం బయ్యె నిండారి మానసఝరి. 184

శా. వర్ణింపంబడు లీలలే కలుషతం బాపంగ నైర్మల్యమా
వర్ణింపం జనరాని ప్రేమ విలసద్భక్తుల్ సుమాధుర్య మా
నర్ణస్రోతసు సాధుశాలులకు, భక్తాప్తాళికిం బ్రాణమై
కర్ణాధ్వంబునఁ జేరు మానసము సత్కాదంబినీజాతమై. 185

తే. సాధుఘనములు బుద్ధిభూస్థలిని గురియ
శ్రవణపథమున మానససరముఁ జేరి
రుచిమయశరదృతువునొంది రుచిర మాచు
నమున, రామయశోవారి విమల మగుచు. 186

శా. సంవాదంబులె నల్ తటంబులు, లసత్కాండంబులే మెట్టులౌ,
సంవీక్షించిన జ్ఞానచక్షువులతో స్వాంతప్రశాంతం బగున్,
సంవేద్యం బనవద్యమౌ నినకులక్ష్మాజానిమాహాత్మ్యమే
సంవీక్షింప నగాధపాథసగుఁ, దత్సత్కీర్తి పీయూషమౌ. 187

మ. ఉపమల్ వీచివిలాసముల్, సుకవితాయుక్తుల్ సుశుక్త్యావళుల్,
విపులన్ దోహర ఛంద సోరఠలు నా వృత్తంబులే పూలు, పు
ష్పపరాగంబులె గంధముల్, ఘనములౌ భావార్థభావాగతుల్
తపముల్ యోగవిరాగముల్ జపము లేతన్మానసప్రాణులౌ. 188

మ. సుకృతుల్ బంభరకోటి, జ్ఞానవిరతుల్ సుజ్ఞానముల్ హంసముల్
సుకవిత్వాదివిశేషముల్ బహు ఝషస్తోమంబు నేత్రద్రస
ప్రకరం బౌను జతుర్విధోక్తపురుషార్థంబుల్ సువిజ్ఞానముల్
సుకృతాత్మానఘనామకీర్తనములే చూడంగ హారీతముల్. 189

ఉ. సాధుసమాజ మిందు నలుచక్కియలం గల మావితోఁపు; శ్ర
ద్ధాధృతియే వసంతమగు; శాంతియు దాంతియు భక్తి మున్నగా
సాధనముల్ లతావితతి; సంయమమే పువు; పంట జ్ఞానమౌ,
మాధవపాదభక్తి రసమాన్యము లన్యకథల్ శుకాదులౌ. 190

ఆ. రోమహర్షణంబు, ద్రుమయుతోద్యానంబు,
శ్రవణసుఖమె విహగసంచరణము
చిత్త మనెడు మాలి స్నేహోదకంబుల
దాని నేత్రఘటము లూని తడుపు. 191

క. ఈచరితముఁ దమిఁ జదివెడు
నాచతురులె సరసుఁ గాచు నధిరక్షకు లెం
దీచరితము శ్రద్ధవిను స
దాచరణులె సరసు కగుదు రధికారు లిలన్. 192

చ. ఖలవిషయాంధదుష్టబకకాకము లీసరసిం జరింప రా
వలరఁగఁ గాకభేకముల హాస్యకథల్ విషయప్రసంగముల్
దలఁపఁగ లేవు వారిమదిఁ దన్పఁగ, దాయు తలంపుఁగాను వా
రలకు దురాసదంబు చుడి, రామకృపంగగన కిందు డాయఁగన్. 193

చ. వలనగునే చనం గఠినవర్త్మ మి దిట్టి కథాప్రవాదంబునన్
ఖలజనమైత్రి కాపథము, కాపథవర్తిదురంత జంతువుల్
ఖలజన బోధనంబు గృహకార్య విడంబము లీ సరః పథం
బులఁగల దుర్గమాద్రులు, కుబుద్ధి వనోర్వి, నదుల్ గుతర్కముల్.

శా. శ్రద్ధారూపకమా పథవ్యయము సత్సాంగత్యమున్ రామప
ద్భద్ధస్నేహము లేనివారి కిది దుష్ప్రాపం బెవారే నస
ద్బుద్ధిం గష్టములోర్చి వచ్చిన వృథా పోదుర్ సుషుప్తిజ్వరా
బద్ధుల్ శీతలజాడ్య కంపితులునై పానాదులున్ లేకయే. 195

ఆ. మానసమున స్నానపానాదు లబ్బమి
నీసు జేసి దాని నీసడించి
యడుగువారికెల్ల నద్దానిఁ దెగనాడి
సరసిఁ దూలనాడి యరుగుచుంద్రు. 196

శా. రాముం డెవ్వరి సత్కృపం గనునొ వారల్ సేతు రడ్డంబుఁ బో
రాముల్ లేకయె మానసంబునను దర్శస్పర్శనస్నానముల్
ప్రేమై రామకథాస్రవంతి నవగాహింపన్ సుసాంగత్యముం
బ్రేమం బూనుఁడు రామగాథ రుచి కాన్పించన్ విడంబోరిఁకన్. 197

తే. మానసాత్ములు వలయు నీ మానసావ
గాహ మొనరుప నీ యవగాహముననె
విమల మయ్యెను గలిబుద్ధి వెల్లివిరిసి
యాత్మనుప్పొంగఁ బ్రేమప్రహర్ష ధార. 198

మ. త్రివిధస్రోతృగణంబ తీరమున బస్తీల్ పల్లెలై రాజిలన్
శివమూలం బయి వేదలోకమతముల్ చెల్వారఁ దీరంబులై
ప్రవహించెన్ రఘునాయకామలయశోంభః పూరితంబై భువిన్
నవశోభం గవితాస్రవంతి సరయూనామంబునం బూతమై. 199

క. సాధుమనోరంజని, కలి
బాధాతటవృక్షమూలపాతకి యగుచున్
సాధుసభాపయోధ్యను రఘు
నాథ లసద్భక్తిదేవనది నిది కలియున్. 200

క. రామయశస్సరయువు సం
గ్రామయశశ్శోణనదముఁ గలిసి చెలఁగఁగా
నామధ్య భక్తిసురనది
ప్రామెను జ్ఞానవిరతులను భక్తియనంగన్. 201

ఉ. మూలము మానసంబు శివమూర్ధ్ని ధృతాపగతోడి నేళ మా
మూలమునం ద్రితాపహరమున్ సుజనావన పావనంబునై
నేలను మూఁడు పోకలఁజనెన్ రఘునాథపయోధిఁ జేర నా
కూలమునన్ గలట్టి వనకోటులు మధ్యకథాప్రసంగముల్. 202

సీ. పార్వతీపరిణయ వర్ణనల్ రామయ
శస్స్రవంతిం గల జలచరములు,
రామాది జనికథల్ రమ్యాభంగతరంగ
ములు, బాల్యఖేలనములె కమలము,
లాతల్లిదండ్రులె యందు నాడు మిళింద
ములు, వారిపరివారములె సలిల వి
హంగముల్, సీతాస్వయంవరగాథయు
యేతన్నదీశోభమై తనరెడు,

నిం దోనర్చెడు ప్రశ్నంబులే ప్లవంబు,
లుత్తరములిచ్చి నక్తి లిం దుత్తరింపఁ
జేయు నావికుల్, కథఁ బ్రశంసించు నా ప
రస్పరాలాప మధ్యగ్రప్రకర మగును. 203

ఉ. రామయశస్స్రవంతి భృగురాముని రోషమె వేగ మౌను, శ్రీ
రామ నయోక్తి తీరము, కరగ్రహణోత్సవముల్ తరంగముల్,
రాముని రాజ్యసత్పరికరంబులె పర్వదినాగతప్రజల్
రామకథాశ్రుతిం బులకరం బొడగూడినవారె స్నాతులున్. 204

ఉ. కేకయరాజపుత్రి మతి కీర్తితరంగిణిలోని నాచునుం
బ్రాకుడునౌను, రామవనవాసవిపత్తియ తత్ఫలంబునౌ,
నీకడగం డ్లడంప భరతేద్ధకథల్ జపయాగసత్క్రియల్,
కాకబకంబులున్ సలిలకల్మషముల్ కలివర్ణనం బగున్. 205

సీ. ఋతువు లాఱింటను నీ యశోనది నిండి
పరమసుందర మౌచుఁ బరఁగు, దీన
హిమవత్తనయ పెండ్లి హిమవంతమగు రామ
జన్మోత్సవం బల చరమఋతువు,
హితమోదశుభమయ ఋతురాజ మల రామ
వైవాహిక సమాజవర్ణనంబు,
దుస్సహోష్మర్తువు దుర్వనగమనంబు,
కాననకథ వేఁడిగాడ్పు లెండ,

అసురవధ సాధుశాలికల్యాణకారి
యైన వర్షర్తువౌను, రాజ్యవిభవంబు
సర్వజన సుఖద విశద శరదృతువగు,
సీతగుణగాథ తజ్జలస్ఫీతగుణము. 206

క. భూతనయాగుణకథన మ
దేతజ్జల విశదగుణము నెంచఁ జలువ యాఁ
బూతభరతస్వభావ మ
తీతము వర్ణింప నొక్కతీరగు నెపుడున్. 207

క. భ్రాతల సౌభ్రాతృత్వముఁ
బ్రీతియు, నన్యోన్యమైత్రి ప్రేక్షాపేక్షల్,
జేతలు నాటలుఁ బాటలుఁ
బూతనదీజలసుగంధమును మధురిమ హా. 208

తే. నాదువినతియు నమ్రనివేదనంబు
మానిత యశోమయాంబునైర్మల్య మరయ
గుణయుతంబైన యీవారిఁ గొన్నవారిఁ
బ్రామ వాశా పిపాసా మనోమలములు. 209

ఉ. పోషకమోచుఁ బూషకులభూషణ భక్తికి, శత్రుషట్కసం
శోషకమాచు, స్నాతజనశోకవినాశకమున్ వివేక సం
తోషవివర్ధకంబుఁ గలిదుష్కృతదుఃఖవినాశకంబునుం
బ్రైషణశోషకంబు నగు రామయశస్సర యూదకం బిలన్. 210

క. అవ్విభు సుయశోవారిని
నెవ్వారి హృదయంబు శుద్ధి నెనయదు వారల్
దవ్వుల మృగతృష్ణం గని
రివ్వున జలవాంఛనలసి తృషితమృగగతిన్, 211

తే. మోసపోదురు కలి వృథాయాసములను
గాన నే నటు కాక యూహానుసరణి
సద్యశోవారిఁ జిత్తంబు జలకమార్చి
సాంబశివు నెంచి శ్రీరామచరిత మెంతు. 212

క. సీతారాముల పద కం
జాతము లెద నిలిపి తత్ప్రసాదంబున నే
నా తపసుల సంవాదముఁ
జేతోమోదంబు మీఱఁ జెప్పెద వినుఁడీ. 213

ఆ. అనఘు యాజ్ఞవల్క్యు నా భరద్వాజుండు
ప్రశ్న జేసినట్టి క్రమ మ దెల్లఁ
దెల్లపరతు వినుఁడు తెలియఁదత్సంవాద
ములకు గలుగు హేతువులను దెలిపి. 214

కథాప్రారంభము - యాజ్ఞవల్క్య భరద్వాజ సంవాదము

క. భూజననుతిభాజనుఁ డురు
తేజోరాజితుఁడు దమ తితిక్షాది గుణ
భ్రాజితుఁ డనఘుండు భర
ద్వాజర్షి ప్రయాగతీర్థవరమున నుండెన్. 215

క. ఆశ్రయము శమదమాదుల
కాశ్రయహా రామభక్తి కట్టి భరద్వా
జాశ్రమము, తీర్థగతజన
తాశ్రమహరణాశ్రయ మయి తనరు నచోటన్. 216

మ. అట నాదిత్యుఁడు నక్రరాశిగతుఁడౌ నప్పెల్ల పుణ్యాత్ము ల
చ్చటి కేతెంచి త్రివేణిఁగ్రుంకి యతినిష్ఠన్ మాధవుం గొల్చుచున్
వటవృక్షంబు స్పృశించుచుం జని భరద్వాజాశ్రమస్థాయులై
యట మానుల్ ప్రవచింప విందురు సమస్తామ్నాయసారోక్తులన్.

క. తీర్థస్నానార్థం బా
తీర్థవరంబునకు నరుగుదెంచిన మును ల
త్యర్థము సంప్రీతిని ద
త్త్వార్థముఁ జర్చించుచుందు రచ్చో నెపుడున్. 218

క. నిర్ణయ మొనర్త్రు బ్రహ్మము
వర్ణింతురు హరికథార్ణవము ధర్మంబున్
నిర్ణయ మొనర్త్రు భక్తిని
నిర్ణిద్రులు వినుచునుండ నియతిన్ శ్రోతల్. 219

క. వత్తురు స్నాన మొనర్తురు
చొత్తురు మునిసంఘమందు సూక్తుల వినుచుం
బుత్తు రటు మకరమాసముఁ
బుత్తెంతురు నెలవులకును భువి నేటేటన్. 220

ఉ. అంతట నొక్కయేట మకరాంతమునం దల యాజ్ఞవల్క్యులన్
సంతస మొప్ప నాపి పదసారసముల్ భజియించి తద్యశం
బంతయు నుగ్గడించి కొనియాడుచు నాంగిరసాత్మజుండు తా
నెంతయు భక్తియుక్తిమెయి నిట్లనియెన్ మృదుమంజు లోక్తులన్. 221

చ. 'అడిగెద సర్వముం గరతలామలకం బగు మిమ్ము శంక నొం
డడుగ భయంబు లజ్జ యగు నడ్డమిఁ జే టగుఁ బెద్ద లొద్ద నొం
డడుగక శంక డాఁపుకొన నాత్మ విశుద్ధము కాద టంద్రు నా
యడిగెడు శంకఁ దీరిచి మహాత్మ! తొలంపవె నాదు మోహమున్.

ఉ. కాశిని బ్రమ్మదుఁ జేతననికాయమునందు శివోపదిష్టమై
నాశవిహీనముక్తి నిడి నాశవిహీనుఁడు జ్ఞానరాశియా
నీశునిజప్యమంత్ర మయి హెచ్చెడు నామము గల్గు నామహా
త్మ్యాశయరాముఁడున్ దశరథాత్మజరాముఁడు నొక్కఁడేనొకో? 223

శా. రాముం డొక్కఁడయోధ్యఁ బుట్టి వనితారత్నమ్ముఁ గోల్పోయి పల్
బాముల్ బొంది వనస్థలిం దుదకుఁ బౌలస్త్యున్ రణక్షోణిలో
సామాత్యానుజపుత్రుగం దునిమె విఖ్యాతంబులౌఁ దత్కథల్
రాముం డొక్కని నీశుఁ డెంచునెపు డారామాఖ్యుఁ డెవ్వండొకో?

క. చెప్పెఁడు రామచరిత్రము,
విప్పెఁడు మోహంపుగ్రంథి, విజ్ఞానముచే
రొప్పెఁ డవివేక పటలి నిఁ
కెప్పుడు దరిఁజేరకుండ ఋషివర! యనఁగన్. 225

మ. స్మితవక్త్రుం డయి యాజ్ఞవల్క్యుఁడు ప్రశంసించెన్ భరద్వాజ! వా
క్కృతిశుద్ధింగల రామభక్తుఁడవు తన్మాహాత్మ్య మీవెంచవే?
చతురత్వంబును గంటి; రాఘవకథాసారాంశ మీ నా నుడిన్
శ్రుతులారన్ వినఁగోరి నీవిటుల నజ్ఞుం బోలి ప్రశ్నించితో. 226

తే. చిత్తగింపుము చెప్పెదఁ జిత్త మునిచి
మోహమహిషాసురుని మోఁదు మూలశక్తి,
సచ్చకోరాళి కోరెడు చంద్రిక, రఘు
చంద్ర చరిత యశస్సాంద్ర చంద్రిక యిది. 227

క. శంకర వామాంకస్థిత
శాంకరి కీ శంక తోఁప శంకరుఁ డడఁపెన్
శంక లడంగను గౌరీ
శంకరసంవాద మిద్ది శ్రద్ధను వినుమా. 228

## సతీమోహ వృత్తాంతము

క. శంభుఁడు త్రేత నొకప్పుడు
శాంభవితోఁ గూడి కుంభసంభవుఁ గన సం
రంభంబునఁ జనఁ దచ్చర
ణాంభోజములన్ భజించె నమ్మునివరుఁడున్. 229

శా. పూర్ణోత్సాహముతో నగస్త్యుఁ డిటు లాభూతేశుఁ బూజించి సం
వర్ణింపన్ రఘురామగాథ, విని దిగ్వాసుండు మోదించు చా
కర్ణింపన్ ముని రామభక్తి నుడివెం, గాత్యాయనీశుం డటుల్
పూర్ణప్రీతిని రామగాథ వినుచుం బోఁబుచ్చెఁగొన్నాళ్లటన్. 230

ఉ. అంతఁ బురాంతకుండు మునిహంసము వీడ్కొని వెండికొండకుం
గాంతను వెంటఁబెట్టుకొని కానను బోవుచు మార్గమందు శ్రీ
కాంతుఁడు భూభరం బణఁప క్ష్మాస్థలి రాఘవుఁడై జనించు వృ
త్తాంతము సానుజావనిజుఁడై వనిఁ దిర్గు నుదంతమున్ వినెన్. 231

క. రామవిభుఁడు నవ్వనినే
యీామెయిఁ జరియించు వార్త నాలించి శివుం
డేమాడ్కిఁ గందు రామ
స్వామిని గోప్యంబు భంగపడ కుండంగన్. 232

ఉ. చెట్టదశాస్యు చావు నరుచే నని వ్రాసిన ధాత వ్రాతలన్
దిట్ట మొనర్పనెంచి యిటు దేవుఁ డిలన్ నరుఁడై జనించె నీ
గుట్టిది రట్టుగాక కనుఁగొందు నెటుల్ గనకుండనుందు నే
నెట్టు మదిష్టదేవుఁ డతఁ డీక్షణమం దగుపించునో కదా. 233

క. పట్టుపడకుండ వేలుపు
గుట్టిది కనుఁగొందు నెటు రఘుప్రభు నంచున్
బిట్టుగ క్షోభింపఁగ శివుఁ
డిట్టిమనఃక్షోభ మెఱుఁగ దేమియు సతియున్. 234

సీ. అంత రావణుఁడు సాహాయ్య మర్థించిన
నోడి మారీచుఁడు లేఁడి యూాచుఁ
గడు దవ్వు రాము నాకర్షించుకొనిపోవ
నన్న వెంబడిఁ దమ్ముఁ డనుగమించె,
నంత రామమహత్వ మింతేని దెలియక
యవనిజన్ రావణుఁ డపహరించె,
నీచమారీచుని పీఁచ మ్మణఁచి రాముఁ
డనుజునితోఁ జేరి యాశ్రమంబు

శూన్యమైయుంటఁ గని చాలఁ జొక్కి-సుక్కి-
కంటఁదడిపెట్టి, తమ్ముఁడు వెంటరాఁగ
నరయుచును దిగ్గె విరహార్తి నరునిపోలెఁ
జూపి యోగవియోగాదిశూన్యుఁడు హరి. 235

క. చిత్రంబులు రఘుపతిచా
రిత్రంబు లనెఱుఁగ సచ్చరిత్రులకే యా
ధాత్రి నెఱుంగక మూఢు ల
పాత్రులు కనుఁగొనరు రాము భావేతరులై. 236

మ. నరుపోలెన్ విరహార్తిఁ గుందు హరిఁ గానం బోయి కంఠ్లార నా
హరుఁ డాహంసకులావతంసుఁ గని యాహ్లాదంబు సంధిల్లఁగా
హరి తన్నున్ గుఱుతింపరాని సమయం బంచెంచి లోలోఁ 'బరా
త్పర! లోకేశ! నమామ్యహ'మ్మనుచు జోతంజేసి ప్రార్థించుచున్. 237

క. కని కని విడి చననోపక
వెనుకకుమఱి మగిడి మగిడి వీక్షించుచు లో
వినుతించుచుఁ బలుమాఱుం
దనువెల్లను బులకరింపఁ దరలెను సతితో. 238

మ. పతిచేష్టల్ గని సంశయించి సతియున్ భావించె మ త్ప్రేయసుం
డతిపూజ్యుండు త్రిలోకవందితుఁడు మర్త్యామర్త్య వంద్యుం డిటుల్
నతిఁ జేసెం గద యీనృపాలసుతునిన్ నామంబుఁ బేర్కొంచు నేఁ
డితఁ డెవ్వం డజుఁడౌనొ, చక్రిఁడ గునో, యీశానుఁ మొక్కుం గొనన్.

శా. సర్వవ్యాపకుఁ డప్రమేయుఁడును విశ్వస్రష్ట యా బ్రహ్మ యి
ట్లుర్విన్ మానవుఁడై జనించునె యతండో యాగమాగమ్యుఁ డౌ
సర్వజ్ఞుం డగు శర్వుఁబోలు హరి సుజ్ఞానాలవాలుండునై
గీర్వాణార్థము మర్త్యుఁడై పొడమి కల్కింబాసి యల్లాడునే. 240

తే. కాదు బ్రహ్మయు, విష్ణువుంగా డితం డి
టజ్ఞునింబలె విరహార్తి నడవిఁ దిరుగు
నజ్ఞుఁడే యన్న ప్రొక్కు సర్వజ్ఞుఁ డేల ?
యీశు సర్వజ్ఞు చెయ్వు లె ట్లెల్లిదమగు. ?' 241

క. దక్షసుత శంక నిట్లు మనః
క్షోభము నొందుచుండి నాథునితోఁ బ్ర
త్యక్షగతిఁ దెలుపకున్నను
దక్షసుతాధవుఁడు భవుఁ డుదంతం బంతన్. 242

ఉ. మానసమం దెఱింగి నిజమానిని కిట్లనె "మానినీ మణీ !
మానసమందు, మాను మనుమానము, నూను మనూనమైన సు
జ్ఞానము మున్నగస్త్య ఋషిచంద్రుఁడు పల్కిన సచ్చరిత్ర, మం
దే నటఁ దెల్పు భక్తివిధ మీ రఘువీరునిఁ గూర్చియే సుమీ. 243

మత్తకోకిల :

ఆ తపోధనసిద్ధు లెవ్వనిధ్యానముం బొనరింత్రెదన్
'నేతి నేతి' యటంచు నిచ్చలు నేనియంతముగాన మం
చాతతంబుగఁ బాడు వేదము లాతఁడీరఘురాముఁడై
భూతలంబునఁ బుట్టె స్వేచ్ఛను భూభరంబు నణంపఁగన్. 244

తే. వ్యాపకుండును బ్రహ్మస్వరూపకుండు
భువనపతియును మునిజనపూజితుండు
భూమి భక్తహితార్థియై రాముఁ డయ్యె
నిష్టదైవమ్ము సుమ్ము నా కితఁడు కొమ్మ." 245

మ. హరుఁ డిట్లెంతయుఁ దెల్పినన్ సతి కగమ్యంబై మదిం దోఁప శ్రీ
హరిమాయన్ బ్రబలంబుగా నెఱిఁగి భూతాధీశుఁ డాత్మేశ్వరిన్

విరసుండై కనిపల్కె 'నాపలుకులన్ విశ్వాసమే తోఁపదే
నరుగన్ రాదొకో! తన్మహోమహిమ నీయంతన్ బరీక్షించుకో. 246

క. హెచ్చిన మోహభ్రాంతుల
యుచ్చులు విడ, రాము నరయు ముచితజ్ఞత, నీ
వచ్చెడు వరకుండెద నే
నిచ్చో నీ వటముక్రిందనే' యున సతియున్. 247

మ. మగనిన్ వీడ్కొని రామరాణ్మహిమ మేమాడ్కిం బరీక్షింపఁగా
నగు నా కంచుఁ దలంచుచుం జనె, శివుం డాత్మన్ 'శుభంబెట్లగుం
దెగలే దీమె కుశంక నాదునుడినేన్ దిష్టంబు దుష్టంబగున్
భగవత్ప్రేరణ మెట్టు లట్టు లవు మాన్పంజాలునే తర్కముల్?' 248

తే. అని తలఁచి శూలి హరినామమననమగ్నుఁ
డైన సతి పెక్కుతలపోత లూని యూని
ధరణికన్యక వేషంబుఁ దాల్చి నిల్చె
దశరథాత్మజు లేతెంచుదారిలోన. 249

శా. అంతన్ లక్ష్మణుఁ డాసతీరచితమాయారూపముం గాంచి, య
త్యంతాశ్చర్యవిమోహితుం డగుచు మాటాడంగ లేకున్న స
ర్వాంతర్యామి సురప్రభుండు సమదర్శ్యాత్ముండు రాముండు, స
త్యాంతర్యంబు గ్రహించె వానికడ మాయావేషమున్ డాగునే. 250

క. స్మరియింప నెవరి నామము
పరువు మహాఘౌఘ మట్టి భగవంతుండౌ
పరమాత్మకనులకే సతి
తెరఁగట్టఁగఁ జూచెఁ గనుఁడు తెలివలగుణముల్. 251

మ. నిజమాయాబల మెన్నుకొంచు నిజపత్నీవేషమం దున్న ద
క్షజ నీక్షించి స్వగోత్రనామములఁ జక్కం బల్కి కేల్మోడ్చి 'ద
క్షజ! యిట్లేల చరించె దమ్మ! వనదేశం బందు నీవొంటివై
నిజనాథున్ విడి? యాతఁ డేడి?' యని ప్రశ్నింపన్ రఘూత్తంసుఁడున్.

తే. కోమలంబు నిగూఢమౌ రామవచన
భంగిఁ గాంచి సంకుచితాంతరంగ యగుచు
భీతియై భూతపతిఁ గాంచ వెడలుచు మది
మాటికిఁ దపించె దక్షకుమారి యిటులు. 253

ఉ. 'ఏటి కగస్త్యుఁ జూడఁ జను, టేటికిఁ బాటిలె నీవనాటనం,
బేటికి వచ్చె రాముఁ డిపుడే, శివుఁ డేటికి మ్రొక్కె, నంతనా
కేటికి శంక తోఁచె, నది యీశునుడిన్ విడదయ్యె నేటి, కిం
కేటికి భద్ర మేటి కగు నీశునుడిన్ జవదాటు బోటికిన్. 254

క. ధీమందురాలి నగుచును
నే ముం దల శివునిమాట లెంచక రామున్
నామందబుద్ధి నరసితి,
నే మందన శివునిముందు నేమందు నిఁకన్.' 255

క. అని పరితపించు చుండఁగఁ
దన మహిమబలం బొకింత దాక్షాయణికిం
గనపఱుపఁ దలఁచి రాముఁడు
కనఁబడె నాముందు ననుజకాంతాయుతుఁడై. 256

క. ముందుంగల రఘునందను
గ్రిందున మీఁదనను నెల్లకెలఁకుల సతి తా
నిం దందున నన నెందుల
కెందులఁ గన నంద కాంచె నెడనెడ లందున్. 257

క. సతికిఁ గనుపట్టె రఘుపతి
క్షితిజానుజయుక్తుఁ డగుచు సేవించుచు స
న్నుతిసేయ సిద్ధతాపస
తతియును బ్రహ్మాదిదేవతా తతు లెల్లన్. 258

మ. చతురాస్యాచ్యుతశంకరుల్ తదనువేషాభూషలా యోషలున్
నతులై కొల్వ ననేకవేషముల నానాదేవతాయూథముల్
సతతారాధనసేయ దాశరథినిన్ జాయానుజోపేతు నం
దతిభీతిం గనె నెల్లచోట్ల సతి మాయాభ్రాంతయై శ్రాంతయై. 259

క. నిజశక్తియుతులు తత్కృతు
భుజులు చరాచరము లతులభూతప్రతతుల్
భజియింప రామునిన్ ద
క్షజ కనె గనుఁ దెఱచి కన్నకడ లన్నింటన్. 260

ఉ. అంతట నంతికంబునఁ బురాంతకు నింతి, సమస్తదేవతా
సంతతి కొల్వ రాఘవు ననంతు నచింత్యుని రాఘవావనీ
కాంతుని నద్వితీయునిగఁ గాంచి, 'త్రిమూర్తుల నెల్లవేల్పులన్
గాంతును బెక్కురూపములఁగాని, రఘూద్వహుఁ డొక్కరూపయో.

ఉ. చిత్తరు వయ్యె నేమి' దని చిత్తము తత్తఱ మొందుచుండ నా
బిత్తరి యత్తఱిన్ మిగుల భీతివి కన్నులఁ దెన్నుఁ గానఁ బో
కత్తెరు వందె కూలఁబడి యత్తఱిఁ గన్నుల విప్పి తెప్పిఱిన్
జిత్తరు వొందుఁ గన్బడమి శ్రీపతి కంజలి యొగ్గి యేఁగినన్. 262

చ. పతి దరిఁజేరు నాసతిని భద్రము నారసి 'యెట్లు జానకీ
పతిమహిమంబు నారసితి పల్కుమ దంతయు' నన్న భీతి నా
సతి మతి రామసత్త్వ మది జ్ఞప్తికి రాఁగ శివాంతికంబునం
గత యది తెల్పనొల్లకయ కజ్జము గుట్టునఁ బెట్టి ఇట్లనెన్. 263

ఉ. 'నిక్కముఁ బల్కుచుంటి విభు నేనును మీవలె మ్రొక్కి వచ్చితిన్
నిక్కము మీదు పల్కుచు నెమ్మది నమ్ముచు జానకీశు నం
దొక్కపరీక్ష యేన్ జలుపనొల్లక వచ్చితి' నంచుఁ దెల్ప నా
తక్కుల శంకరుం డెఱిఁగె ధ్యానదృశన్ సతిచేష్టమంతయున్. 264

ఉ. ఎవ్వనిమాయ, యివ్వనిత నివ్విధిఁ గొంకక బొంకఁ జేసెనో
యవ్వనజాక్షుమాయకును హస్తము లొగ్గి హరీచ్ఛ బల్లిదం
బెవ్వని కీఁదరాని దని యెంచి సతీమణి భూమిజాకృతిన్
నొవ్వఁగఁ జేసె రాము నని నొచ్చుకొనెన్, సతికై మహేశుఁడున్.

శా. భూతేశుం 'డిలువేల్పు కూర్మిచెలి యా భూజాతరూపాను నీ
నాతిం గూడ ననీతి ధర్మపథవిఘ్నంబున్ బొసంగున్ మదిన్
బ్రీతింజేయ దురంతపాతక మగున్ బ్రీతిం ద్యజింపంగ రా
దే తెన్నం బొడగానరా' దనుచు లోనెంతేనియుం బొక్కుచున్. 266

ఉ. ముంగట రామపాదయుగముం గని వంగి షడక్షరిన్ స్వజి
హ్వాంగణ మందు నిల్ప జనకాత్మజవేషముఁ గొన్న యీసతీ
సంగినితోడి సంగమ మసంగత మీతనువందునంచుఁ దోఁ
చంగ నిజాంతరంగమున శర్వుఁడు తానటు సేయ నెంచెలో. 267

మ. ఇటు సంకల్ప మొనర్చి శంకరుఁడు న ట్లైల్ సేయుచో విన్బడెన్
బటుగంభీరరవంబు మింట 'నచలస్వాంతుండవౌ భక్తుఁ డీ
విటు సంకల్పముఁ బూన నీక తగుఁ గా కింకేరికిన్ సాధ్య మౌఁ
బటుదుస్సాధము నీప్రతిజ్ఞ శివ! సాంబా!' యంచు నామీఁదటన్.268

చ. సతియును మింటిమాట విని శంకరు నిట్టులు శంక సేసెడున్
'బతి మతి నెట్టి బెట్టిదపు బట్టును బట్టెనొ కానరా'ద టం
చతిభయకంపితాత్మయయి యంఘ్రులపైఁ బడి యెంతవేఁడినన్
సతికిని గుట్టుఁబట్టు విడి శంభుఁ డొకింతయుఁ బల్కఁ డయ్యెడన్. 269

తే. అంత సతి చింతిలెన్ శివుఁ డఖిలమెఱిఁగె
బతినె వంచించితిని స్త్రీస్వభావమునను
గపటకటు వది కలియఁగ కలయ విరుగు
క్షీరనీరములం బోలు చెల్మి లవని. 270

మ. నిజకృత్యంబుల నాత్మనెంచి సతి నానేరంబుఁ బాటింపఁ డీ
త్రిజగద్వంద్యగభీర్య మెట్టి దని వర్ణింపంగ రానట్టు లా
నిజపాపంబులఁ గాఁగు నావమువలెన్ జిత్తంబు గ్రాఁగన్ వృష
ధ్వజునైముఖ్యముఁ గాంచి తన్నువిడె నీతండంచు లో నెంచుచున్.271

క. ఆకులమతియా కులసతి
యాకులపా ఱెల్లవాయు హరిచరితములన్
వాకొని సతి యూకొనఁగ ని
జోకంబునకేగె భవుఁడు నువిదయు వెనురాన్. 272

తే. అంత ముక్కంటి తొంటి యుదంతమంత
జ్ఞప్తికిం దెచ్చి సహజవేషమ్ము దిద్ది
పద్మపీఠిక బహుపాదపాదపతల
మునను రజతాద్రి యోగముద్రను సహించె. 273

ఉ. ఇవ్విధి యోగనిష్ఠుఁ డయి యీశ్వరుఁ డుండఁగ దక్షపుత్రియున్
నెవ్వగనొవ్వఁగా మనసు నెమ్మదిహెచ్చెడు దుఃఖమర్మ మెం
డెవ్వ రెఱుంగకుండ గిరి నెట్లొ దినమ్ము యుగమ్ముగాఁగఁబో
నివ్విపదంబుధిం దుదకు నే దరి ఱేఁడెద నంచు నెంచుచున్. 274

శా. నమ్మంబోక హృదీశుపల్కు 'క్షితిజానాథుం బరీక్షింప యో
గ్యమ్మౌ దుష్కల మిట్టి దిచ్చె విధి యర్ణంబే యగుం గాని యి
ట్లి మ్ముక్కంటిని నన్ను వేర్పరచి నా యీమేను నిల్పంగ నే
లి మ్మేనిం దొలఁగింపరాదె' యని లో నెంతేనియుం గ్రాఁగుచున్.275

చ. వికలమనస్క యౌచు రఘువీరుఁ దలంచి భవాని పల్కె 'నీ
వకుటిలదీనబాంధవుడ వార్తిహరుండవు నాదు వేని నేఁ
త్రికరణశుద్ధి గల్గిన పతివ్రతనేని శివాంఘ్రులందు నా
కకుటిలభక్తి కల్గుట యథార్థమయేన్ మెయిఁ బాయఁజేయుమా.

మత్తకోకిల :

పాయ దుస్సహవేదనం బిది బాధవెట్ట కొంకింతయున్
బాయఁజేయ మదీయకాయ ముపాయ మొం డొనరింపుమా
వే' యటంచును వేఁడుచున్ సతివేదనం బడుచుండఁగా
హాయనంబు లనెన్బదేడు సహస్రముల్ కడచెన్ భువిన్. 277

ఉ. అంత సమాధి వీడి త్రిపురాంతకుఁ డయ్యెడ రామనామముం
జింతనసేయుచుండ, శశిశేఖరుఁ డంత సమాధి వీడె నం
చింతి తదంతికంబునకు నేగి పదంబులనంటె, నప్పు డా
కాంతను జేరఁబిల్చి హరిగాథల బోధమొనర్చె నాతఁడున్. 278

## సతీశరీరత్యాగము-దక్షయజ్ఞ విధ్వంసము

తే. అంతఁ గొంతకుఁ బరమేష్ఠి యఖిలవిధుల
దక్షుఁడంచును దక్షు సధ్యక్షుఁ జేయ
విభుఁ డయి ప్రజాపతులకెల్ల విఱ్ఱవీఁగె
వీఁగకుండు నెవండిల విభవమొంది. 279

శా. గర్వావార్యుఁడు దక్షుఁ డొక్కతఱి యాగంబొండు గావింప సా
పర్వానీకమునెల్లఁ బిల్చిన హవిర్భాగంబుఁ గైకొంటకై
సర్వాదిత్యులు సిద్ధసాధ్యవసులున్ జాయాసమాన్వితులై
యుర్విన్ జన్నముఁ జూడవచ్చిరి త్రిమూర్త్యానంబుగా నయ్యెడన్. 280

చ. నిజపరివారయుక్తు లయి నింగినిఁబోవు నిలింపకోటులన్,
నిజకలకంఠగానముల నిష్టులనిష్టులఁ బొపు నప్సరో
గజగమనాళిఁ గాంచి సతి కాంతునిచే విని యాగవృత్తమున్
'నిజజనకాధ్వరంపు మిష నేనటఁ గొన్ని దినంబు లుండెదన్.' 281

తే. అంచు మది నెంచి పతిపీడె నంచుఁ జింత
యేర్చగ నిజాపరాధంబు నేర్చలేక
సంశయించుచు భయమున శంభునకనె
"యాగమున కేగివత్తు మీరాన యిడిన. 282

క. పుట్టింట నుత్సవం బఁట
యెట్టయినం జెలవొసంగుఁ డిదె చనివత్తున్,
నెట్టనఁ జనెదు తలంపెదఁ
బుట్టె" ననం బలికె సతికి భూతేశుఁ డిటుల్. 283

క. 'నీయడిగెడు నర్థం బది
నాయెడ కెంతయును వచ్చె నాయమ కానీ
యేయెడ రాఁ బిలుపుడు రా
దాయెడకుం జనఁ దలంచు టనుచిత మతివా. 284

క. కూఁతుల నెల్లరఁ బిలిచియు
నీతండ్రి మఖంబుఁజూడ నినుఁ బిలువఁడ, వై
ధాతృసభ మున్నొకప్పుడు
నాతోఁ గొన్నట్టిపగను నళినదళాక్షీ ! 285

చ. పిలువక యున్నఁ బోఁదగును బెద్దల నొజ్జల తేండ్లఁ గన్నవా
రలఁ గననంచు శాస్త్రములు రాణ వచించుచునున్న నీపగన్
బిలువక పోవరా దటకుఁ బ్రేయసి ! పోయితివే నభద్రమాఁ
బిలువని పేరఁటంబుఁ జనఁ బ్రీతియు నీతియు నిల్వ దెంతయున్. 286

చ. అని బహుభంగులన్ గిరిశుఁ డాడిన భావి యభంగ మాటచే
మనసున కెక్కకున్నఁ బతి మానిని కిట్లనెఁ 'బిల్పులేక నీ
చనుట యభద్రమౌను జుమి స్వాంతమునం దిటు లిచ్ఛగింప నే'
నని సతిపోక మాన్ప బహుయత్నమొనర్చియు నిష్ఫలుండునై. 287

తే. పడఁతి పట్టిన పట్టు మాన్పంగలేక
భవుఁడు ప్రమథులఁ దోడిచ్చి పంపె సతిని
దల్లి చెలియలుఁ దక్క నా తన్వి నచటఁ
బిలువరారైరి దక్షుని వలని భీతి. 288

ఉ. వచ్చిన కూఁతుఁ గాంచి శివవార్త నొంకించుక దక్షుఁ డగ్గకే
హెచ్చెడు నీసుచిచ్చున దహించుక పోవుచునున్న యావిధం
బచ్చపలాక్షి గాంచి యట నారసి యీశుని యాగభాగమం
దెచ్చట లేక యున్న 'హృదయేశుని పల్కినది నిక్కమయ్యెఁగా.' 289

తే. అంచు మదినెంచి తపియించి యలమటించె
హెచ్చెడు శివావమానాగ్ని యెద దహింపఁ
గటకటా! దుఃఖముల్ చాలకలవుఁగాని
జాతిపరిభవదుఃఖంబు సాటి వగునె? 290

శా. బన్నం బెన్నఁడెఱుంగకే శివపరీభావం బెదన్ సైపకే
యెన్నో తెన్నులఁ దల్లి తెల్పినను నొక్కింతైన శాంతింప కా
జన్నంపు న్నడి దిన్నె నిల్చి 'దురవష్టంభాంధసంబంధు లా
మిన్నేటిం దలఁగొన్న బల్లిదుఁడునున్ మీకెల్లిదుం డయ్యెనే? 291

క. శివయుతముగాని సవమిది,
శివయుత మెటులౌ హవిస్సు శివునకునిడకే?
శివు నవమాన మొనర్చిరి
శివనిందాశ్రవణఫలముఁ జేకొనుఁ డిపుడే. 292

ఉ. ఎందున సాధు సజ్జన రమేశ మహేశుల నింద విందుమో ;
యందునె నిందకుండు తన కందిన నాలుకఁ గోయు నా ; నతం
డందక యున్న వీడనగు నచ్చోటు వీనుల మూసికొంచు, నీ
చంద మెఱింగియున్ బుధులు సైతురె పాపవిదూరు దూఱఁగన్? 293

ఉ. కందుకు తత్ఫలంబు శితికంఠుని నిందకు వీను లొగ్గుటన్,
బొందును దండ్రి దక్షుఁడును భూతపతిన్ శివు లోకనాథు నేఁ
డిం దిటు తూలనాడు ఫల, మేనును మేనుఁ ద్యజింతుఁ గాక యీ
నిందిత దక్షశుక్లమున నిల్చిన దేహ మిదేల కాల్పనే! 294

క. బొం దిది నాకేందుల' కని
యిందుధరుని డెందమందు నిడుకొని సతి యం
దందఱు హాహారవ మిడ
బొందిని యోగాగ్ని వేల్చెఁ బొడమిన కినుకన్. 295

క. ఈగతి యోగాగ్నిఁ దను
త్యాగముఁ గావింపఁ గాంచి యా ప్రమథవరుల్
యాగధ్వంస మొనర్పఁగ
నాఁగిరి తద్దక్షణమున కాభృగ్వాదుల్. 296

శా. రుద్రాణీతనుసర్జనం బెఱిఁగి యారుద్రుండు నత్యుగ్రుఁడై
యుద్రేకంబున వీరభద్రు ననుపన్ యోచించి యోగ్యంబుగా
భద్రుం డంతట రుద్రుఁడై సవనమున్ భంజించి దేవావళిన్
క్షుద్రుండౌ నల దక్షునిన్ శివరిపుక్షోభంబునన్ ముంచెఁ దాన్. 297

చ. కత యిది లోకవిశ్రుతము గాన వచించితిఁ గ్లుప్తరీతిఁ ; ద
త్సతి మృతినొందువేళ నలశంభుపదాంబురుహోత్తభక్తినిన్
హితమతి జన్మజన్మముల నేర్పడు నట్టులు కోరె శౌరి నా
కతముననే హిమాద్రిసుతగాఁ బ్రభవించెను గౌరి పేరిటన్. 298

ఉ. గట్టులఱేనియింట నుమ కాన్పిడు నాఁడె సమస్తసిద్ధులున్
మెట్టెను సౌఖ్యసంపదలు మీఱెను మించిన పూలుబండ్లతో
జెట్టు లవెల్లకాలములఁ జెన్ను వహించెను జీవకోటు ల
ప్పట్టున సాజమౌపగలఁ బాసి వసించెను మించువేడుకన్. 299

ఉ. అయ్యచలాధినాథుగృహ మాకర మయ్యెను రత్నకోటికిం
దియ్యని నీటఁ బాఱెడు నదీతతి కయ్యది కన్నపుట్టి ని
ల్లయ్యెను, దండ యయ్యె నట నండజమండలు లుండ, నున్కిప
ట్టయ్యెను మౌనివర్యులకు నాతఁడు గట్టునఁ బట్టు నీయఁగన్. 300

క. 'నిచ్చలుఁ గల్యాణంబులు
బచ్చని తోరణము'లన్న పలుకట నిజమై
హెచ్చె నతం డుమ కాన్పిడ
నుచ్చతఁ దగి రామభక్తియుక్తునివోలెన్. 301

శా. అంతం గొంతకు నాగిరీంద్రుఁ గన హర్షావిష్టుఁ డౌచుం బహు
ప్రాంతోదంతవిదుండు నారదుఁడు రాన్ భక్తిన్ మహీధ్రేశుఁ డ
త్యంతాప్తిన్ మునిపాదముల్ గడిగి పీఠాసీనుఁ గావించి తాఁ
గాంతాసంయుతుఁ డౌచు మ్రొక్కి నిజభాగ్యం బెంతో యగ్గించుచున్.

క. మునిపాదోదక మింటం
జినికించి హిమాద్రి సుతను జీరి మునీంద్రున్
వినుతింపంజేసి 'వియ
న్ముని! మాసుత భాగ్యభోగ్యముల నుడువుఁ' డనన్. 303

ఉ. పర్వతమౌళి కిట్లనె సుపర్వమునీంద్రుఁడు నవ్వుమోమునం
బర్వినప్రీతి గూఢగతి, 'పర్వతశేఖర! నీకుమార్తె యీ

పార్వతి సర్వదా పతిని బాయక సామెయినుండు సామికిన్
సర్వసులక్షణావతియు సంతత శోభనశీలయై కడున్. 304

తే. సహజసుందరి సద్గుణస్థాన యీమె
యంబికా భవానీ సమాఖ్యల నలరుచు
గుశలయును శీలవతియునై యశముఁగూర్చుఁ
గన్న తలిదండ్రు లిర్వురకెన్న మిన్న. 305

ఉ. పర్వతసార్వభౌమ! విను పార్వతి సర్వజగత్ప్రపూజ్య యా
నుర్వర నాయమం గొలువ నొందఁగ రాని దదేది లేదు సు
మ్మర్విఁ బతివ్రతావ్రతము నూనుదు రీమెను బేరుకొంచునే
సర్వశుభాంగి యైనను దొసంగొకఁ డుండె న దాలకింపుమా. 306

ఉ. ఈమెకు రేఖఁ జూడ గుణహీనుఁ డమంగళవేషధారి ని
ష్కాముఁ డమానుషుండు గతసంశయుఁడుం బితృమాతృహీనుఁడున్
భూమి నవాప్తబాంధవుఁడు భూరిజటాధరుఁడున్ దిగంబరుం
డౌ మగఁ డొక్కయోగివరుఁ డబ్బు నటంచును దోఁచెఁ జు'మ్మనన్.

మ. మునిప ల్కెన్నఁడుఁ బొల్లుగా దనుచు నాభూభృద్వరుం డాలియుం
బెనువంతం బడ శైలజాత మదిలోఁ బెల్లుబ్బె నీభేద మా
ముని పర్యుండు నెఱుంగఁడయ్యె జెలులున్ భూభృద్వరాయత్తులై
కనులుం జెమ్మగిలన్ శరీరము వడంకం గుంది రొక్కుమ్మడిన్. 308

క. నిక్కమగుఁ దపసినుడి యని
యక్కుధరకుమారి కాత్మహారిచరణములం
దెక్కువ మక్కువ నెకొనె
నెకొనె శివునెట్లు పడతు నే నను వగయున్. 309

క. 'ఏనేడ నభవుఁ డేడా
యే నాతనిఁ గలియుటేడ నెటు' లని లో నీ
శానాంఘ్రిరక్తి పెనఁగుటఁ
గానఁగరానీక చెలియకడ కేతెంచెన్. 310

శా. బింకం బూని కలంకఁ దేరి ముని కాపృథ్వీధరుం డాదటం
'గింకర్తవ్య'మటంచుఁ గేల్మొగుపఁ బల్కెన్ మౌని "శైలేంద్ర! యా
పంకేజాసనుఁ డెంచి వ్రాయు గడివ్రాల్ బాపన్ సమర్థుం డెవం
డంకెన్ మీఱు దాని కొండు నరనాగాదిత్యలోకస్థులన్. 311

తే. అయిన వెర వొక్కఁ డుండెన దాలకింపు
దేవసాహాయ్యమున నన్ని దిన్న నౌను
నేను జేర్కొన్న చిన్నెలన్నియు లవన్ని
గలమగం డబ్బు నుమ కిందుఁ గలఁగవలదు. 312

ఆ. క్ష్మాధరేశ! సుతకు మగఁడు కాఁదగునన్న
వానివాలకంబు వన్నెచిన్నె
లన్ని కానవచ్చు హరునియందు మగఁడౌ
నేని యతఁడు దోషమే గుణమగు. 313

సీ. పాపరా పాన్పునఁ బన్నుండ వెన్నుండు
కించుగా నొక్కరెగ్గించినారె?
రసము లన్నిఁటిఁ గ్రోలు రవివహ్ను లిర్వుర
మందు లందురె యెట్టి మందులైనఁ?
గలుషవారిఁ గలంగి గంగ పొంగారిన
సుద్దంబు గాదని చుల్కఁగనిరె?
హరి వివస్వచ్ఛుచి సురసరిత్తుల కట్టు
లాక్షేప మెదిలేదు దక్షులకును

త్రిభువన నావన పావన ప్రభవు లైన
సర్వశక్తుల కొక్కదోషంబు కలదె?
ప్రాకృతాజ్ఞానదృష్టి నవ్వారిఁ దెగడ
నెనయు దుర్గతి జీవుఁ డయ్యాశనముఁడె! 314

ఆ. గాంగవారిఁ గోడఁ గాచిన సారాయి
యేవమై మగుడ నదేటఁ గలిసి
పావన మగునట్లు పరమాత్మఁ గలియ ని
ర్దోషియగును జీవి దూష్యుఁ డయ్యు. 315

చ. సహజసమస్థుఁడో హరుఁడు సర్వవిధాల జగత్త్రయీ శుభా
వహమగు నీవివాహము భవత్సుత యుత్సుకతన్ మహేశు దు
స్సహనియతిం దపించిన నసాధ్యుఁడ యే నతఁడాశుతోషియై
యహిధరుఁడే యడంచుకొను నాపయి పైకొను నంతరాయముల్.

చ. వరవరు లెందఱున్నను భవత్సుత కాహరుఁడే వరుం డగున్
వరదుఁ డతిప్రసన్నుఁడు కృపాపరుఁ డాశ్రితరంజనుండు నా
హరుని మదిం గణింపక తదన్యవిధంబుల నిష్టసిద్ధి నెం
దరయము గాక యీపరిణయంబు దిరంబగు నంచుఁ దోఁచెడున్."317

తే. అని హరిఁ దలంచి గిరివరు ననునయించి
గిరిజ నాశీర్వదించి తా నరుగు దెంచె
నవ్విరించను పాలి కయ్యమరవరాని
విను మనంతరవృత్తాంత మనఘచరిత! 318

శా. అంతన్ భూధర రాజపత్ని పతి కేకాంతంబునం బల్కె "లోఁ
జింతింపన్ ముని పల్కగమ్యమయి తోఁచెన్ నా కుమారీకన్యం
గాంతున్ రూప వయోగుణాకృతులలోఁ గన్నా కనంజాలు నా
కాంతాకారున కిమ్ము లేనియెడ నీ కన్యాత్వమే తాల్చెడిన్. 319

ఉ. అంతియ కాని పార్వతి ననర్హున కీయ జడస్వభావుఁ డం
చెంతురు నిన్ జనంబు లిది యేమర కర్హున కిచ్చి వెన్క నా
వంతయు వంతఁ బొల్పడని యట్టులొనర్పు ముమాకుమారి నా
కెంతయు జీవనౌషధి సుమీ"యని భర్తపదంబు లంటినన్. 320

మ. హిమవంతుం డనెఁ గాంత "కిట్టు చెలిరో! యిట్లేల చింతింతు, వా
హిమరశ్మిన్ జ్వలనుండు పుట్టిననుగా కీ హాని పల్కన్యథా
త్వము నొందం జన దిట్టులేల కలఁగన్ భాగ్యానుసారంబ యి
య్యమఁ బుట్టించినవాఁడె పెండిలియుఁ జేయంబోఁడె సంధాతయై.

తే. కూఁతుపయిఁ బ్రీతి కలదేని భూతపతినిఁ
బ్రీతుఁ జేసికొనంగఁ దపింపఁ బంపు
సదుపదేశం బొనర్చి నీ మనసు వనట
వాయ దటుగాని వేఱొం డుపాయమునను. 322

తే. అమరమునిభాషణ మి దెంతొ సముచితమును
యుక్తియుక్తము ; సద్గుణయుక్తుఁడైన
శంకరుఁడు నిష్కళంకుఁ డేవంకఁ జూడ
శంక విడు మింక చెలియ ! కలంకుఁ దేరి." 323

ఆ. అనఁగ నగపురంధ్రి యాత్మేశు పల్కుల
కలరి నెమ్మనమున ననుఁగు మీఱ
నుత్సహించి బిడ్డ నుత్సంగమునఁ జేర్చి
యశ్రువారి కనుల నలముకొనఁగ, 324

తే. అంతకంతకు నక్కున కద్దుకొనుచుఁ
బలుకు డగ్గుత్తికం బడి వెలికిరాక

యున్న తల్లికి నుల్లాసమొదవ నిట్టు
లనియె లోకైకమాత శైలాత్మజాత. 325

ఉ. "తల్లిరో! తొంటి నా కల వితంబిదె వి న్నగుపించి మున్ గలన్
దెల్లని వన్నెబాపఁ డుపదేశమొనర్చె 'సురర్షి వాక్యముల్
బొల్లవ నేర వంచుఁ దలపోసి తపోవ్రతదీక్షఁ బూను మీ
తల్లియుఁ దండ్రి కాదనరు తక్కొని దీక్ష వహింపు' మం చొగిన్. 326

మ. 'విధి సృష్టింపఁగఁ జక్రి పెన్ప భవుఁడున్ బిట్టార్ప లోకంబులం
బృథివీభారము శేషుఁ డూనఁ దపమే బీజంబు లే దన్యమా
విధ మెందైనఁ దపోమహత్త్వము చుమీ విశ్వావనాధారమున్
విధిసృష్ట్యైకనిదాన మం చని తపోనిష్ఠం బ్రవేశింపుమా!' 327

తే. అనుచు నాకిటు బోధించి యరిగె"నంచు,
"నాత్మ నిక్కల నిక్కల యా నటంచుఁ
దోఁచె" నంచును సుతపల్కఁ దుహినశైల
పత్నియు నదంత మగనికిఁ బలికెనంత. 328

ఉ. తల్లికిఁ దండ్రికిన్ బహువిధంబుల నూఱటఁ బల్కి యుల్లమం
దుల్లస మంది పార్వతి తపోత్సుకయై చనె నంత నెల్లరుం
బెల్లగు చింతలో మునుఁగ వేదశిరుం డనుమాని వచ్చి యం
దెల్లర కయ్యుమామహిమ మేర్పడఁ దెల్పెను వార లూఱడన్. 329

చ. పతిపదపద్మముల్ దలఁచి పార్వతి కానఁ దపింపసాగెఁ దా
నతిసుకుమారి యయ్యును నిజాంగము తప్యముగా నిదైన సం
తత మతినిష్ఠ మై మఱచి తద్దయు రోసి సుఖంబు లన్నిఁటిన్
శితిగళుపాదమూలమున నిచ్చలు నిచ్చలు హెచ్చఁ గ్రొత్తలై. 330

సీ. ఫలమూలములఁ గొంచు పదినూఱులేండ్లుండె,
నూఱేఁడులు తపించెఁ గూరలఁ దిని,
జలవాయువులఁ గ్రోలి జపియించెఁ గొన్నాళ్లు,
కొన్నినా ళ్లేకభుక్తులఁ దపించె,
క్షోణీపతితమైన శుష్కపర్ణంబులఁ
దిని మూఁడువేలేండ్లు దీక్షసలిపె,
నాపర్ణములనైత మారగింపకయ త
ప మొనర్చి దాన నపర్ణ యయ్యె,
నగజ యిట్టు తపశ్శుష్క యగుటఁ గాంచి
బ్రహ్మవాణి దివిన్ వినవచ్చె నిట్టు
'గౌరి! నీకోర్కెలీడేరుఁ గాసి పడకు
శంకరుం డింక నీకు వశంకరుఁ డగు. 331

మత్తకోకిల :

ఇట్టు లుగ్రతపం బొనర్చిరె యేతపోనిధులేని మున్
బట్టు బట్టక తండ్రి పిల్చిన పట్టునం జను మింటి కె
ప్పట్టునన్ బుష్పు లేగుదెంతురొ బ్రహ్మవాక్యము నిక్కమౌ
నట్టు లప్పు డెఱుంగు మీనుడి కన్యధాత్వము లే దిఁకన్.' 332

ఆ. అనిన మింటిపల్కు లాలించి యా యుమ
యొడలుపులకరింప నుబ్బె నిటులు
కొండచూలి కతను గొంత చెప్పితి నింక
వెలిమల దొరయున్న వితము వినుము. 333

శివుఁడు పార్వతీప్రేమపరీక్షార్థము సప్తర్షుల హిమగిరి కంపుట

చ. సతిమెయిఁ బాయుటాదిగను శంకరుఁ డెంతో విరక్తిఁబూని సం
తతమును రామనామమును దాల్మి జపించుచు రామనామసం
స్తుతి శ్రుతిపర్వమై పరగు చోట్లకుఁ బోవుచు వీతసంగుఁడై
క్షితి సకలమ్మునుం దిరిగె శ్రీపతిఁ జేర్చిన చిత్తవృత్తితో. 334

క. ఒక్కెడ రాముని( బాడు మ
ఱొక్కెడ జ్ఞానంబు మునుల కుపదేశించున్
మిక్కిలి యకామి యయ్యును
నక్కట ! యుమతోడఁ దాను నలయుచు హరుఁడున్. 335

తే. అనుదినంబును రామపాదారవింద
చింతనాసక్తి భక్తులు చెంగలింపఁ
బెద్దకాలము పోయె నాపిదప నతని
ప్రేమనేమంబు స్థిరభక్తిరేఖయుఁ గని, 336

క. తేజోనిధి శీలావధి
రాజద్గుణశరధి దాశరథి కనవచ్చెన్
రాజద్దివ్యకళానిధి
రాజకళాధరుని మ్రోలఁ బ్రకటాకృతియై. 337

తే. వచ్చి తనగూపుఁజూపి 'యోసచ్చరిత్ర
నీవకాకిట్టి కట్టిడి నేమ మూని
నెఱపువా రుండ్రె యెం'డ్లని నియతి మెచ్చి
సందడి నుమా జప తపః ప్రసక్తిఁదెచ్చి. 338

ఉ. అన్నగరాజుకూఁతు జననాదితపశ్చరణాంతవృత్తముం
బన్నగధారికిం దెలియఁ బల్కి రఘూద్వహుఁ డాడెఁ గ్రమ్మఱన్

‘గ్రన్నననేగి పార్వతికరగ్రహణం బొనరింపు మింపునన్
మన్నన సేతువేని మది మద్వచనమ్ముల నాలకించుచున్.’ 339

చ. అనవుఁడు శంకరుం డనె ‘మహాత్మ! భవద్వచనం బవార్య హాఁ
బొనరుతు నీయనుజ్ఞఁ దలఁ బూని యి దాశ్రితధర్మహాను నా
కొనరఁగఁ దల్లిదండ్రులును నొజ్జయు ఱేఁడు నొసంగు నాజ్ఞలం
జనుఁ సలుపన్ శుభాశుభవిచార మొనర్పక నిర్విశంకివై. 340

తే. కాన నీ వన్నిఁటన్ హితకారివౌదు
వార్య! భవదాజ్ఞ మచ్ఛిరోధార్య మగు’ న
టంచు భక్తి వివేక ధర్మాన్వితముగ
భవుఁడు వచియింప శ్రీరామభద్రుఁ డలరి. 341

ఉ. వెండియుఁబల్కెఁ ‘గొండదొర! విస్మృతి నొందకు మీపణం బెదన్
దండిగ నాదుపల్కు జవదాట’కటంచు నదృశ్యుఁడైన రా
ముండు, భవుండు నందు రఘుపుంగవు డెందమునందు నిల్పి కూ
ర్చుండఁగఁ గశ్యపాదిమును లొయ్యన వచ్చిరి దర్శనార్థమై. 342

మ. భవుఁ డవ్వారికెఱింగి భక్తిని ‘దపోవంద్యుల్ మదర్థంబుగా
నివపున్ గుబ్బలికేగి గౌరి నెనరెంతేనిం బరీక్షించి య
జ్జవరాలిం బురిఁజేర్చి రం’ డనఁ దదాజ్ఞం బూని వారేగి యం
దవలోకించిరి మేను బూనిన తపస్యన్ నాఁగ నాపార్వతిన్. 343

ఉ. చెంతకునేగి మెచ్చుచును జిత్తమునన్ దదుదారనిష్ఠ ‘నో
యింతి! మహాత్తపం బొనరుతెందుల కెవ్వని నేమి కోరి యా
మంతన మంతయుం దెలియ మాకు నిజం బెఱిఁగింపు’ మన్న నా
కాంత వచించె నివ్విధిని గ్రమవినమ్ర మృదూక్తి యుక్తమై. 344

ఉ. 'గ్రక్కున శంక తోఁచె మునిరాజులు నాజడబుద్ధిఁ గన్గొనం
బక్కున నవ్విపోదు రని స్వాంతము పట్టిన తిక్కఁదెల్పుకో
దెక్కుడు నెట్టిబోధ మెద నెంచెదు నీటను గోడఁబెట్టఁగా
తెక్కులు లేకె పైకెగుర రేగెడు నా యవివేక మేమనన్. 345

క. నిక్కము మునినుడి యను తలఁ
పెక్కఁగ నవికారుఁడౌ మహీశుని యందున్
నెక్కొనెఁ దిరమౌ మక్కువ
యక్కతనఁ దపించుచుంటి' నన మునులంతన్. 346

చ. పలుకుచు మేల మాడి రిటు 'కొండకుఁ బుట్టిన దాన వౌ దహా
పలుకుము నారదోక్తి నిలు పట్టిరె యొక్కరు వాని పొచ్చెపుం
బలుకుల చిత్రకేతు నిలు పాడఱె, దక్షజు లింటి నంట కా
కలములఁ దించు జోగులయి రాసురవైరిగృహంబు పాడఱెన్. 347

క. నారదు నుపదేశము విను
వా రిలువిడి గోచిపాఁతబడుగుల రౌదుర్
ధారణిఁ దద్ధోరణి ముని
ధోరణియే కాని మేటి ధూర్తుఁడు సుమ్మీ. 348

మ. జను లెల్లం దనుఁబోలు జోగులుగ నాశాసించు తన్నారదో
క్తిని నిక్కమ్మని నమ్మి నెమ్మదిని బ్రీతింజేసి తేరీతి నీ
వనుమానింపక యంబరాంబరుఁడు సర్పాన్వితుఁడున్ నిర్గుణుం
డు నుదాసీనుఁ డగేహియై పునుకఁ గూడుం గుడ్చు నా జోగినిన్. 349

తే. నారదుని మాయమాటలు నాటెఁగాని
యేమి సుఖయింతు వాపతిఁ బ్రేము డించి
జంట లేకుండ, భూతము లింటనుండ,
నొంటి నుంటకు మిన్నంటె కొప్పునె మది. 350

క. తొల్లిఁ దను బెండ్లి యాడిన
యిల్లాలిని నొల్ల కిడుమ లిడి చంపించెన్
జల్లని యుల్లముతో నిపుఁ
డిల్లిల్లుం దిరిగి బిచ్చ మెత్తుక తినెడున్. 351

ఆ. ఉండఁ గొంపలేదు, పండఁ బాన్పులేదు,
బండ తోలు, చట్టుబండ కాని
బుస్సకొట్టు విసపుఁబురువు సొమ్ముల వాఁడు,
దిసమొలాఁడు, కాటఁ దిఱుగువాఁడు. 352

ఉ. నీ కిటు వీని యందు నెటు నెక్కొనె ప్రేముడి? నేటికైన మా
వాకుల విశ్వసింపు మనవద్య శ్రుతిశ్రుతకీర్తి సుందరున్
నీ కనురూపుఁడౌ వరు ననింద్యుని నొక్కనిఁ గూర్చి తెత్తు మా
శ్రీకరు శ్రీపతిన్ సుగుణశీలవికాసు వికుంఠవాసునిన్.' 353

చ. అనుఁడు నొకింత నవ్వుచు మహర్షుల కిట్లనె శైలకన్య 'యో
మునివరులార! నే గిరికిఁ బుట్టితి నంట నిజంబు గాననే
తను విధి పాసెనేని నిజధారణఁ బాయ శిలాభిజాతమౌ
కనకము కాలియుం గరఁగి క్రాఁగియుఁ గోల్పడునే నిజద్యుతిన్? 354

తే. భవనమొ వనంబొ నివసింప నవునుగాక
దేవమునిమాట జవదాట దీర దిపుడు
గురుని యుపదేశమందున గుపుతరమగు
శ్రద్ధలేకున్నఁ గలనేని సిద్ధియున్నె. 355

మ. వినుఁ డయ్యీశుఁడు దోషయుక్తుఁ డగుచో విష్ణుండె సచ్ఛ్రేష్ఠుఁడై
నను నాఁగా కెపుఁడెద్ది బుద్ధి నిడు మున్ వాఁడద్దియే కోరెడున్
మును మీ రే చను దేర మీనుడియు నామూర్ధ్నంబునం దాల్పనే
తను విందాక శివార్పణంబుగను శ్రద్ధాభక్తి నర్పించితిన్. 356

క. పెండిలిబేరము లోనరుప
కుండఁగ లేరేని బని మఱొండెదిలేదేన్
బెండిలికి వధూవరు లిల
మెండుగనున్నారు పొందు మేళ మొనర్పన్. 357

ఉ. గౌరశరీరుఁ గోరి పతిగాఁ బడతున్ వినుఁ డాతఁ డబ్బఁడేన్
గోర మఱొండు కన్నెనయి కోటిభవంబులనైన నిల్తునే
మీఱను నారదోక్తులను మీ రననేల శివుండె మాన్పినన్
ధీరవరేణ్యులార! చనుదేరుఁడు కాలవిలంబ మయ్యెడున్.' 358

చ. నయగతి నిట్టు పల్క గిరినాథసుతాప్రణయంబు మెచ్చుచున్
'జయ! జయ! లోకమాత! శివశాంకరు లిర్వురు మీర లీజగ
త్త్రయికిని దల్లిదండ్రు' లని తన్మునులేగి హిమాద్రిపాలికిన్
రయమునగౌరిఁదేఁబనిచి రాజధరుం గన నేగి రంతటన్. 359

తే. తెలియఁ బల్క నుమా తపోదీక్షయు శివ
పదసమర్పిత సుస్థిరస్వాంతవృత్తి
మాటి కభవుఁ డుమాప్రేమమగ్నుఁ డౌచు
ధ్యానదశనున్నమును లిండ్ల కరిగి రంత. 360

ఉ. అత్తఱిఁ దారకాహ్వయమహాసురుఁ డాత్తతపోమహత్త్వ రే
కెత్తఁగ మిత్తియున్ ముదిమి యెత్తెవు లత్తమి మత్తుమీఱి యు
ద్వృత్తుగ ముజ్జగాల నులివెట్టుచుఁ దత్తదధీశ్వరాళిసం
పత్తులఁ గొల్లకొట్టుచు విపత్తుల నొత్తుడు వెట్టెఁ గ్రూరుఁడై. 361

క. పోరుల నెన్నిఁటనేని సు
రారి మదం బణఁప లేక యమరులు విధితోఁ
'దారకుఁడు పెట్టు భాధకుఁ
దారకుఁడవు నీవ చు మ్ముదారగుణాఢ్యా!' 362

తే. అంచు మొఱవెట్టువారి వారించి కాంచి
యనునయించి విరించి యిట్లనియెఁ బేర్మి
'దుర్గకును భర్గునకు బుట్టు దుర్దమన కు
మారకుఁడె మారకుం డగుఁ దారకునకు. 363

ఉ. ఇం దొకసాధనంబు కల దిందున నిందుధరుండు తోడ్పడన్
బొం దగు నిద్ది తొంటితనువున్ విడి దక్షజ శీతశైలరా
ణ్నందనయై మదిం బ్రమథనాథుని నాథునిగా వరించి దీ
క్షం దపియించుచుండె నిట శంకరుఁ డుండె సమాధి నిష్ఠుఁడై. 364

క. అసమంజస మైనను మరు
నెసకొలుపుఁడు భవునిపాలి కేగఁగ నతఁ డిం
పెసఁగఁగ మనసుం గలఁచిన
వెస నేగి వివాహ మాడ వేఁడుద మభవున్. 365

మన్మథుఁడు శివుని నేత్రాగ్నిని భస్మమగుట

క. ఇవ్విధి సురహితవహా నని
యవ్విధి యవ్విబుధకోటి' కన 'నౌ నౌ' నం
చవ్వారు మరుఁ దలంచిన
న వ్విరివిలుకాఁడు వారి కగపడె నెదురై. 366

చ. మరుఁ డరుదెంచి నంత సురమండలి తా మును బడ్డపాటులుం
జరిగెడు కార్యముం దెలుప 'శంకరవైరికి శ్రేయ మెట్టులౌ
నరయఁగ' నంచు నెంచి మరుఁ డాడె 'భవద్ధిత మే నొనర్తు ని
ద్ధరణి శ్రుతుల్ పరోపకృతి దాఁటిన ధర్మము లే దనుంగదా. 367

చ. పరహితవృత్తి నై నొడలు వాసిననే మది మెత్తు రుత్తముల్
ధరణి' నటంచుఁ బల్కి విబుధ ప్రకరంబులకెల్ల మ్రొక్కి యా

శ్వరు నెదిరించి తాను బలవంతపు చానెటు కాంచకుండు నం
చరిగె జగత్త్రయంబుఁ గుసుమాస్త్రములం బరగించి గెల్చుచున్. 368

ఉ. కూలెను శ్రౌతసేతువులు, కూలము మీఱెను బ్రహ్మచర్యముల్,
దూలెను సంయమవ్రతతతుల్, జపయోగవిరాగనిష్ఠలున్
మూలకుఁ బాఱె జ్ఞానమును మొత్తముగా భయమంది గ్రంథముల్
శైలగుహన్ మడంగె సుమసాయకుఁ డల్గుచు నల్గు లెత్తఁగన్. 369

శా. 'ఏ నే మిట్టి చికాకొనర్చెదు జనుం డెవ్వాఁ డెవం డిందు మ
మ్మోమం జాలు' నటంచుఁ దల్లడిలి కామోత్కంఠ స్త్రీపుంభిదా
సీమల్ వీడ్వడ జీవరాశి యెడఁబాసెన్ స్వస్వమర్యాదలన్
గామాస్త్రాహతిఁ దప్పినట్టి ఘనుఁ డొక్కండైన లేకుంటచే. 370

సీ. పొంగె సరిత్పతిసంగమార్థము నదుల్,
బొంగెఁ గాసారముల్ పుష్కరిణికి,
వంగె మ్రాకులు లతాసంగమంబును గోరి,
రతివాంఛ జగమంతఁ బ్రబలె, నిటు ల
చేతనసృష్టియె చిక్కఁగ మరుబారిఁ
జేతనంబుల జాడఁ జెప్పనేల ?
స్థలజలంబుల నభస్థలిఁ గల జీవముల్
విరివింటి కగ్గమై వేళ మఱచె,
లోక మెల్ల కామాంధమై వ్యాకులపడె
జక్కవల జంట రే వగల్ జరుగు టెఱుఁగ
కుండె, భోగాళులైరఁట యోగులె యన
నాడ నేటికి నరకిన్నరాసురులను. 371

మ. తొలుతన్ బ్రహ్మమయంబుగాఁ దలఁచు చాతుర్వర్గహా సృష్టినిం
దలఁపం జొచ్చిరి నాఁడు స్త్రీమయముగాఁ దత్త్వజ్ఞులున్ జ్ఞానులున్
లలి యోగీశులుఁ గామకింకరులు నుల్లాసాంధులై యున్నచోఁ
దలఁపం బోలునె నిత్య కామరత భూతప్రేత దైత్యాదులన్. 372

క. పురుషునకు స్త్రీమయంబుగఁ
బురుషమయంబుగను సతికిఁ బొడకట్టెఁ జరా
చరభూతసృష్టి యంతయు
స్మరకౌతుక మిట్లు పర్వ సర్వజగములన్. 373

తే. అంగభవుఁ డంతరంగము దొంగిలింప
నెవఁడు దిటముండె రామకృపైకపాత్రుఁ
డొక్కరుఁడుఁ దక్క నవ్వేళ నిక్కరణిని
గంతు రంతయ్యె భువి రెండు గడెలవరకు. 374

ఉ. కంతుఁడు రంతుఁ జూపి ఘటికాద్వయ మిట్టు మహేశుఁజేరి యా
చెంతనె యాతనిం గనుచుఁ జేష్టలఁ దక్కి సశంక నిల్చినన్
శాంతి ఘటిల్లె నెల్లరకు సర్వజగమ్ములు నెప్పటట్లుగా,
శాంతిని జంతుసంతతులు సంతస మందెను, మత్తుఁ దేర్కొనన్. 375

చ. హరుఁ బరమేశు నీశుని దురాసదు దుర్గముగాఁగ నెంచి య
మ్మరుఁడు భయావిలాత్ముఁడయి మాటికి నెమ్మదిఁ గుంది వెన్కకుం
దిరుగుట సిగ్గుబాటని మదిన్ మరణమ్మునె రూఢి నమ్ముచుం
దెరు వొకఁ డెంచి యాతఁ డరుదేరఁగఁ జేసె వసంతు నంతటన్. 376

ఉ. పూచెను నూత్నవృక్షములు, పొల్పువహించె నదుల్ సరమ్ములున్,
సాచె స్మరాగ్నిమిత్రములు చల్లని మెల్లని పిల్లతెమ్మెరల్,
తోఁచెను స్వచ్ఛమై దిశలు, దోఁచె మరుండు, మృతాళి లేవఁగా
వీచెను ప్రేమవీచికలు వింత వసంతుఁడు వచ్చునంతటన్. 377

క. కొలఁకులఁ గల కమలంబుల
నళికులములు వ్రాలి 'ఝుంఝు' మని ధ్వనిచేసెం
గిలకిలకూసె విహంగము
లలరంగా నాడిపాడి రచ్చరచ్చానల్. 378

మ. కళ లన్నింటిని జూపి మన్మథుఁడు లక్షల్ కోటులా యత్నముల్
సలిపెం గాని మహేశు యోగ నియతిం జాలింపలే కోడి బి
ట్టలుకన్ మామిడి నొక్కఁడెక్కి యతఁ డం దాత్మీయబాణంబునొం
డల పూవింటను జొన్పి వైచె శ్రుతిపర్యంతంబు సారించుచున్. 379

ఉ. కన్నులవింటివాని విశిఖమ్ములు లోమ్మునఁ దాకినంత ము
క్కన్నులవేల్పు నిష్ఠ చెడఁ గాసిలి మేల్కొని లోఁ గలంగుచుం
గన్నన నల్దెసల్ గలయఁ గాంచి తటాలున మావికున్నపై
నున్నమరుం గనుంగొని మహోగ్రతఁ జిచ్చుఱకన్ను విచ్చినన్. 380

క. ముక్కంటి కంటిమంటకు
నక్కన్నులవింటివేలు పాహుతిగాఁగన్
రక్కసులు భయముఁ దక్కిరి
స్రుక్కిరి దేవతలు నడ్డుచూడరు యోగుల్. 381

క. యోగులకంటకులై రల
భోగులుమదిఁ గామసుఖము బుద్ధిం దలవన్
సాగిరి ముజ్జగములలో
మ్రోఁగెను హాహారవంబు రుద్రారిపడన్. 382

ఉ. కాంతుఁడు పడ్డపాటు రతికాంత కనుంగొని మూర్ఛమున్గి యొ
క్కింతకుఁ దెప్పిరిల్లి పరమేశుదరిన్ దల మోఁదుకొంచుఁ బె
న్వంతను జాలిపుట్టు నటు వందురఁ గారుణి కాగ్రగణ్యుఁ డా
కంతువిరోధి కంతుకులకాంతకు నిట్లనె నాశుతోషియై. 383

శా. "ఈనాఁ డాదిగ నీమగండు జగమం దెచ్చో ననంగాఖ్యుఁడై
హీనాంగుండయి యుండియున్ జనులయం దెల్లన్ విజృంభించి ముం
దేనాఁ డాహరి పుట్టుఁ గృష్ణుఁ డగుచున్ వృష్ణ్యన్వవాయంబునం
దానాఁ డాతని కాత్మజుం డవు నిజంబౌ నమ్ము మీనానుడిన్. 384

తే. నమ్ముమో కొమ్మ నావచనమ్ము నమ్ము
కా"దటంచును శివుఁ డన్న ఖేద ముడిగి
యంతటం జనె రతికాంత కంతుపత్ని
విను మనంతరవృత్తాంత మనఘచరిత. 385

శా. వృత్తాంతం బి దెఱింగి వేలుపుగముల్ వేధోహరుల్ తోడురాన్
బుత్తెంచెన్ రజతాద్రి కంత శివు వేల్పుల్ వేఱ యగ్గించి రా
మొత్తంబుంగని యమ్మహేశ్వరుఁ 'డిటుల్ మొత్తంబుగా మీరిటం
బుత్తెంచం గత మేమొ తెల్పుఁ' డన వేల్పుం బెద్ద యిట్లాడెడున్. 386

క. "సర్వాంతర్యామివియున్
సర్వజ్ఞుఁడ వౌదు వీవు సద్భక్తివశా!
సర్వేశ! తెలుపనేల సు
పర్వాభీష్టంబుఁ దీర్పు భవ! భవహరణా! 387

మ. కనులారం గనఁ గోరుచుంటిమి భవత్కల్యాణ మోదేవ! మా
కనువిం దేర్పడఁ బెండ్లియాడుము, జగత్కల్యాణకల్పాగమా!
మును మారుం బరిమార్చి వెన్క రతి కేల్మోడ్పం బ్రసాదించి తా
మును శాసింపను వెంటఁ గావ సహజమ్ముల్ గావె మీ బోంట్లకున్.

ఉ. పర్వతరాజనందన యపారతపం బొనరించె నా యమన్
బర్వినప్రీతిఁ గైకొని సుపర్వహితం బొనరింపు" మన్న నా
శర్వుఁ డుమాకరగ్రహణసంభ్రమకౌతుకుఁడై యొడంబడెన్
బర్వెను మంగళధ్వనులు వాగెను భేరులు పూలవానకో. 389

మ. సమయమ్ముం గని రాఁగ సప్తఋషులన్ శర్వుండు పంపించె నా
హిమవంతుం గన వార లంతఁజని ముందే పార్వతిం గాంచి "యో
యమ! మామాటఁ దలంప కా తపసివాక్యంబే నిజం బంటి నీ
సమయంబుం బొలివోయె శంకరుఁడె దృగ్జ్వాలన్ దహించెన్ మరున్.

మ. అనుఁడున్ లేనగ వంకురింప నుమ యిట్లాడెన్ "మునిగ్రామణుల్ !
మునుమున్ జిచ్చఱకంటి కంటిసెగఁ గాముం గాల్చెనం చంటి ర
య్యన చంద్రానలనేత్రుఁ గాముకునిగా నిందాఁకఁ జింతించి రే
యన వద్యుం డవికారిగాఁ గొలుతునే నాస్వామి నిష్కామిగన్. 391

మ. తను వా జ్ఞానస శుద్ధి శంకరుని శ్రద్ధాభక్తులం గొల్తు న
య్యనఘుండే మదభీష్టముల్ నెఱపుఁ; బుష్పాస్త్రున్ దహించెన్ శివుం
డనుటల్ మీ యవివేకమే చుఁడి స్వభావాత్యుష్ణరోచిష్ణుఁ డౌ
ననలున్ ముంచునె మంచు? ముంచినను దా నంతంబు గాకుండునే?

తే. ప్రొద్దు కెగసిన సంపాతి పొలిసినట్లు
లగ్గి నెనసిన యది యెల్ల బుగ్గి కాదె"
యనుడు నుమ తపోదీక్షలక్ష్యముల కలరి
యాయమ కెఱంగి మలతేని డాయ నరిగి. 393

క. మును లాతని కెఱిఁగింపఁగ
మనసిజ దహనమున కతఁడు మలయుచు లోలో
విని మఱి రతి నోదార్చిన
యనుకంపానిధి యనుగ్రహంబున కలరెన్. 394

మ. అభవప్రాభవ మెంచుచున్ మునుల నాహ్లాదాన రావించి స
చ్ఛుభ నక్షత్ర యుతాహమున్ సుఘటికన్ శోధించి శ్రుత్యుక్తిమై
రభసం బొప్ప ముహూర్త ముంచి శుభపత్రం బిచ్చి సప్తర్షులన్
సభయ శ్రద్ధల వేఁడి మ్రొక్కి పనిచెన్ శైలేశ్వరుం డత్తఱిన్. 395

ఉ. లేఖను ఫాలలేఖన విలేఖరిచేతికిఁ దెచ్చి యిచ్చి యా
లేఖమునుల్ చనంగ, శుభలేఖఁ బఠించి విరించి వేడ్క నా
లేఖుల కంతయున్ వినిచె. లేఖగణంబు కుతూహలంబుతో
నా ఖతలంబునుండి పటహంబులఁ గొట్టె ప్రసూనవృష్టితో. 396

క. మంగళచిహ్నంబులు గా
నంగణములఁ గలశము లిడి, యచ్చర లాడన్
సింగారించిరి ప్రమథులు
బంగరుమలవింటివాని బహుభంగులుగన్. 397

శివుఁడు సపరివారుఁడై హిమగిరి కరుగుట

సీ. కుండలుల్ కంకణకుండలంబులు గాఁగఁ,
బూతమహా భూతి మైపూతగాఁగ,
నుపవీతములు గాఁగ నురగమ్ములగమ్ము,
లలరు బెబ్బులితోలె వలువగాఁగ,
నృకపాలమాలికల్ నెఱి హారములుగాఁగ,
జటలు సర్పాళి మకుటము గాఁగఁ,
గనదుత్తమాంగము గంగాతరంగిణిన్
బాలేందురుచితోడ ఫాలమలరఁ,

గేల డమరుత్రిశూలముల్ కేళిఁ బూని
విశ్వశుభదుఁ డయ్యు వికారవేషమూని
కడిమిఁ బసిఁడిజక్కి నెక్కి ముక్కంటి యేగె
వాద్యములు నల్గడల నిండి బలిసి మ్రోయ. 398

క. మునుముం దేగు శివాకృతి
కనువిందై కానఁబడమిఁ గ్రతుభుక్కాంతల్
'కన మిట్టి యందగానికి
ననువౌ దగుసుందరాంగి' నని నగిరంతన్. 399

క. తమకము మీఱఁగ సింగా
ర మొనర్చి స్వవాహనముల బ్రహ్మాదిసురల్
గుమిఁ గూడి చనిరి కానీ
సమరూపులు గారు వారు జటిలవరునకున్. 400

క. 'వరునకు ననురూపులుగా
రరయఁగ నీపెండ్లివారటంచును మనలన్
బరిహాస మొనర్తు రటన్
నిరుకుగ వేఱ్వోఁజుఁ జనుఁ' డనెన్ హరి సురలన్. 401

చ. అను డెలనవ్వు తోఁప సురలందఱు వేఱయి రాష్ట్రకోటితో
మినుసిగ వేల్పునట్లు హరి మేలములాడఁగ నవ్వుకొంచు రాఁ
బనిచెను భృంగినిన్, బ్రమథపారిషదాళినిఁ గూడ వెంటరా
ననుచుటకై యతండును శివానుమతిం బిలిచెన్ గణంబులన్. 402

క. నానాయూనారోహులు
నానాలంకారయుతులు నటనాన్వితులై
శ్వానశ్యేనాననులై
నానావిధభూతములు పినాకినిఁ జేరెన్. 403

క. ఆడుచు నాటలఁ బాటలఁ
బాడుచు నుప్పొంగుచుం గపాలధరులునై
యాడుచుఁ దాండవ మాడుచుఁ
జే డమరులఁ బూని రక్తసిక్తాంగులునై. 404

తే. ఎక్కుడగు నెక్కుడుల నెక్కి యీశు మ్రొక్కి
వికటరూపులు నవయువ వికలు లగుచుఁ
గదలెఁ బ్రమథగణంబు ముక్కంటి వెంట
'వరున కనురూపు లీపెండ్లివా' రనంగ. 405

ఉ. ఒక్కఁడు పీనసుండును మఱొక్కఁడు మిక్కిలి బక్కవాఁడు వే
ఱొక్కఁడు మోములేని యతఁ డొక్కఁడు మిక్కిలి మోములాఁడు నిం
కొక్కఁడు కాలుచేతులవి యుండియు నుండ కొకండు లెక్కకున్
మిక్కిలియై చనెన్ గణము మిక్కిలికన్నుల వేల్పు పెండ్లికిన్. 406

శా. ఇచ్ఛో భూధరుఁడున్ వితానముల నం దెన్నేని కట్టించుచున్
మెచ్చన్ రాని విధాన నంబుధులకున్ మిన్నేఱు మున్నైనదుల్
బెచ్చన్, లొచ్చగు కొండలన్నిఁటికిఁ బంపింపన్ శుభాహ్వాన మం
దిచ్చన్ వచ్చిరి కామరూపధరులై యిష్టాళితో వారలున్. 407

మ. పరివారంబులతో యథేష్టమగు రూపం బూని యే తెంచు నా
నరనారీతతి నుంచె న మ్మల యథాన్యాయమ్ములౌ నిమ్ములన్
దరమే పేర్కొన వానిఁ దత్పుర సరోద్యానాదిసౌభాగ్య మా
పురశోభం గనినంతఁదోఁచు విధినై పుణ్యంబు నా దాఁటుగన్. 408

క. నగరింగల నరనారుల
సొగసు నరసి మునుల మనసె చొక్కుచు నుండెన్
నెగడెనట బుద్ధిసిద్ధులు
జగదంబాజన్మభూమి శక్యమె పొగడన్. 409

క. పొంగుచు నంగన లెల్లరు
మంగళములఁ బాడి రంత మానితరీతిన్
ప్రాంగణములఁ దోరణములు
రంగగు ధ్వజములును జెలఁగెఁ బ్రతిగృహ మందున్. 410

ఉ. అంతట శీతశైలనగ రాంతికభూమికిఁ బెండ్లివారు రా
నెంతయుఁ బ్రీతి వారి కెదురేగి సుపర్వగణంబు ముందురాన్
వింతగ వారిఁగాంచి యటువెన్క హరిం బరివారయుక్తు న
త్యంతముదంబు మీఱఁ గని రాదట నన్నగరాజ బాంధవుల్. 411

తే. ముందు సురకోటిఁగని మోద మొందెఁ గాని
భూతపతిఁ జుట్టు భేతాళములను గాంచి
వాహనంబులు బెదరి పెన్ బాఱి చెదరె
బుడుత లిండ్లకుఁ బాఱిరి జడుపుఁ గొనుచు. 412

తే. ధీరులై పెద్ద లెటొ నిల్చి రోరిమిఁగొని
ప్రాణభీతిని నిలుబాఱి బాలు రెల్ల
రొడలు వడఁకఁగ నోటను నుడి వెడలక
ఆడిరిటు లెట్లొ తలిదండ్రు లడిగినపుడు. 413

ఆ. "ఆలపోతు నెక్కి యరుదెంచె దిసమొలం
బిచ్చివాని పోలెఁ బెండ్లికొడుకు
వెంట నతని బంట్లు పెండ్లివారై వచ్చి
రంతకాంతకు లటు లడలు గొలుప. 414

శా. ఒంటిం బూదియు సర్పకర్పరములే యుగ్రమ్ములౌ సొమ్ములై
వెంటన్ భూతపిశాచ ఢాకినులునుం బ్రేతమ్ము లేతెంచ ము
క్కంటిం బెండిలివారిఁ గాంచి యుసురుగ్గం బట్టు పుణ్యాత్ములే
కంటం జూతురు పెండ్లి"యన్న శిశువాక్యం బంటె నింటింటికిన్, 415

తే. అంత శివగణోదంత మదంత యెఱిఁగి
తల్లడిల్లెడు పిల్లలఁ దల్లిదండ్రు
లెటులొ యూఱటఁ గొల్పి రెన్నెన్నొ గతుల
'బాలులార ! భయంపడ వల'దటంచు. 416

ఉ. సాంగసమాజుఁడై గిరియు నాదర మారఁగ బెండ్లివారినిన్
రంగుగఁ దోడి తెచ్చి గృహరాజములన్ విడియించె భూభృద
ర్ధాంగియు బాంధవాంగనలు హారతిపళ్లెర మూని ముందు ఖ
ట్వాంగధరుం గనం జని తదాకృతిఁ గాంచి బిరానఁ బర్విరా. 417

క. యోషామణు లిలు దూఱెరి
భీషణభూషణుని వికటవేషునిఁ గని యా
యోషామణి గిరిపత్నియు
శోషిల్లుచు వ్యధను బలికె సుత నోడిఁ గొనుచున్. 418

చ. "సురతరుయోగ్యమౌ ఫలముఁ జొప్పడఁ దుమ్మికుఁగూర్చి నట్లజుం
డురుకమనీయరూప మిడి యున్మదుఁడౌ వరుగూర్ప నేల ? చి
చ్చుఱుకుదు, నబ్ధిఁజొత్తు, గిరినుండియు దూకుదు నిన్నుఁగూడి, యీ
పరిణయముం బొనర్ప నిలు పాడఱుఁబో తలవంపు లౌను బో." 419

తే. మంచుమలమించుబోఁడి యిట్లంచు నలమ
టించుచుండగఁ దోడి చేడియలు గూడ
నామెతోఁగూడి గోడున కగ్గమైన
నాత్మ సురమౌనిఁ దలపోసి యాడిపోయు. 420

తే. మరులు గొలిపి యీదినమొల మగనిఁ గూర్చి
తపముసేయఁ బ్రబోధించి తనయనలిచి
కొంప కిది తెచ్చెఁ గాని నిలింపమౌని
కేమి యపరాధ మొనరించి నామె ! యెఱుఁగ. 421

తే. ఇల్లు వాకిల్లొ ! ధనములొ హితజనములొ
ఆలు బిడ్డలొ ! మోహమో ! యతనికెందుఁ
బరగృహధ్వంసి, జాలి జం కరయ లేవు
గొడ్డురా లెట్లెఱుంగును బిడ్డకుట్టు." 422

మత్తకోకిల :

తల్లి యివ్విధిఁ దల్లడిల్లినఁ దన్నగాత్మజ యిట్లనెం
"దల్లి ! వెంగలి భర్త యౌ నని ధాత వ్రాసిన వ్రాలెటుల్
పొల్లగుం బరులందు దోసముఁ బూన్తువే వృథ నీ విటుల్
తల్లడిల్లిన భాగ్యరేఖయుఁ దప్పునే యెటుపోయినన్. 423

మ. విధి(వ్రాతంగల భాగ్యభోగ్యవిధముల్ వెన్నంటు నెం దేగినన్
విధిసంకల్పము దాఁటరా దిపు డెదన్ వేసారఁగా వేళయే
వృథగా ర ట్టొడిఁ గట్టుకోకు” మను పృథ్వీభృత్సుతో క్తిన్ వినన్
వ్యథలం గన్నులనీరు నింపి రట వారంతన్ విధిన్ దూఱుచున్. 424

ఉ. పర్వతమాళి యింటికి సుపర్వమునీంద్రుఁడు నారదుం డటుల్
పార్వతితల్లి తల్లడముఁ బాపఁగవచ్చి వచించి పార్వతీ
పూర్వచరిత్ర మెల్ల “భువిఁబుట్టుక గిట్టుక లేని శక్తి యీ
పార్వతి నీదుపుత్రి పతిఁబాయక సామెయి నంటియుండెడున్. 425

క. జననస్థితిలయకారిణి
తనువు లనంతములఁ దాల్చుఁ దను దా స్వేచ్ఛన్
వినుము జగదంబ నీ సుత
యనుమానము మాను మిది యథార్థము సుమ్మా. 426

సీ. తొలుత దక్షునియింట దుహితయై సతియనం
గమనీయరూపాదికముల వెలసి,
యీశ్వరుఁ బెండ్లాడె నీ కథవిశదమూ,
నంత నొక్కప్పు డీశు నంటిఁ జనుచు,
రఘుకులమణి యైన రామభూకాంతునిఁ
గని మాయకున్ లోఁగి గాంతుఁ నుడి
వినక జనకజాతవేషంబుఁ దాలిచి
శ్రీరామచంద్రుఁ బరీక్షఁజేసె,
నట్టి యపరాధమున నీశుఁ డామెను విడ
నసహావిరహవ్యథం బితృయజ్ఞశాలఁ
దనువు విడి యిట్టు నీయింట జననమొంది
పతిఁ దపించె నుమ సదాశివప్రియ చుమ.” 427

సీ. అనవుడు మునిపల్కు లంతరంగము నాటఁ
జింత లుడిగి సంతసిల్లి రెల్ల,
రింటింటఁ బురినంత నంబె నీవృత్తాంత,
మంతమేనక హిమవంతు లంతుఁ
గనని సంతసమునఁ గన్నబిడ్డను మెచ్చి
రాబాలగోపాల మమున మొందె,
బంగారుకలశముల్ సింగార మొనరించి
మంగళంబులఁ బాడి రంగనలును,

బురి నలంకార మొనరించి రుచుతరముగ
సూపశాస్త్రానుమతమున సూపములను
బహువిధంబులఁ బాకముల్ వ్యంజనములు
వండి రాసూపకారు లవ్వారిగాఁగ. 428

క. విందారగింపఁ బిలిచిరి
బృందారకబృందములను విధిహరుల నుమా
సుందరి జననం బందిన
మందిరపుఁ బసందువిందు మాన్యం బవుఁగా. 429

ఉ. విందుల కందు బంతులుగఁ బెండిలివా రటు కూరుచుండఁగా
నందున వడ్డనల్ సలుప నౌదనికుల్, గిరిబాంధవుల్ సురల్
విందులు గుడ్చుచుండఁగ 'హవిర్భుజులీయెడ నన్నభుక్కులై
రంద' టటంచు నవ్వి పరిహాస మొనర్చిరి పెండ్లివారినిన్. 430

మ. గిరికాంతల్ సురకాంత లొండొరు లిటుల్ కేళీవినోదంబులం
బరిహాసం బొనరించు కొంచు నగుచున్ వ్యంగ్యోక్తులం గుల్కుచుం
దారలం బుచ్చిరి పెద్దపొద్దటులు విందుల్ గుడ్చుచున్ వాకొనం
దరమే యచ్చటి పంక్తి భోజన సముత్సాహంబు వేనోళులన్. 431

ఉ. పిమ్మటఁ దమ్ములమ్ము లిడి వేలుపు విందుల వారివారి వా
సమ్ముల నంపు నా గిరికి సప్తమునుల్ సమయం బెఱింగి ల
గ్న మ్మెఱిఁగింపఁ బెండిలిజనమ్ముల న మ్మలఱేఁడు తెచ్చి య
ర్ఘ్యమ్మగు నాసనమ్ముల సమాదరణమ్మున నిల్పె నమ్మెయిన్. 432

## పార్వతీ పరిణయము

శా. వేదిన్ వేదవిధిన్ రచింప విధి, సద్వృత్తంబుఁ బాడన్ సతుల్,
భూదేవాదుల కంజలించి, యిలువేల్పుం గొల్చి రామప్రభున్
వాదిత్రంబులు మ్రోయుచుండఁగను సౌవర్ణార్ఘ్య పీఠంబునన్
వేదిం గూరుచునుండ శంభుఁడు మునుల్ బిల్పించి రాపార్వతిన్. 433

క. గంగోత్తమాంగసంగిని
శృంగార మొనర్చి యంత శృంగారవతుల్
ముంగిటకుం గొనిరాఁ ద
చ్ఛృంగారముఁ గాంచి ముగ్ధహృదులై రమరుల్. 434

శా. మున్నే సన్నుతిఁ జేసె నీశ్వరసతిన్ ముల్లోకముల్ తల్లిగా
బన్నింపంగలఁ డేకవీశుఁడు తదాభన్ శేషభాషాదులే
బన్నింపం జననేర రన్న జడుఁడన్ బన్నింప నేనేర్తునే
విన్నాణం బిది యెన్నఁగా నగునె వేవేమోములన్ వేరికిన్. 435

తే. అంత నాపార్వతీకాంత యమలరూప
మంటపస్థలి కేగి ముక్కంటి కడకు
హ్రీవశంబునఁ గనలేక యీశచరణ
కమలములఁ జొన్పె నిజమనోభ్రమరకమును. 436

ఆ. మునుజనానుమతిని మునుమున్న విఘ్నేశుఁ
బూర్వదంపతు లటఁ బూజఁజేసి
రిం దొకింత శంకఁ జెందకుఁ డతని న
నాదిదేవుఁ డనుచు నాత్మ నెఱిఁగి. 437

క. వైవాహికవిధు లన్నియుఁ
గావింపింపఁగఁ ద్రయీప్రకారమున మునుల్
గ్రావేశుఁ డుమాకరమ
ద్దేవేశునిచేతఁ బెట్టె దేవి యనుమతిన్. 438

మ. మది హర్షించిరి వేల్పు లగ్రకులు లామ్నాయంబు ఘోషించి రా
త్రిదశుల్ మంగళవాద్యముల్ జయజయేతిధ్వానముల్ సల్పుచుం
జదలం బూవులవానలం గురిసి రాశర్వాండు శైలాత్మజన్
ముదితుండై కయిగొన్న నాఁడు పడసెన్ ముల్లోక ముల్లాసమున్. 439

క. ఆజగతీధరుఁ డంతట
వాజి గజ స్యందనాదివాహనముల దా
సీ జన హాటకరాజిత
భాజనమణివస్త్రములను వరహరణ మిడెన్. 440

శా. ఎన్నో కట్నము లిచ్చి యల్లునకు దోయిల్ గూర్చి 'యేమీయ నో
యన్నా యోపరిపూర్ణకామ' యని యయ్యద్రీశుఁ డయ్యాశుకేల్
గొన్నన్ మన్నన మామనుం గని కృపాకూపారుఁడౌ నీశ్వరుం
డెన్నో తెన్నుల గారవించెఁ దలఁ పీడేరన్ శివామాతయున్. 441

క. నిండుమది దండమిడి 'య
ల్లుండవు మత్ప్రాణసమగ లోనెంచుచుఁ గై
కొం డీమెను నిజదాసిగ
నిండుమదిన్ వరమునిండు నేర మరయకే.' 442

తే. అనుచు వినుతించు గిరివరార్థాంగివినుతు
లల్లుఁడాలించి యుచితోక్తి నాదరించె
నల్లునకు నామె ప్రణమిల్లి యిల్లుసేరి
కన్నబిడ్డను నొడిఁగొంచుఁ గౌఁగిలించి. 443

ఉ. తల్లి సతీమతల్లి కిటు తద్దయుఁ గూర్మి హితోపదేశమున్
మెల్లనసేయు నిట్లు 'పతిమించిన దైవములేదు నాతి కో
తల్లి! సదా సదాశివపదంబుల నేమఱ కెంచుచుండుమీ
యెల్లెడ' నంచు నాత్మసుత నెత్తుక కన్నులనీరు నింపుచున్. 444

ఆ. 'ఆడుపుట్టు నేటి కవ్విధి సృష్టించె
నస్వతంత్రజాతి కబ్బునె సుగ'
మంచు నలమటించి యమ్మంచుమలమించు
బోణి తుదకు దిటముఁ బూని సుతను. 445

క. పదపడి గదిసెం బదపడిఁ
బదములపయిఁబడె నవర్ణ్యపరమప్రేమన్
ముదితల నెల్లరఁ గదిసియుఁ
గదిసి గిరిజ చిక్కెఁ దల్లి కౌఁగిటిలోనన్. 446

శా. తల్లిన్ మాటికిఁ దొంగి చూచుఁ దను భర్తం జేరఁ గొంపోవ నా
ముల్లోకంబులతల్లి, యామెకిడి రాముత్తైదువల్ దీవనల్
సోల్లాసుం డయి భిక్షులం దనిపి గంగోత్తంసుఁ డర్థాంగితో
నిల్లుం జేరఁ గడంగ దుందుభుల మ్రోయించెన్ సురానీకముల్. 447

ఉ. అంతటఁ గూఁతు నల్లుకుల నయ్యచలేంద్రుఁడు సాగనంప రాఁ
గంతువిరోధి వీడ్కొలిపె గారవమారఁగ, నంత నా కుభృ
త్కాంతుఁడు నింటికేగి పలుకానుకలు కట్నము లిచ్చి పంపె న
త్యంత సమాదరంబున నిజాశ్రితబంధుసఖాళి నెల్లరన్. 448

మ. శివుఁ డంతన్ రజతాచలంబునఁ బ్రవేశింపన్ సపత్నీకుఁడై
దివిషత్కోటియు నిండ్ల కేగె నిట నాదేవుం డుమాదేవితో
వివిధంబౌ సుఖభోగసంపదల సేవించెన్ గణాధ్యక్షుఁడై
శివశర్వాణులెకా జగత్పితలు తచ్ఛృంగార మెట్లెంచెదన్. 449

క. తారకమారకుఁడౌ సుకు
మారకుమారకుఁ డొకఁడు కుమారుఁ డనంగన్
గౌరికిఁ బుట్టిన యాకథ
పేరుపడిన దంచు దానిఁ బేర్కొననిందున్. 450

క. నిగమాగమవిశ్రుత మని
జగముల నిది పలికినాఁడ సంగ్రహాఫణితిన్
నగజాపరిణయకథ యిది
సుగమంబుగఁ జదువ వినఁగ సుగము లెసంగున్. 451

క. శ్రుతులు దరిఁగాంచనేరని
శితికంధరు చరితసింధుసీమముఁ గన్గో
మతిమందుఁడు గ్రామీణుఁడు
క్షితిఁ దులసీదాసుఁ డెటులు జేరంగలుగున్. 452

మ. తనివిన్ శంభుచరిత్రమున్ విని భరద్వాజుండు హృష్టాత్ముఁడై
కనునీటం గనుదోయి మేన్ బులకలం గంఠంబు డగ్గుత్తికం
దనరన్ మోదవశంబునన్ వివశుఁడౌ తత్పారవశ్యస్థితిన్
ననుపుం గన్గొని యాజ్ఞవల్క్యుఁ డనెఁ దన్నైర్మల్యమున్ మెచ్చుచున్.

మ. "బళి ! ధన్యుండ వుమామహేశు లిటు నీ ప్రాణప్రియుల్ గావుటన్
గలనేనిన్ శివభక్తిహీనులు ప్రియుల్ గాఁబోరు రామయ్యకు, క
య్యలకాష్టామలభక్తి చిహ్నమగుఁ జుమ్మా రామభక్తాళి కెం
దల ముక్కంటికి బంటుగావుటకు రామయ్యన్ భజింపన్ వలెన్
మొలవంగావలె రామభక్తిఁ బడయన్ ముక్కంటిపైఁ బ్రేముడుల్.

క. సతివంటి సతిని విడువం
బ్రతిన నెఱపి భవుఁడు రామభక్తి వెలార్చెన్
బ్రతి యెవఁడు రామభక్తి
వ్రతి కతనికతండ సాటి భక్తి నిరూఢిన్. 455

ఉ. చెప్పితి ముందు శైవకథఁ జిత్తము వచ్చెను నీతలంపు రా
మప్పదంబుఁ దప్ప మఱియన్య మెఱుంగని వాఁడ వౌదు నీ
చొప్పును గంటి నీయడుగుచొప్పున రామకథావిశేషముల్
చెప్పెద నాలకింపు ఋషిశేఖర ! నీతమి వేడ్కఁగొల్పెడున్. 456

క. శతకోటిఫణీంద్రులు భా
రతులు నుడివి కడవ రాని రామకథ యథా
మతి శ్రుతిరీతి వచించెద !
మతి రామబ్రహ్మపదకమలసద్భక్తిన్. 457

ఉ. శారదదారుమూర్తి కదస్వామి ! రఘూత్తమసూత్రధారుఁ డె
వ్వారు నిజానుకంపకును బాత్రులొ వారలచిత్తసీమలన్
శారదనాడఁ జేసి కృపసాకెడు నట్టి రఘుప్రభున్ నమ
స్కార మొనర్చి తత్సుగుణగాథలఁ బేర్కొనువాఁడఁ గోర్కెమై. 458

## పార్వతీశ్వర సంవాదము

ఉ. వాస మమామహేశులకు వాసము సిద్ధులకున్ ఋషీంద్ర సం
వాసము వాసవాదిసురవాసవిలాసముఁ దద్దయున్ దురా
వాసము ధర్మదూరులకు వైష్ణవశైవవిరోధి కట్టి కై
లాసము సర్వభోగసువిలాసముగాఁ దనరారు ధారుణిన్. 459

క. రమణీయం బగు కైలా
స మిలన్ సురకిన్నరులును సజ్జనులు నుమా
రమణు సుఖసదనుఁ గొలువఁగ
నమరును వటవిటపరాజి నభినవశోభన్. 460

ఉ. చల్లని చెట్టునీడలను జల్లని మెల్లని పిల్లతెమ్మెరల్
మల్లడి వీచుచుండఁగ నుమారమణుం డొకసారి సౌరు రం
జిల్లఁగఁ గూరుచుండె నునుసింగపుఁ దోలు కడింది కంబళం
బల్లను మఱ్ఱినీడను శ్రమాపనయార్థము వాల్చి యందునన్. 461

తే. భవుఁడు బహుపాద పాదపపాదతలము
నందుఁ గూర్చుండె సింహచర్మాంబరమున
నిందు కుందసమస్వచ్ఛ సుందరాంగుఁ
డరుణ తరుణాబ్జ కోమలచరణుఁ డగుచు. 462



క. శిరమున సురసరసున్ మఱి
యురమున నురగముల గములు నూయలలూఁగం
దరుణేందు శేఖరుం డా స్మరహరుఁ
డొడ లూని నట్టి శాంతరస మనన్. 463



క. అరుణచరణ కిరణంబులు
చరణార్చక భక్తమోహచయహరణముగాఁ
బురవైరి భూతిభూషణుఁ
డరవిందదళాయతాక్షుఁ డటఁ గూర్చుండెన్. 464



చ. తరుణ మదే యఁటంచు నుమ తత్సమయంబున భర్తఁ జేరఁగా
నరిగిన నాతఁడుం బ్రియకు నాదృతి నిచ్చె నిజాంక పీఠమున్
వరమహనీయపీఠముగ భావమునన్ ముదమంది యామెయున్
బురహరు డా యొడిన్ నిలిచెఁ బూర్వకథల్ పొడకట్ట బుద్ధికిన్. 465

చ. మగనిఁ బ్రసన్నుఁగాఁ దలఁచి మానిని యిట్లనె సస్మితాస్యయై
జగముల కెల్ల మంగళ మొసంగు కథన్ వినఁ గోరునొక్కఁ డీ
నగసుత, విశ్వనాథ! సురనాథ! జగద్విదితప్రభావ! యో
నగరవిరోధి! దేవనరనాగ చరాచర భూతసేవితా! 466

మ. వరవైరాగ్య కళాగుణాకర! విభూ! వందారుమందార! శం
కర! నీదాసి ననుగ్రహించి కృప మత్కైంకర్య మీకొంచు దా
శరథిఖ్యాతచరిత్రమున్ వినిచి నాసమ్మోహముం బాపు దే
వర! సంతానము నీడ నిల్చియును నెవ్వాఁ గుందు నెవ్వాఁ డిలన్. 467

ఉ. చంద్రకళావతంస ! మునిచంద్రులునుం బరమార్థవాదు లే
సాంద్రకృపాళు రాము నజు శాశ్వతు బ్రహ్మముగా వచింత్రు నా
గేంద్ర సరస్వతీశ్రుతులు నెల్లపురాణము లేనిఁ బాడు ని
స్తంద్రత మీరు నిందు సతతంబు జపించుచు నుందు రెవ్వనిన్. 468

తే. మహిని రాముఁడు దశరథాత్మజుఁడు గాక
కలఁడొకో వేఱొకఁ డలక్ష్యరతికుఁ డజుఁడు
సగుణుఁడున్ బ్రహ్మరూపకుఁ డయిన వాఁడు
నవని రామ పరబ్రహ్మ మవునె తేఁడు. 469

ఉ. స్త్రీవిరహంబునన్ బెదరి చిందినఁ దచ్చరిత్రప్రభావమున్
వావిరిఁ గన్నవిన్న మది భ్రాంతిని బొందెడు నిర్గుణాత్మకుం
డా విభుఁడో తదన్యుఁడో దయన్ సెలవిండు మదీయమోహమా
యావిధ మంత మాయు నటు, లజ్ఞ యటంచుఁ దలంపకే మదిన్.

తే. వనమునన్ నాఁడు రాఘవప్రాభవంబు
నరసి భీతాత్మనై తెల్పనైతిఁ గాని
దానఁ దగి నట్లు కుడిచితిఁ దత్ఫలంబు
దాన నైనఁ బ్రబోధంబు గానరాదు. 471

ఉ. నాటికి నేటి కట్లు మది నాటదు కా కనుమాన మంత యీ
నాటి కొకింత నిల్చె నలనాఁడె వచించితి మున్నటంచు నే
మాటికి మాటి కిట్లడుగు మాటకు నల్గ కనుగ్రహింపు దో
షాటవిపాటనక్షమకథాళి వినన్ మనసయ్యె నొయ్యనన్. 472

తే. అతులభక్తిని నుతులు సన్నుతు లొనర్తు
సన్నుతామర ! నను సుప్రసన్నదృష్టిఁ
గాంచి శ్రీరామగాథ విన్పించు మయ్య
వేదసిద్ధాంతసారముఁ బ్రోదిచేసి. 473

ఉ. బోటులు తత్త్వముం బడయఁబోల రశైనను దాసురాల, మీ
బోఁటులు శ్రోత లేమడుగఁ బోయిన దాపను గూఢతత్త్వముం
జాటక, రామగాథ విన సంబర మయ్యె వచింపు మీశ! ము
న్నేటికి నిర్గుణాత్మక పరేశుఁ డిలన్ సగుణాకృతిం గొనెన్. 474

ఉ. పుట్టుట సీతఁ బెండ్లగుట భోగముఁ బాసి వనిన్ వసించుటన్
చెట్టల రక్కసీండ్ల దశశీర్షునితోఁ దునుమాడి పట్టముం
గట్టుక నేల నేలుట, జగంబులు మెచ్చఁగ బంధు మిత్రులుం
జుట్టుక రా దివిం జనుట చోద్యము లయ్యె వచింపు మా కథల్. 475

క. మును బాల్యక్రీడల నా
వెనుకను గల్యాణకార్య విభవము లటుపై
వన వాసోదంతము నొం
డన నేలా రామలీల లన్ని నుడువుఁడీ. 476

మ. తపసుల్ ధ్యానసమాధిమగ్నులగు నాతత్త్వంబుతీ రెట్టిదో
చెపుఁడీ, భక్తివివేకతత్త్వముల వాసిం దెల్పి వేర్వేఱ బో
ధపడన్, భక్తివివేకదంబు విభుతత్త్వం బుగ్గడింపుండు, రా
మపరబ్రహ్మ నిగూఢవృత్తమును మర్మం బింత లేకుండ నే
నిపుడేఁగోరని వింత దాపురము లేవే నుండినం దెల్పుచున్. 477

క. ఆదిగురుఁడు జగముల కని
వేదము లగ్గించు నిన్ను వేఁడెడి యెఱుఁగం
డో దేవర ! ని”న్ననఁగా
నా దేవీప్రశ్నమునకు నత్యాదృతిమై. 478

చ. హరహృది రామరాట్చరిత మంతయుఁదోఁచె నొడల్ గగుర్కొనెన్
దిరముగ రామరూపమును నిల్చె మదిన్ గనులందు బాష్పముల్
బరివె నమందమోదమును బర్వె నిటుల్ ఘటికాద్వయంబు శ్రీ
వర వర యోగమగ్నుఁ డయి బాహిరదృష్టి నిగుడ్చి యమ్మెయిన్.

చ. ఎవని నెఱుంగ కున్కి మృష లెల్లను నిక్కము లౌచుఁ దోఁచు ర
జ్జువు పెనుబామురీతి మదిఁజొక్కెడు భంగి; నెఱుంగ నెవ్వనిన్
భవ మది మేలుకొన్న పయి స్వప్నగతిన్ క్షణభంగురంబుగా
నగు చగ పట్టు నట్టి యరుణాన్వయ పావను నెంచి నెమ్మదిన్. 480

ఉ. మారవిదారి యివ్విధి నమంగళహారిని దేవతారిసం
హారిని నామజాపకజనాతిసులభ్య నరావతారుఁడౌ
నా రఘువీరునిన్ దశరథాంగణవర్తిని బాలమూర్తినిం
గోరి భజించి యక్కుసుమకోమలి కిట్లనె మంజులోక్తులన్. 481

తే. "గౌరి! గిరిరాట్కుమారి! నీకోరికి కడు
ధన్యతమ మౌను నినుఁబోలు ధన్యకలదె
సకలలోకైకపావనసరణి విష్ణు
పదియనం దగు రామునికద నడిగితి. 482

ఉ. రామపదాప్తి నీ మదిని భ్రాంతివిమోహము లంటకున్న నో
హైమవతీ! జగద్ధితము నర్థిఁ దలంచి వినం గనన్ జగ
త్క్షేమ మొనర్చు రామకథఁ దెల్పఁగవేఁడి తెఱుంగనట్లు నన్
రామపదానురాగిణివి ప్రశ్న మొనర్చి జగద్ధితార్థమై. 483

సీ. శౌరిగాథ వినని శ్రవణరంధ్రంబులు
వల్మీకరంధ్రముల్ వనజగంధి!
గురుల సాధులఁ గనుంగొనకున్న కన్నులు
నెమ్మికన్నులు సుమ్ము నీరజాక్షి!
నన్నుతాంగుని కథల్ సన్నుతింపని నాల్క
కప్పనాలుకచొప్పు కరటియాన!
హరిగురుపదముల కొరగనట్టి శిరంబు
తుంబీఫలసమంబు కంబుకంఠి!

హరికథాకర్ణనమున సంబరము పడని
వానిమానస మశనిసమాన మాను
హరిపదాబ్జ లసద్భక్తి నలర నట్టి
మేనుతాలుపు పీనుఁగుంబోని వాఁడు. 484

క. విను సురహితకారియునున్
దనుజాహితకారి యైన దాశరథికథన్
దనుఁ గొల్చినవారి తలం
చిన తలఁపులనింపి తనుపఁ జేజే మొదవౌ. 485

క. వినుమా ! గిరివరతనయా !
యనుమానము మాని రఘువరాద్భుతకథ స
జ్జనసభయ దేవసభయని
వినియుఁ గనియుఁ గొలువకుండు వెట్టియుఁ గలఁడే. 486

తే. కరతలధ్వని శ్రీరామగాథ యిద్ది
బహుళశంకాపతంగాళిఁ బాఱఁద్రోలఁ
గలికలుషపాదపోచ్ఛేదకరణమునఁ గు
ఠారధారయ యీరఘువీరగాథ. 487

ఉ. రాముఁ డనంతుఁ డౌనటులె రామయశోగుణజన్మకర్మముల్
నామచరిత్రముల్ భువి ననంతము లంచు శ్రుతుల్ వచించినన్
నీమనసైన యట్లె మదినేర్పుకొలంది వచించువాఁడ నీ
రామకథావిధం బడుగు ప్రశ్నము నన్నలరించెఁ గావునన్. 488

తే. సహజసుందరమును సాధుసౌఖ్యదమయి
మించు నీప్రశ్నలోన రుచింప దదియ
యాగమనుతుండు మునిమాన్యుఁ డైనరాముఁ
డొండు రఘురాముఁ డొండను నొం డపోహ. 489

క. ఇట్టిపలు కాడుచుందురు
చెట్టలు మాయాపిశాచిఁ జిక్కినవారల్
తట్టవు సత్యాసత్యము
లట్టిడులకు నాస్తికులకు హరివిముఖులకున్. 490

మ. ఖలు లజ్ఞుల్ సువివేకచక్షురహితుల్ కామావిలస్వాంతులున్
గలనేనిన్ సుజనంబుఁ గాంచని జనుల్ గన్గోక మేల్సెబ్బరల్
దలమీఁజుం బిడివాద మూని శ్రుతిసిద్ధాంతంబు లెగ్గింత్రు ని
ర్మల చిచ్చక్షులు స్వచ్ఛమానసులు రామబ్రహ్మముం గాంత్రిలన్.

తే. సగుణ నిర్గుణభేదవిచార ముడిగి
వదరు చుందురు పెక్కు కల్పన లొనర్చి
భువిని హరిమాయలోఁబడి పొరలువారు
వారు వాదాడలేని దే వాదు లేదు. 492

తే. తిన్నఁగాఁ బల్కనేరని సన్నిపాత
సంజ్వ రోన్మత్తచిత్తు భాషణము లటులు
మోహమదిరా రసాస్వాద ముగ్ధుఁడైన
వానిపల్కును బెడచెవిఁ బాయనగును. 493

క. నిజమతి నీగతిఁ గనుఁగొని
త్యజియింపుము సంశయముల దాశరథిపదాం
బుజముల భజింపు శైలా
త్మజ! భ్రమ తమికిన్ మహత్ త్రి తరణిద్యుతియా. 494

మ. సగుణుం డన్నను నిర్గుణుం డనిన వీసంబైన భేదంబులే
దగుణుండే సగుణుం డగున్ శ్రితజనేచ్ఛాధీనుఁడై యం చనెన్
నిగమంబుల్ బుధులుం బురాణములు, నా నీరంబునున్ మంచురాల్
పగిది౦ జూడ గుణాగుణాత్మక పరబ్రహ్మం బభేదం బగున్. 495

సీ. సచ్చిదానందుఁడు జానకీశదినేశుఁ
డట లేదు మోహనిశావలేశ,
మెవనిపై రర్కుఁడౌను విమోహనిశకు నా
తని మోహసంగతిం దలఁప నగునె!
సహజతేజోరూపి సర్వేశుపట్ల వి
జ్ఞానోదయము వేఱె లేనె లేదు
మోదవిషాదముల్ మోహవిరక్త్యహం
మతులును జీవధర్మములు గాని
రాముఁడో పరబ్రహ్మ పరాత్పరుండు
సచ్చిదానందరూపి తేజఃప్రచండుఁ
డాదిపూరుషుఁ డాతఁడే నాయభీష్ట
దైవ"మని మ్రొక్కెఁ దలవంచి త్ర్యంబకుండు. 496

ఉ. తుంట యెఱుంగ లేక నిజదుర్భ్రమ మోహము లాక్రుపాబ్ధిపై
గెంటును బ్రొద్దుఁగానక మొగిళ్లమరుంగునఁ గ్రుంకె నన్నటుల్
కంటికి వ్రేలి నడ్డిడి యొకం డిరురూపుల సూర్యచంద్రులం
గంటి న టన్న యట్లై రఘుకాంతుఁ డొరుం డని శంకఁగొంటయున్.

తే. విభ్రమాభ్రంబు రామశుభ్రాభ్ర మంట
నేరదు దుమారముం బోగ కాఱుమబ్బు
నంతరాళముఁ గమ్ముకొన్నట్టు లుండి
నిజమునకు నిర్మలాకాశముఁ జొరని యటు. 498

తే. జీవవిషయ దశేంద్రియదేవతలు ప్ర
బోధకములౌ ని వేకోత్తరాధికముగ
వీని కెల్లను వెల్గుఁజూపించు రాముఁ
డాద్యుఁ డనవద్యుఁ డాగమవేద్యుఁ డతఁడు. 499

క. జగము ప్రకాశ్యము రాముఁడు
జగత్ప్రకాశకుఁ డగుణుఁడు జ్ఞాననిధానుం
డగుఁ దత్సత్యవశంబున
నగపడు మాయాప్రపంచ మవితథ మవుచున్. 500

ఆ. శుక్తిగతజలంబు సూర్యాంశుసంగతి
రజతమటులు తోఁచు నిజ మరసిన
బుడమి నట్లగుట యభూతభావనమైన
బ్రమయకుండు నెవఁడు భ్రాంతి విడిచి. 501

చ. జగ మిది దుఃఖదాయక మసత్యమునైనఁ బరాత్పరాశ్రితం
బగు నిదురన్ శిరంబు తెగటారినటుల్ కలఁ గన్నయాతఁ డే
పగిదిని మేలుకొంక వెతఁబాయని భంగి నరుండు పుట్టుగుం
దగులమునుండి తెప్పిఱని దన్క విడండు భ్రమం బపోహయున్. 502

మ. శ్రుతులెవ్వాని నపాదుఁడై చను, నొనర్చుం గర్మ నిష్పాణియై,
శ్రుతిహీనుం డయి యాలకించుఁ, గనుఁ జక్షుర్హీనుఁడై, మోములే
క తిను, వాయియఁ లేక వక్తయఁగు, నాఘ్రాణించు ఘ్రాణంబులే,
కతనుండై స్పృశియించుఁ, జిత్రచరితుం డన్నింట నం చెంచునో. 503

తే. వర్ణనాతీతమహిముఁ డవర్ణ్యుఁ డంచు
నాదియును నంత మెఱుఁగఁగ రా దటంచు
శ్రుతి యథామతి నగ్గించు సతతమెవని
హాను లెవ్వాని ధ్యానసమాధిఁ గాంత్రు. 504

మ. ఎవనిం జేర్కొని కాశికామృతుల కే నీనేర్తుఁ గైవల్యవై
భవ, మెవ్వానిఁ దలంపఁ బ్రాగ్జననపాపంబుల్ పటాపంచలౌ
నవశుం డయ్యు యదృచ్ఛనేన్ సలిపినన్ యన్నామసంకీర్తనం
బవలీలన్ నరుఁ డీఁగు గోష్పదముచాయన్ సంభవాంభోనిధిన్. 505

క. అతఁడె చరాచరనేతయు
శ్రితజనహితకారి యఖిలజీవాంతర్యా
మి, తరణికులావతంసుం
డతఁడే నాయిష్టదైవమని కనుఁగొమ్మా. 506

క. రాముఁడు పరమాత్ముం డో
భామిని! యవ్వానిఁ గూర్చి భ్రమసి యపోహం
బూమెలు పన్ను టనర్హం
బీమాడ్కి భ్రమింప జ్ఞాన మీఁగు" నటంచున్. 507

మ. భవుఁ డీరీతి భ్రమాపహంబగు నుపన్యాసంబుఁ గావింపఁగా
నవనీభృత్సుత విభ్రమంబులు నపోహల్ వాయ నాలించి, రా
ఘవతత్త్వంబుఁ, గలంకఁ దేరిన మతిన్, గాకుత్స్థపాదద్వయిన్
నవభక్తి ప్రతిపత్తు లత్తుకొనఁ బ్రాణస్వామితో నిట్లనెన్. 508

ఉ. "శంకర! శంక లింకెను శశాంకకరోపమమైన నీనుడిన్,
నంకిలి వెట్టు మోహశరదాతపమున్ విడి రామురూపు ని
శ్శంకగఁ దోఁచె నామది, ప్రసాదము నూది విషాద మేదె, నీ
కింకరికిం, గుశంక లణఁగించి ప్రసత్తి ననుగ్రహించుటన్. 509

ఉ. నారి జడస్వభావ నయిన్ నిజదాసి ననుగ్రహించి నేఁ
గోరిన చొప్పుఁ జెప్పుఁడిదె, కూరిమి నేరిమిపేర్మి మీఱఁగా
నారయ సర్వశూన్యుఁ డఖిలాత్ముఁడు చిన్మయరూపి బ్రహ్మమై
కారణమేమి రాముఁ డవికారుఁడు మానవదేహ మూనఁగన్. 510

తే. తెలుపుమా! రామకథ విశదీకరించి,"
యంచు వినుతింప, వినుచు నయ్యెంచుబోణి
వినయ నయ యుక్తియుక్త వాగ్విభవ మరసి
రామచరితానురక్తి నారామ మెచ్చి. 511

చ. మది ముదమొంది శంకరుఁడు మానిని కిట్లనె "ముజ్జగాల నో
మి దెసలణంచు నీ తలఁపు మెచ్చఁగ వచ్చును మెచ్చులాఁడి స
మ్మదమున రామ రాట్చరితమానసమున్ వినుపింతు నింద వి
న్నదియ భుశుండి మున్ను విహగేంద్రునకున్ వినుపించె నాదటన్.

శా. ఆసంవాదవిధంబుఁ దెల్పెదను ముం దాలింపు రామావతా
రాసాధారణగాథ, యిట్టిది జనాంహోహారియున్ హారియా
నాసీతాపతి నామ రూపగుణగాథాదుల్ వచోతీతముల్
వాసిన్ లెక్కకు మీఱు వానికొలఁదుల్ వాకో నశక్యంబులా. 513

ఉ. రాముఁడు వాఙ్మనోగతికిఁ బ్రజ్ఞ కతర్క్యుఁ డగోచరుం డగుం
జామరొ! యట్టులైన శ్రుతిశాస్త్రపురాణమతంబు లెంచి పో
రాముల సాధుసద్గురుపరంపర చెప్పిన చొప్పు చొప్పడన్
నామదిఁ దోఁచు నవ్వలనునన్ వినుపింతు నిదే వినంగదే. 514

మ. 'ఇద మిత్థం హరిజన్మహేతు' వని యొం డేర్చంగ లేరెవ్వ రె
య్యదనం గల్గును ధర్మహానియును, రక్షోఘాత్యయం బెచ్చి, భూ
త్రిదివేశ త్రిదివేశకోటియును, ధాత్రీధేనువుల్, గుందు న
ప్పదనుం దప్పక జన్మ మూను హరి డింపన్ సాధుసంతాపమున్.515

క. రాకాసులఁ జోకారిచి
నాకౌకసకోటి సాఁకి నయ మొప్పారన్
సాఁకి నిజ శ్రుతిసేతువుఁ
బ్రాకింపఁగ జగతి యశముఁ బ్రభవించు భువిన్. 516

తే. ఆ దయానిధి భక్తార్థియై జనింప
నతనికీర్తిని గీర్తింతు రఖిలభక్తు
లవని రామావతారహేతువులు చాల
చెలఁగు నేకోత్తరాధికచిత్రగతుల. 517

## జయవిజయుల శాపవృత్తాంతము

చ. ప్రియ ! విను మొండురెండు వినుపింతును శ్రీహరిజన్మహేతువుల్
జయవిజయాఖ్యు లిర్వురును చక్రధరాప్తులు ద్వారపాలకుల్
స్వయకృతదోషు లౌచు ద్విజశాపమునన్ ఖలదైత్యరూపముల్
గయికొని పుట్టిరా కనకకశ్యపుఁడుం గనకాక్షుఁ డం చిలన్. 518

క. పుట్టి జగంబులఁ గొట్టుచుఁ
గట్టలుకంగట్టి యింద్రుగర్వం బణపం
గిట్టించెను హరి వారల
దిట్టం డయి కిటినృసింహదివ్యాకృతులన్. 519

క. ఖండించి కనకకశ్యపు
నిండింప స్వభక్తయశము నిఖిలము రక్షో
మండలి మగుడం బుట్టిరి
గండులు రావణుఁడుఁ గుంభకర్ణుం డనఁగన్. 520

మ. హరిచే మున్ విగతాసు లయ్యు ద్విజశాపాంతంబు జన్మత్రయా
త్పర మౌటన్ విడుపొందరైరి హరికిం దన్ముక్తికై దేహమున్
ధరియింపన్ వలసెన్ మఱొక్కతడవం దద్దేవమాతాపితల్
ధరఁ గౌసల్యయు నాజిపంక్తిరథుఁడై తాల్పంగ నాకారముల్. 521

## జలంధరుని వృత్తాంతము

మ. ఒకకల్పాన సురల్ జలంధరునిచే నోలంబునం దోడి హృ
ద్వికలుల్ దుఃఖితులైన భంగిఁ గని నేన్ బీరానఁ బోరాడి దై
త్యకులాధీశుసతీసతీత్వమహిమం దద్దైత్యుఁ జంపంగ నో
పకయున్నన్ హరి మాయ నామె వ్రతమున్ భంగించి తూటాడినన్.

శా. రక్షఃపత్ని యదంత కన్గొని యమర్ష స్వాంతయై పుండరీ
కాక్షున్ శాపవిదగ్ధుఁ జేయఁగ నతం డందెం బ్రమాణంబుగా
రక్షేశుండు జలంధరుం డపుడు గోత్రన్ రావణుండైన యు
ద్ధక్షోణిం బరిమార్చి మోక్షమిడెఁ దద్దైత్యారియున్ రాముఁడై. 523

క. దేవుఁడు నర తను వూనఁగ
నీ వసుధ నిదొక్కకతము, ఋషులుం గవుల
ద్దేవేశు స ద్యశశ్చరి
తావళి వర్ణించి రప్పటప్పటి వినికిన్. 524

## నారద శాప వృత్తాంతము

ఉ. నారదశప్తుఁడై కమలనాభుఁ డొకప్పుడు మానవాకృతిన్
ధారుణిఁ బుట్టె" నన్న గిరినందన పల్కె "ననంత భక్తుఁడౌ
నారదు నంత మానియె, జనార్దను నేల శపించె, శౌరియే
నేర మొనర్చె, మానికెటు నెక్కొనె మోహము దానతీయవే. 525

తే. చెప్పఁ డీవిధమెల్ల నశేష" మనిన
నప్పుడనె నీశుఁ డెలనగ వలర "రాముఁ
డెవ్వడే రేతి నెవ్వని నెట్లు సేయు
నప్పు డారీతి నాతఁ డట్లానుగాక
తప్పునే యజ్ఞుఁడైనఁ దత్వజ్ఞుఁడైన. 526

క. చెప్పెద వినుమా! యాదర
మొప్పఁగ రఘుపతి చరిత్ర ముర్విని భవముం
దప్పించు రాముఁ గొలువుము
రొప్పుము తృష్ణాభిమాన రోషమదంబుల్. 527

చ. పరమపునీత మైన హిమవన్నగ సుందరకందరంబునన్
సురనది ప్రక్కఁ బాఱఁగని సుందరశైలవనీ విభాగమున్
సురముని నారదుం డలరి, సొంపెసలారఁగఁ దద్గుహాం దప
శ్చరణ మొనర్చె దక్షకృతశాప మడంగి, ప్రసంగ నిల్కడన్. 528

తే. సహజవిమలం బగు తదాత్మ సత్సమాధి
మగ్నమానంత మునిగతి మతి నెఱింగి
భీతివిహ్వలుఁడై పురుహూతుఁ డతని
తపము భంగింపఁ బంపెఁ గందర్పు నపుడు. 529

చ. శునకము నోటఁ బట్టి ముడుసుం బరువెత్తుచు, సింగముం గనుం
గొని తననోటియె మ్మదియుఁ గోరెడునో యని జంకు నట్టు ల
మ్ముని తనస్వర్గరాజ్య పదముం గొనఁబోనొ యటంచు వజ్రి భీ
తినిఁగొనె లోభి వాయసగతిన్ జడియుం గద యెల్లవారికిన్. 530

ఉ. అచ్చట నారదాశ్రమమునందు సుమాస్త్రుఁడు ముందు మాధవున్
బుచ్చినఁ జెట్లు పూసినవి పుల్గులు కూసెను మందవాయువుల్
విచ్చెను మన్మథాగ్ని కభివృద్ధిగఁ గామకళాప్రవీణలౌ
నచ్చర మచ్చెకంటు లపు డాడిరి పాడిరి కిన్నరాంగనల్. 531

ఉ. కూసెను దేంట్లు, కోయిలలు కూ యనె, నంత వసంతునిం గనన్
మా సుతుఁ డాత్మమిత్రు మహిమంబునకున్ నిజశక్తిఁ దోడుగాఁ
జేసి కలంచినన్ మునికిఁ జిత్తవికారము కల్గదయ్యె నె
వ్వాసిఁగలంచు శ్రీహరికృపాపరిరక్షితుఁజిత్తజ భ్రమల్ 532

తే. అంతఁ గంతుఁడు లో భయ భ్రాంతుఁ డగుచు
ముని పదాక్రాంతుఁడై యాప్తజనముఁ గూడి
'పాహి' యన నారదుఁడు వాని భయమడంచి
యూఱడింపఁగ వీఁడ్కొని మారుఁ డరిగె. 533

క. ఇంద్రసభం జని మారుఁడ
తంద్రతను స్వకృత కళాప్రదర్శనమును మహా
నీంద్రుని నిశ్చల నిష్ఠయు
నింద్రున కెఱిఁగింపఁ బొగడి రెల్లరు ఋషినిన్. 534

శా. అంతం గంతు జయించి నంతనె, మహాహంభావియై నారదుం
డంతే వింతగ నొక్కనాఁ డరిగి గౌరీశానుఁ డాలింప వృ
త్తాంతం బయ్యది విన్పినన్ బలికె నాతండంత మెల్లగా, "నా
చెంతం జెప్పినచొప్పుఁ జెప్పకుసుమీ శ్రీజానితో నెన్నఁడున్. 535

క. ఊసులనేసందడినే
నీ సుమశరవిజయవార్త నెఱిఁగింప" కనన్
వీసము రుచింపదాముని
కీసదోపదేశంబు భగవదిచ్ఛయె బలి యా. 536

శా. ఏ మైమె దైవవిధానముం గడువఁగా నెవ్వాండు దక్షుండగున్,
ఈమాడ్కిన్ శివబోధ మొల్లక సురర్షీంద్రుండు వేంచేసి త
ద్ధామంబౌ నలసత్యలోకమున కంతన్ బాణివీణన్ రమా
రామాకాంతుయశంబుఁ బాడుచును జేరన్ క్షీరవారాశికిన్. 537

క. వచ్చినమునిఁ జెచ్చెరఁ దో
డ్తెచ్చి వరాసనము నిచ్చి దీటగుబత్తిన్
లచ్చిమగఁడు కడుమచ్చిక
'వచ్చితి సచ్చరిత మాదు భాగ్యమున' ననెన్. 538

తే. అనఁగ నుప్పొంగి సురమౌని హరుఁడు హరికిఁ
దెలుప వల దన్న వలతేనిగెలుపు కతను
మగుడ వినిపించె హరిమాయ మగుడఁ దరమె
యించుక విరించికేని నైరించికేని. 539

చ. హరి వెడనవ్వు నవ్వుచనె న త్తపసింగని మెత్తనౌ నుడిన్
'స్మరణమొనర్ప నిన్ దొలఁగు మారవికారసుషామదాళి, ని
ర్జరముని! మోహ మంటు టది జ్ఞానవిరాగవిహీనులం గదా
స్మరుఁడు కలంచు నొక్క నిను సద్వ్రతధారిని బ్రహ్మచారినిన్.' 540

చ. అనవుడు హాని నెమ్మది నహమ్మతి క్రమ్మఁగ 'నీ కృపావిలో
కనమునగా యిదంత' యనఁ గారుణికోత్తముఁ డూహచేసె నీ
మునికి నఖర్వగర్వమను మొల్కయొకం డెద నంకురించె దా
నిని మనకుండఁ ద్రుంపఁదగు నే శ్రితరక్షణ దీక్షితుండఁగా. 541

చ. మునికి హితంబు నామదికి మోదముఁ గొల్పు విచిత్రగాథ యొం
డొనరుతు నంచు నెంచి కమలోదరుఁ డయ్యభిమాని హాని వీ
డ్కొని చనినంతఁ ద్రోవ నెలకొల్పెను ముందుగ నాత్మమాయఁ గ
న్గొను మిఁక దాని చెయ్వులు, నకుంఠిత విక్రమముల్ క్రమంబుగన్.

మ. విరచించెన్ హరిమాయ యొక్కపురి నావేధస్సుతుం డేగుచో
వరశోభన్ శతయోజనాయుతముగన్ వైకుంఠమున్ మించుచుం
బురడింపంగలదానిఁ జిత్రరచనం బొల్పొంద నం దుండి యా
పురిలో స్త్రీపురుషుల్ తద్ధృతరతీపుష్పాస్త్రులో యన్నటుల్. 543

క. ఆపురిని శీలనిధియను
భూపతి శతశక్రవైభవుఁడు హయగజసే
నాపరివృతుఁడును దేజో
రూపబల నయాధికుండు రూపొందు నటన్. 544

ఉ. ఆతని కొక్క కూఁతు గల దాయమ రూపున శ్రీవిమోహినీ
ఖ్యాతిని విశ్వమోహినిగ సార్థకనామముఁ దాల్చి వర్ణనా
తీత మహోజ్జ్వలాకృతి క్షితిన్ హరిమాయఁ దనర్చు నాతఁడా
కూఁతు స్వయంవరోత్సవముఁ గూరిచి చాటె నృపాలకోటికిన్. 545

తే. శీలనిధిరాజు కూఁతును జెట్టబట్ట
దేశదేశాలనుండి పృథ్వీశు లటకు
వచ్చుచుండుటఁ గాంచి యవ్వార్తఁ దెలిసి
దారిఁబోవుచు సురమౌని తాను నరిగె. 546

ఉ. వచ్చినమౌనిఁ గాంచి నృపవర్యుఁడు పూజలొనర్చి యాసనం
బిచ్చి కుమార్తెఁ దెచ్చి కడునింపునఁగేల్మొగిపించి యీమెకో
సచ్చరితా! గుణాగుణవిచార మొనర్పుఁ డటన్న నారదుం
డచ్చెలి ముచ్చిలింపఁ దనయాత్మను మోహము పిచ్చిరింపఁగన్. 547

తే. రాకొమరిఁ గాంచి మోహవిభ్రాంతుఁ డగుచు
నిజవివేకముఁ గోల్పడి నివ్వెఱపడి
యాకెగుణముల వాకొన వాకురాక
తన్మయతఁ బెద్దతడవుండి తన్నెఱింగి. 548

తే. ఈమె కేల్గొన్న దిట్ట సంగ్రామముల న
వధ్యుఁడై యేరికిన్ గెలువంగ రాని
యమరుఁ డగువానిఁ గొల్చుఁ జరాచరంబు
లనుచు గణియించి యా నుడి నాత్మ నిలిపి. 549

మ. సుత సల్లక్షణ యంచు మాత్ర మెఱిఁగించుంగాని యాజేని కే
గతిఁ దద్భాగ్యవిశేషముల్ నొడవకే, కంజాక్షి నన్నెట్టు లీ
క్షితి భృన్మండలిలో వరించునని, యుక్తిం జేతుఁ గా కంచు నే
గతి నిష్ఫల్ దపముల్ పొసంగవు, కలంకన్ దైవమా! యంచున్.

తే. బేలనై నన్నుఁగన బాల, విజయమాల
నాయఱుతఁ బూన్పఁదగు రూపు నాకు వలయు
నట్టిరూ పెట్లు లబ్బు నేనెట్లు పడతుఁ
బడఁతినంచుఁ దలంచుచు వెడలె మౌని. 551

మ. హరి నర్థింతు మనోజ్ఞరూప మన జాగా నందు రాపోకలన్
హరికంటెన్ బరమాప్తుఁ డెవ్వఁ డిఁక సాహాయ్యంబుగా నంచు ని
ర్జరమౌనీంద్రుఁడు నారదుం డెద హరిం బ్రార్థింప వే భంగులన్
వరదుం డచ్యుతుఁ డప్రమేయుఁ డచటన్ బ్రత్యక్ష మయ్యెన్ గృపన్.

చ. హరిఁ గని యంతఁ గార్య మొనరారిన యట్ల తలంచి య వ్వియ
చ్చరముని దేవురించె హరిసన్నిధి నంజలి విన్నవించుచుం
'గరుణ యొనర్చి యొక్కపరిఁ గారుణికోత్తమ! నీ జగన్మనో
హరహరిరూప మీఁగదవె! యచ్చెలి నన్నె వరించు నట్టులన్. 553

ఉ. ఎవ్విధి మద్హితంబగు రమేశ! యొనర్పు మదే విధాన మే
నెవ్విధి నీదుబంటను క్షమీ' యన దీనదయాళుఁ డంత లో
నవ్వుచు నాత్మమాయఁ గని 'నారద! నీకు హితం బదెట్టులా
నవ్విధ మాచరింతును ద దన్యవిధాన మొనర్ప నమ్ముమా. 554

క. రోగి యపథ్యముఁ గోరిన
నే గతి వెజ్జయకుండు నేను నదే యం
చా గతి శ్రితకోటికి నిడ
నా గతి నీ హిత మొనర్తు నని హరి చనియెన్. 555

శా. మాయామోహవిమూఢ పహాని హరివాఙ్మర్మంబుఁ గన్గొక యే
పోయెన్ రాజసుతాస్వయంవరసభం బొల్పైనపీఠంబులన్
రాయల్ సుందరవేషభూషితులునై రాజిల్లు నచ్చోటికిన్
నాయాకారముఁగన్నఁ గన్నె విడునే నన్నంచు గర్వించుచున్. 556

ఆ. అడిగిన హరిరూప! మర్థాంతర మొనర్చి
కోతిరూప మొసఁగె గోతి రోయ
హరి సురముని కోరుల కా గుట్టెఱుఁగరామి
నెప్పటట్లు కాంచి రెల్లరతని. 557

తే. నిజతనువిలాసగర్వి యా నిర్జరముని
యెదుటఁ గూర్చుండియుండి రయ్యాశుగణము
లోని వారలు ద్విజరూప మూని యిర్వు
రాతతాయులు వా రీరహస్య మెఱిఁగి. 558

మ. పరు లేరుం గనకుండ నక్కుహనవిప్రద్వంద్వ మచ్చో ముని౦
బరిహాసం బొనరించె "శౌరి తగురూపం బిచ్చె నిమ్మౌనికిన్
వరియించున్ హరియంచు రాజసుత రూపం బిద్ది కన్నంతనే
పరమానందముతో" ననన్ ముని గ్రహింపం డయ్యె నయ్యర్థమున్.

ఆ. వేల్పుతపసి మనసు వెడవెట్టివలవంత
నాటుకొంట నెట్టిమాట మఱువు
లెక్కవయ్యె నల్ల ముక్కంటి బంటుల
కొంటె మాటలైన కంటసమయి. 560

ఉ. ఈచరితం బెఱుంగ రట నెవ్వరు నాన్నృపకన్య మాత్రమే
చూచి మునీశుఁ గీశముఖు శోకరుషాకుల యాచు రోతతో
నాచోటు వాసిపోయె, నకురాం డిరువంకలఁ గొల్వఁ జూడ్కులన్
రాచకొమాళ్ల యుల్లముఁ గరంచుచుఁ జే జయమాలఁ బూనుచున్.

క. ఉబ్బుచుఁ దా నిలిచినదెస
కబ్బాలిక యేమఱిలియు నటు కనకున్నన్
నిబ్బరము విసిఁగె నమ్ముని
యబ్బాపలు పరిహసింప నబ్బా యనుచున్. 562

ఉ. అంతకు మున్నె వెన్నుఁడు నృపాకృతితోఁ జనుదేర మోహినీ
కాంత వరించె నభ్భువనకాంతు జగజ్జనమోహనాంగు భూ
కాంతులు నాసఁ బాసి చనఁగా, హరియుం జనె మోహినీరమా
కాంతలతోడ మాని మఱిఁ గైకొని కోల్పడి నట్లు చింతిలన్. 563

తే. అంతకంతకు ముని మోహితాంతరంగుఁ
డగుచుఁ బరిపరివితములఁ బొగులుచుండఁ
గాంచి ప్రమథులు 'నీసోయగంపు సొంపుఁ
గాంచు మొకపరి ముకురమం' దంచుఁ బలికె. 564

ఉ. నీటను నీటుఁ గాంచి కసి నెక్కొన నమ్ముని వారిఁగాంచి 'నై
శాటకులంబునందుఁ గడుజాల్ములరై జనియింపుఁడీ ననున్
మాటికిఁ గాంచి నవ్విన ఘనంబగు పాపఫలం బ దూలకే
యేటికిఁ బోవు'నంచు శపియించె న టక్కహనాద్విజద్వయిన్.565

క. ఉదకముల మగుడఁ గని యం
దొదవినఁ దొలిరూపు మోద మొదవమి మదిలో
బెదవు లదరఁ గిన్కయదరఁ
గదలెన్ ద్రుతగతిని హూని కంజాక్షుఁ గనన్. 566

చ. హరి హరి శౌరి నాలిడులఁ బుత్తునొ చత్తునొ యిందు నన్నిటుల్
పరిభవముం బొనర్చె నని పాలి వధూకమలాసమేతుఁడై
యరుగుచు మార్గమందె కననై హరి 'నారద! కల్కగూరగా
నరిగెద వేడకో' యన వియన్ముని యక్కసుమీఱ నిట్లనెన్. 567

మ. హరిమాయావివశాత్ముఁడై యెఱుకలే కబ్జాక్షు నెగ్గాడె "నీ
వొరు నైశ్వర్యముఁ జూడఁ జాలని యసూయోపేతుఁడౌ దంబుధిన్
దరుచం బుట్టిన ఘోరహాలహాలముం ద్రావించి ముక్కంటిచే,
సుర రాకాసుల కిచ్చి, లచ్చిని మణిన్ సొంతమ్ముగాఁ గొంటివే.568

ఆ. ఆదినుండి నీవు స్వార్థసాధకుఁడౌదు
మాయదారివౌ దమేయుఁడౌదు
వదుపు నానలేని యధికస్వతంత్రుఁడ
విచ్చవచ్చునదియ యెపుడు సేతు. 569

సీ. బాగునోఁగొనరింతు వోఁగుబాఁ గొనరింతు
మోదవిషాదముల్ మోయకెదను,
వంచించి వంచించి యెంచి పరీక్షింతు
వందఱి నిల సదానంద మయుఁడ,
వలయింపవు నినున్ శుభాశుభకర్మంబు
లెవరు నిన్ సాధించి రింత దనుక ?
మంచి యింటను నేటి కెంచి వాయసమిచ్చి
తెం దేగె దాఫల మందకుండ ?
నెట్టి రూప మూని యిపుడు నన్ వంచించి
తట్టిగూపమె కొను మదియుఁగాక ?
నగవు పాలుగాఁగ నాకొసంగిన కోతి
మొకపు మెకములె యగు సకులు నీకు. 570

క. నారీకారణమున నా కప
కార మొనర్చితివి కానఁ గానల నీవున్
నారీవిరహవ్యసన వి
దారితమతి వా" దటంచుఁ దపసి శపించెన్. 571

మ. మునిశాపం బటు దేవకార్యమునకై మూర్ధంబునం దాల్చి చ
య్యన లక్ష్మీవిభుఁ డాత్మమాయ నుపసంహారంబుఁ గావించు నం
త నదృశ్యం బయి విశ్వమోహిని, రమాతన్వంగియున్ మాయ మ
య్యెను భీతిన్ ముని శౌరికాళ్లపయి 'త్రాహిత్రాహి' యంచుం బడెన్.

క. "శాప ముపశాంత మగుతఁ గృ
పాపర ! నాతలఁపు నిదియె పలికితిని దురా
లాపంబుల నెన్నెన్నియు
నా పాపం బెట్టు లుడుగు నాపద్బంధూ. 573

మ. చనునే యీగతి శౌరి దూఱ" నని పశ్చాత్తప్తచేతస్కుఁడౌ
మునినైరించిని గాంచి శ్రీహరి యనెన్ "ముక్కంటి నిక్కంపు భ
క్తిని గొల్వన్ జపియింప నామశతి శాంతింగాంతునే వానికం
టెను నా కిష్టుఁ డెవండు లేఁడను నుడిన్ డెందంబునం దాల్పుమా!

మ. మనుజుం డీశకటాక్షపాత్రుఁ డగునేన్ మద్భక్తిపాత్రుండు నౌ
నని భావించి శివున్ భజింపు నిను డాయం బోదిఁకన్ మాయ" యం
చును వైరించిని నూఱడించుచు నదృశ్యుం డయ్యె నబ్జాక్షుఁ డ
మ్మునియున్ శ్రీహరిఁ బేరుకొంచు నిలయమ్ముం జేరు నాలోపలన్.

ఉ. ఆసురయోనిఁ బుట్టుఁ డని యా సురహాని శపింప మోహముం
బాసి తలిర్చి యాప్రమథవర్యులు దారికి నడ్డువచ్చి తా
దోసిలు లొగ్గి "చేసితిమి దోసము యోగ్యఫలంబుఁ గొంటి మే
మీసు వహింపకే సురమునీశ్వర ! శాప విముక్తినీయవే ! 576

క. పాపులముగాని నిక్కపు
బాపలముం గాము ప్రమథవరులము జుమ్మీ
యోపము శాపముఁ బాపు ద
యాపర !" యన హానిపల్కె "నాసురయోనిన్. 577

క. విపుల మహాబలతేజో
విపులులరై పుట్టి శక్తివిపులతను బరం
తపులై జగముల గెలుతురు
విపులాస్థలి నవతరించు విష్ణుండపుడే. 578

తే. హరికరాహతు లౌచు మీరపుడు తుదకు
ముక్తిఁగాంతురు సంసారరక్తిఁ బాసి"
యనిన దేవర్షి పదముల నంటి మ్రొక్కి
యరిగి కాలానుగతి వార లసువులైరి. 579

క. ఈకతమున నొకయుగమున
శ్రీకాంతుఁడు మర్త్యతనువుఁ జేకొని ధరణిన్
నాకౌకసరంజనుఁడై
రాకాసులజెండి భూభరంబు నడంచెన్. 580

క. ధారుణి శ్రీహరి నర తను
ధారణమున భూభరావదారణమందున్
ఘోరాసురమారణమునఁ
గారణ మీశాపగాథ కల్పం బొకటన్. 581

శా. ఈరీతిం బ్రతికల్పముం బొడమి లక్ష్మీశుండు కావించు నా
నా రీతిన్ బహుదివ్యకర్మము ల వెన్నన్ జిత్రచారిత్రముల్
ధీరుల్ మౌనివరేణ్యు లా కథల భక్తిం బాడి విన్పించి ర
వ్వారిం జిత్రవిచిత్రభంగి బహుధావర్ణ్య ప్రసంగంబులన్. 582

ఆ. హరి యనంతుఁ డతని చరిత లనంతముల్
కల్పకోటినైనఁ దెల్పఁ దరమె
వాని నెల్ల ననుచు వాదించు శ్రుతులెల్ల
వింతసేయఁ బోరు వేత్తలిందు. 583

క. సురనరముని బుధకోటుల
హరిమాయాతీతుఁ డెవ్వఁ డవశుఁడు కాకం
చరసి కొలువు మాయాధీ
శ్వరు నీశ్వరు నిందిరేశుఁ జగదీశ్వరునిన్. 584

చ. అగుణుఁ డజుండు బ్రహ్మము ననంతుఁడునౌ హరి కౌసలేయుఁడ
ట్లగుటకు హేతు వింకొకఁడు నాడెదఁ జిత్రవిచిత్రరీతి నో
యగుసుత ! సావధానమతివై విను మయ్యవతారలీలలన్
జగతిని దత్కథల్ భవ రుజం బరిమార్చు మహౌషధంబులౌ. 586

మందాక్రాంత :

కాంతా! రాముం డనుజయుతుఁడై కానకాపై చరింపన్
భ్రాంతస్వాంతంబున నరసి తద్భ్రాంతితోఁ దొంటి జన్మం
బంతం జింతావికలమతివై తట్టి విభ్రాంతి నేఁడున్
సాంతంబున్ నిన్ విడువదదె సుస్వాంతవై విన్మదీనిన్." 586

క. అని శంకరుఁ డిటు పలికిన
విని శాంకరి నగుచు భక్తివినమితయైనన్
గని మగుడ నిట్టు పలికెను
మును హరి మనుజావతారమును గొను కతమున్. 587

క. అని యాజ్ఞవల్క్యముని యనె
"యనఘ! భరద్వాజమౌని! యవధానమునన్
విను కలికలుషాపహములు
ఘనకల్యాణావహములు కాకుత్ స్థ కథల్. 588

## స్వాయంభువమనుచరిత్రము

క. స్వాయంభువశతరూపా
జాయాపతు లాదియగుచు సకలనృసృష్టిన్
ధీయుతులు వెలసి రిల శ్రుతి
గేయము తద్ధర్మకర్మకృత్యము లిపుడున్. 589

తే. వార లుత్తానపాదకుమారుఁ గనిరి
వానితనయుఁడు ధ్రువుడు శ్రీవరునిభక్తుఁ
డును బ్రియవ్రతుఁ డెవ్వాడు కనెను గూఁతు
దేవహూతిని దేవాదిదేవు మాత. 590

తే. దేవహూతి కర్దమముని దేవి యాచుఁ
గనియెఁ గపిలావతారు రాక్షసవిదారు
సాంఖ్యశాస్త్రప్రకాశు లసత్ప్రకాశు
సాంద్రకృపునిఁ దత్త్వార్థవిచారనిపుణు. 591

తే. ఇట్టి మహనీయకులమునకెల్ల మూల
పురుషుఁడై నృసృష్టికి హేతుభూతుఁ డగుచు
నాస్వాయంభువ మనువేలె నవని నెల్లఁ
బెద్దకాలము హరియాజ్ఞఁ బేరువడసి. 592

చ. సదనములన్ విలాసములు సల్పుచు బ్రొద్దులు పుచ్చు నానృపున్
ముదిమి గమించె నంతకును మోహవిరామము గల్గకున్కి నా
బ్రదు కిది వ్యర్థ మయ్యె హరిభక్తిఁ దలంపక యంచుఁ బొక్కుచుం
గదలె సతీసమేతుఁడయి కానకుఁ, బట్టముఁగట్టి పట్టికిన్. 593

చ. వితతము నీశ వాసము, పవిత్రము, సాధకసిద్ధిసాధకం,
బతిసుకృతంబు నైమిశమహాటవికిం జని జ్ఞానభక్తు లా
కృతులు ధరించెనో యన నకిల్బిషమూర్తుల నొప్పువారు గో
మతి నదిలోనఁ గ్రుంకులిడ మచ్చిక నచ్చటి మౌనులెల్లరున్. 594

క. ధర్మధురంధరుఁ డితఁ డని
యర్మిలి నెదురేగి నృపతి నాదర మొప్పన్
ధర్మసతీయుతుఁ ద్రిప్పిరి
కర్మఠు లా మునివరులు సకలతీర్థములన్. 595

ఉ. చిక్కిన మేనులన్ దపసిచీరలు జుట్టి పురాణగాథలన్
మిక్కిలి వించు దంపతులు మిక్కిలి మక్కువ ద్వాదశాక్షరిం
జిక్క జపించుచుండి రట శ్రీహరిపాదసరోజభక్తిచేఁ
జిక్కుచు శాకమూలఫలసేవనమూలమునన్ గడుం గడున్. 596

తే. సచ్చిదానందు బ్రహ్మము సంస్మరించి
శాకఫలభోజనము మాని జలము గ్రోలి
తపముఁజేసి ర టారాజదంపతులట
శౌరిసాక్షాత్కృతిన్ మతిన్ గోరివారు. 597

మ. శ్రుతు లెవ్వానిని 'నేతి నేతి' యనుచున్ రూపింప లేకుండు నీ
క్షితి మూర్తిత్రయ మేనియంశములచేఁ జెందున్ బహూత్పత్తులన్
మతిఁ జింతింత్రు ముముక్షు లెవ్వని వసామాన్యుం డజుం డాద్యుఁ డం
చతనిం గన్నులఁజూడ వేడ్కపడి ర య్యానందరూపున్ ప్రభున్. 598

తే. 'శ్రితజనంబులచేఁ జిక్కి శ్రీధవుండు
తద్ధితంబున లీలావతార మూను
ననెడు శ్రుత్యుక్తి సత్యోక్తి యౌన యేని
మాదుకోరికి యీడేరుఁ గాదె' యనుచు. 599

మ. సలిలాహారమునన్ సతీపతులు షట్సాహస్ర వర్షాళి ని
ర్జలులై సప్తసహస్రవర్ష మనిల గ్రాసంబుతో బొట్టవ్రే
లిలపై మోపి యభోజు లౌచుఁ బదివే లేండ్లున్ దపింపంగృపా
ళులు ముమ్మూర్తులు నేగుదెంచి 'వరముల్గోరుండు లేలెం'డనెన్.

శా. ఈలీలన్ వరదుల్ 'వరం బిడుదు మే మే' మన్న నాసింపకే
యా లోభోక్తి గణింపకే తమదు మే నస్త్యాశ్రితం బౌ నుడిన్
లో లెక్కింపని రాజదంపతుల నాలోకించి ప్రేమం గృపా
కీలాలాలయుఁ డాతఁ డాహరియు రక్షింపం దలంచెన్ మదిన్ 601

ఉ. అంత నభోంతరంబున దయామయవాణిని 'దెల్పుఁ డయ్య! మీ
యాంతరికేచ్ఛ' నంచు విననయ్యెను జావెదురెత్తి వచ్చునా
పొంతకు జీవనౌషధము పోలికి నానుడి కర్ణమార్గియై
స్వాంతములందుఁ జొచ్చి తొలిసాజపురూపు లొసంగె వారికిన్.602

ఆ. ఇంటి విడుచునాటి హృష్టిపుష్టులనొంది
శ్రవణసుధవలె విని చదలుపలుకు
హర్ష పులకితాంగుఁ డగుచు స్వాయంభువ
మనువు దోసిలొగ్గి వినుతిఁజేసె. 603

మాలిని: "నతజనపరిపాలా! నాగపర్యంకలోలా
శ్రితజనసురపాలా! శిష్టభూజాలవాలా!
శ్రుతినుతసుగుణాళీ! స్తూయమానాంఘ్రిధూళీ!
శతధృతిముఖపాలా! సర్వజీవాలవాలా! 604

శా. మాపైనం గృప కల్గెనేనిఁ గననీ మాపాలిదైవంబ! నీ
రూపం బెద్ది మహేశ్వరాత్మవశమా శ్రుత్యైక సంస్తుత్య మే
రూపం బౌను భుశుండి చిత్తవశమే రూపంబు, ఋష్యాళికిం
బ్రాపై సాధనకారకం బగునో రూపం బద్ది చూపింపుమా." 605

క. వినయస్నేహంబుల నిటు
మనువును సతి పలుకు మృదులమధురోక్తులకుం
దనిసి కనుపట్టె ముంగట
వని విశ్వవ్యాపి భక్తవత్సలుఁ డచటన్. 606

క. నీలాంబుద నీలాంబుజ
నీలమణిప్రభల నేలు నీలాంగరుచిం
బోలిచి కన సిగ్గునఁ దల
వాలుపరొకొ కోటికోటి పంచాయుధులున్. 607

ఉ. ఇందుముఖమ్ము, నందమున కిమ్మగు చెక్కిలి నున్నుసొంపు నా
పొందగు కంబుకంఠమును బొల్పగు నాసయుఁ, జంద్రచంద్రికా
నిందకమందహాసమును నీరజదీప్తి నెసంగు కందొయిన్
జెం దొవఛాయ మోవియును, జిత్తహరం బగుగాదె యేరికిన్. 608

సీ. భ్రూవులు స్మరధనుర్ద్యుతుల మీఱంగను
దిలకంబు నొసటను దీప్తి నెసఁగ
మస్త మొప్ప మకుటమకరకుండలకాంతి
నళిచయచ్ఛాయఁ గుంతలము లలర
వక్షంబు శ్రీవత్సవనమాలల వెలుంగ
మణివజ్రవైడూర్యమాల లఱుత
సింహకంధరమునఁ జెన్నొందు జందెంబు
బహుభూషణంబులఁ బరగి యలరు

బాహుదండముల్ కరికరప్రతిభ మీఱఁ
దరకసము కటిఁ గేలఁ గోదండమలర
మెఱపు మెఱపును మఱపింప మేల్మిమడుగు
నాభి యమునాజలావర్త శోభమీఱ. 609

చ. మునిజనమానసాళ్యాళులు మూఁగు పదాబ్జయుగం బవర్ణ్యశో
భను జెలువార, వామదిశ భాసిల నాదిమశక్తి, స్వాంశసం
జనిత శివా రమా ద్రుహిణసాధ్వియు, నాదియు, భ్రూవిలాస సం
జనిత మహాప్రపంచ, రఘుచంద్రుని సన్నిధి సీత తానవై 610

శా. ఈరీతిం జెలువారు కాంతినిధి లక్ష్మీశాకృతిం గన్నవే
యారాజున్ సతి నిర్నిమేషులుఁ దదైకాసక్తచేతస్కులై
శారీరస్థితిఁ దప్పి కన్నకొలఁదిన్ జాలన్నయాపోకలే
కా రక్షస్తిమిరాంశుమంతునకు సాష్టాంగప్రణామం బిడన్. 611

ఉ. అట్టి యెడం గృపాళుఁడు కరాబ్జము మోపి తదుత్తమాంగ మం
దట్టె స్పృశించి 'మీర లనఘాత్ములు నన్నుఁ బ్రసన్నుఁ జేసి నా
రెట్టి యభీష్టముల్ వలతు రిచ్చెదనే వరదుండఁ గోరుకొం
డెట్టిదొ' యన్నఁ గేల్మోగిచి యెంతయు భక్తి నిటంద్రు దంపతుల్.

మ. "కరుణాబ్ధీ! భవదంఘ్రిదర్శనమె కాంక్షాసిద్ధు లీడేర్చె నిన్
వర మొం డే మడుగం దలంతు మది దుష్ప్రాపంబొ సంప్రాప్యమో,
వర మీయన్ సులభంబు నీ కయినఁ దద్వాంఛావిధప్రాప్తి దు
ర్భరమై తోఁచెడు మాకు లుబ్ధమతిఁ గోరం జాల మే కోరికిన్. 613

ఉ. కల్పమహామహీరుహముఁ గన్గొన వచ్చియు ముందు దన్మహా
నల్ప వరప్రదాన మహిమాతిశయంబు కొలంది గాన కొం
డల్పముగాఁ దలంచుచుఁ జిరార్థితనైజ మనోరథార్థముల్
దెల్పఁగ సంశయించు నతిదీనులభంగిగ నైతి మక్కటా. 614

క. అంతయుఁ గనుపట్టెడు స
ర్వాంతర్యామివిగ నస్మదాంతరికేచ్ఛన్
సాంతముగ నింపు" మన 'నా
కెంతయు నిడరాని దెద్ది యిడుదు' నటంచున్. 615

శా. 'సంకోచింపక కోరు' మన్న హరికిన్ స్వాయంభువుం డంత "ని
శ్శంకన్ సత్యముఁ బల్కుచుంటి వినుమో సర్వాత్మ! నిన్ వేఁడఁగ
స్సంకోచింప మదిన్, భవాదృశసుతున్ వాంఛింతు"నాన్ 'మాదృశుం
డిం కెందుం గలఁ డేనెవచ్చి నృప! నీయింటన్ జనింతుం జుమీ.' 616

క. అని నృపతికిఁ బ్రియమున హరి
తనయుఁడుగా నియ్యకొనుచుఁ దత్సతి శతరూ
పనుఁగల వర మడుగుమనం
దనపతి కోరిన వరమ్మె తాఁగోరి యనెన్. 617

ఆ. "భక్త హితమునీకు భావ్యమై తోఁచుఁగా
కిట్టిపూన్కి శౌర్యమే సుమయ్య!
యఖిలభూతవర్తి వఖిలలోకపతివి
బ్రహ్మముఖ్య పితవు బ్రహ్మమీవు. 618

ఉ. ఇవ్విధ మెంచ శంక మది నేర్పడు నైనఁ ద్వదుక్తి సత్యమా,
నెవ్విధి నాత్మభక్తుల కభీష్టము లెట్లు పొసంగుచుండు నీ
వవ్విధ మాచరింతు ప్రభు! యాగతి యాసుఖ మావివేక మ
ట్లవ్విధి జ్ఞానభక్తులఁ ద్వదంఘ్ర్యనురక్తు లనుగ్రహింపుమా." 619

చ. అని శతరూప పల్క నిటు లామృదుగూఢవచోవిశేషమున్
గని ముద మొంది శ్రీవిభుఁడు కాంక్షలు నీమది నున్న నెల్ల సి
ద్ధిని గనుఁడల్లి! నాకృపఁ ద్వదీయవివేక మలౌకికం బదె
ప్డును జెడకుండు నన్న మనువున్ హరిపాదములంటి క్రమ్మఱన్. 620

ఉ. "విన్నప మాలకింపు విభు! వేఱొకఁ డుండెను వేఁడుకో లిదే
నిన్నుఁ గుమారభావమున నేఁ బరికింతును గాత యెవ్వ రే
తెన్ననఁ గాంచనీ, భవదధీనమె కావుత నాదు జీవ మో
యన్న! ఫణుల్ ఫణామణుల కంబుల కంబుచరంబులంబలెన్. 621

క. అని స్వాయంభువుఁ డడిగిన
ననుకంపాసింధుఁ 'డేనమ' స్తని మఱి "నా
యనుశాసనమున సురపురిఁ
జని భోగవిలాసములను సౌఖ్యముఁ గొనుఁడీ. 622

ఆ. ముందుకాలగతిని బుట్టు దయోధ్యాధి
పతిగ నపుడె నీకు సుతుఁడ నగుచు
నవతరింతు నేను సాంశుఁడనై యిచ్చ
వచ్చురూపు లూని త్వద్గృహమున. 623

మ. జననం బొంది చరిత్ర మొందు శ్రితవాంఛాసిద్ధిదం బౌనటుల్
వినువారున్ భవముం దరించి జగతిన్ వీతాంహులౌనట్టులుం
బొనరింతున్ భువి నాదిశక్తి జగముల్ పుట్టించు నా మాయయుం
జననం బందుఁ ద్వదీప్సితంబు లొదవున్ సత్యంబులౌ నానుడుల్." 624

క. అని యనునయించి మనువును
మనుపత్ని సదృశ్యుఁ డయ్యె మాధవుఁ డటు వా
రును హరి మది నిడి కొంతకుఁ
గనిరి దివ మొడల్గువాసి కాలానుగతిన్. 625

క. గిరివరపుత్రి కొకప్పుడు
గిరిశుం డీమనుచరిత్రఁ గృప వినుపించెన్
బెరిమ, భరద్వాజ! వినుమ
పరహేతువు రామజన్మభావంబునకున్. 626

## ప్రతాపభానుచరిత్రము

మ. విను మీగాథ శివుం డుమాసతికి మున్ విన్పించె నొక్కప్పుడున్
వినయోపేతుఁడు సత్యకేతుఁ డను పృథ్వీపాలుఁ డక్కేక యా
వనిఁ దేజోనయవిక్రమక్రమ మిలన్ భాసిల్లఁ బాలించె నా
యనకుం గల్గిరి యిర్వురాత్మజులు ధైర్యస్థైర్యవీర్యాన్వితుల్. 627

మ. నెన రింపారఁగ నానృపాత్మజు లనిర్ణేయప్రతాపోన్నతుల్
ఘనవీరుల్ రణధీరులై పొర లెఱుంగంబోని సఖ్యంబునన్
దనరన్ వారు ప్రతాపభాను రిపువిధ్వంస్యాఖ్యులం, దండ్రి జ్యే
ష్ఠునకుం బట్టముఁగట్టి పావనవనక్షోణిం దపింపం జనెన్. 628

ఉ. అంతఁ బ్రతాపభానుఁడు ధరాధిపుఁడై శ్రుతిసమ్మతమ్ముగా
నుంతయుఁ బాపలేశ మెదఁ జొప్పడనీక ధరిత్రి నేలె శ
త్ర్వంతకుఁ దమ్మునిన్ సచివు ధర్మరుచిప్రథితున్ హితైషినిన్
మంతరమందు శుక్రసమమాన్యునిఁ గూడుక సార్థనాముఁడై. 629

క. అంతట నొకనాఁ డా భూ
కాంతుఁడు హయరథ పదాతిగణమును గని లో
సంతసిలి జైత్రయాత్రకు
స్వాంతమున జిగీషు వగుచుఁ జనె శుభవేళన్. 630

క. గజరథహయసేనాయుత
నిజపరివారమున విజయనినదములన భూ
భుజుల జయించుచు వారలు
భజింపఁ జనెనా ప్రతాపభానుఁడు కడిమిన్. 631

మానిని : దండిమగం డి ఖండబలంబున ధారుణిలోఁగొని దో
ర్దండబలాధికుఁడై నృపతండము దండము వెట్టఁగ భూ
మండలి నొం డెనలేని విభుండయి మన్ననసేలె నతం
డండగఁ జేరి భజింపఁగఁ దన్ బురుషార్థచతుష్టయమున్. 632

ఉ. నేమము నీతియుం గఱఁప నీతివిధిజ్ఞుఁ డమాత్యశేఖరుం
డా మహిపాలుఁ డేలె ననయంబు నయానయసంవిచక్షణుం
డై మహి కామధేనువయి యాతని ప్రాపునఁ గోర్కులీనె దుః
ఖామయ దూరులై ప్రజ సుఖాంబుధిఁ దేలిరి ధర్మశీలురై. 633

శా. తేపున్ మాపును ధర్మతత్పరత నాపృథ్వీశుఁ డాలించు మో
క్షాపేక్షన్ శ్రుతులం బురాణముల నభ్యర్చించు దేవావళిన్
వాపీకూపతటాక పుష్పవన దేవబ్రాహ్మణాగారముల్
స్థాపించుం గ్రతురాజి నొక్కొకఁడు వే సారుల్ బొనర్చుందమిన్. 634

క. సేవించు భక్తిమించఁగ
దేవుళ్లఁ బితాళ్లఁ బుడమిదేవుళ్లఁ దమిన్
రావించి దానములు నిడుఁ
గావించును బెక్కుధర్మకార్యము లెపుడున్. 635

తే. చేయుచుండును జిత్తవాక్కాయశుద్ధి
దేవకార్యము లెన్నొ పృథ్వీశుఁడెప్పు
డిచ్చ నొంఁ డిచ్చగింపక యిచ్చుచుండు
నీశ్వరార్పణబుద్ధి నేయెరవులేక. 636

తే. ఆనృపోత్తముఁ డొకనాఁడు హయమునెక్కి
వేఁటకై యేగి వింధ్యాచలాటవులకు
శూలములు విల్లు నమ్ములఁగేలఁ బట్టి
చాల మెకములఁ బొలియించి నేలఁగూల్చి. 637

ఉ. కానఁ జరించుచున్ నృపతి కాంచె వరాహము నొక్కదానిఁ గో
పానను నోటఁ బట్టి సితభానునిమ్రింగను గ్రక్కలేకఁ గా
ర్కానల డాగవచ్చు పెను రాహువనంగ, మహోగ్రదారుణం
బైన వినీలశైల వికృతాకృతి దాని, సిరోగ్రదంష్ట్రిమున్. 638

క. అప్పుడ దా దొరగుఱ్ఱపు
చప్పుడు విని చెవుల సాచి చప్పునఁ బాఱన్
జప్పున వెన్నంటెను గిటి
నప్పుడ యప్పుడమిఱేఁడు హయసహితుండై. 639

మ. తన వెన్నంటెడు నన్నరేంద్రుఁ గని భూదారంబు పెన్గాడ్పువ
ర్వునఁ బాఱన్ నృపుఁ డొక్కతూపు విడిమున్ భూలిప్తమై పోవఁజ
య్యన వేఱొండుశరమ్ము వైచె మది లక్ష్యంబూని, యయ్యేదు న
మ్మును దప్పించుక తూఱె ఘోరగహనంబున్ వాహనాగమ్యమున్.

మత్తకోకిల :
అంతఁ బంతము వీడ కానృపుఁ డంతరంగము నందు న
త్యంతకౌతుక మూని యక్కిటియంతుఁ జూడఁ దలంచి యే
యంతరాయము లెక్కసేయక యశ్వమందున డిగ్గి తా
నంతఁ గాల్నడ నేగ డాగె గుహాంతరంబున దంష్ట్రియున్. 641

మ. అపు డాతం డటు దంష్ట్రి కందరమునం దాత్మావనార్థంబు డా
గు పరిం గొట్టఁగ రామికై వగచుచున్ గుజ్జంబులోఁ దాను న
వ్విపినాధ్వంబును దప్పి దప్పియు క్షుధావేశమ్ము నొక్కుమ్మడిన్
విపరీతంబగు నొవ్వఁ గూర్ప సలిలాన్వేషంబునం దిర్గుచున్. 642

క. వనిఁ దిరిగి నీటిజాడను
గన కత్యంత వికలుఁడయి కనె నొకకుటిలోఁ
దనపూర్వశత్రు వొక్కం
డనిమొన మున్నోడి తాపసాకృతి నిలువన్. 643

ఆ. ఒరుల కుచ్చగతియు నోటమి తన కొటఁ
జూచి యరికి మోముఁ జూపలేక
యింటి నంటలేక యేగి యా యభిమాని
కానఁ దపసివేష మూని డాఁగె. 644

ఉ. సిగ్గున మోముఁ జూపఁగను జిత్తము రాకిటు డాగియున్న తేఁ
డ గ్గహనాటవిన్ గుటి మహాముని నిక్కపుజోగియంచుఁ గే
లొగ్గి యెఱింగి మున్ను దనకోడిన తేఁడను జాడఁ గానకే
డిగ్గురవానిఁ జేరెఁ గడుడెప్పరమై యలయింప దప్పికల్. 645

చ. ఇతఁడు ప్రతాపభానుఁ డిపు డెంతయు దప్పిని నొచ్చి యుండె నం
చతని యుదంత మంత కని యామునివేషి కొలంకుఁ జూపినన్
క్షితిపతి స్నానపానములఁ జేసి హాయాన్వితుఁడై సుఖంచె నా
కృతకతపస్వి వానికుటికిం గొనిపోయి శ్రమంబు వాయఁగా. 646

ఉ. ఆసనమిచ్చి భూపతికి నమ్మునివేషి మృదూక్తిఁ బల్కె “నో
భాసురమూర్తి! కానలకు బాసట లేకిటు వచ్చి యొంటిమైఁ
జేసితి వింతసాహసము, జీవనమున్ నవయావనంబుపై
నాసలఁ బాసి రాఁ జను నె! యాటలె ప్రాణముఁ బందెమొగ్గుటల్.

తే. ఏటికే తెంచి తయ్య ! ఘోరాటవి కిటు
జాలి పొడమెను నీమోము సార్వభౌమ
లక్షణమ్ముల కిమ్మైన లాగెటింగి”
యనుడు నిజభాగ్య మగ్గించుకొనుచు ఱేఁడు. 648

తే. “తపసి ! భవదంఘ్రిపద్మసందర్శనమున
నుత్సహింతును భావిశుభోదయమున
సచివుఁడఁ బ్రతాపభాను రాష్ట్రమున కేను
వేఁటకై వచ్చి బాటఁ దప్పితి వనోర్వి.” 649

క. అనవుడు ముని యిట్లనె “నో
యనఘా ! యినుఁ డస్తమించె నద్దమ రేయిన్
జనె దెటు డెబ్బదియామడ
పౌనరన్ నేఁ డిందు నిలిచి ప్రొద్దుటఁ జనుమా. 650

క. క్షమ భవితవ్యానుగతిగ
నమరును సాధనసహాయకాంగము లవి మున్
దము తామ చేరకున్నను
దమదాపునఁ జేరఁదీయు దైవవిధంబే.” 651

మ. మునిపల్కుల్ శిరసావహించి తురగంబున్ మ్రానికిం గట్టి య
మ్మనుజేంద్రుం డిటు మౌని వేడుకొనియెన్ “మన్నించి నన్నొండుగా
నను మానింపక సానుకంప భవదాఖ్యాదుల్ వినం బల్కి స
జ్జనమాన్యా ! నను ధన్యుఁ జేయఁగదె వాత్సల్యంబు సంధిల్లఁగన్.”

తే. అనుడుఁ దలపోయు లోనమాయావి యిటులు
రాచబం టొంటరీఁడు రారాజు నంట
యొంటిమైఁ గంటఁబడె నంట కంటకుఁడఁట
యక్కసము దీర నెట్టు లుక్కణఁపకుందు. 653

మ. అని చింతించుచు వైరిసంపదకు నీర్ష్యాయత్తుఁడై నిప్పురాఁ
జిన యూవంబును బోలెఁ గ్రాగుచును గాసిన్ జేని నమ్రోక్తులన్
విని లోలోపలఁ దాప మాపుకొని యుద్వేగంబు సైరించి ప
లైను మాయామయవాణి నమ్ముని మృదూక్తిం, గంటు లోఁగొంటకున్.

ఉ. 'పేరున భిక్షుకుండ నిరుపేద నిలంబడఁ గొంప లే'దనన్
భూరమణుండు పల్కె—"మిముఁ బోలు నకించను లే హరి ప్రియుల్
ధారుణి డాఁగియుంద్రు వరతత్త్వవిదుల్ విగతాభిమాను లా
వారును మిమ్ముఁబోలు ధనవాసవిహీనులు జ్ఞానధాములున్. 655

ఆ. మిమ్ముఁ గన్న యంత మీపేరు విన్నంత
శంకరాదు లేని శంకసేతు
రమరియుండు హరియు మినునుఁబోలినయకిం
చనులరూపున నని చాటు శ్రుతులు. 656

ఆ. మీకు మీరెసాటి గాకెవ్వ రీఁడయ్య
జోతఁజేతుఁ గరుణఁ జూడు మయ్య !"
యని నమస్కరింప నామస్కరి వచించె
రూఢిఁ దన్ను నమ్మె ఱేఁడటంచు. 657

శా. "ఏనిందుండఁగ ముక్కు మూసికొని పెక్కేండ్లయ్యె రాజేంద్ర! యొం
డేనిన్ నన్ గని నావిధం బడుగలే దేనుం బ్రపంచింప లే
దేనిం గూర్చి మదీయచిత్రచరితం బిందాకఁ, బ్రాపంచ స
మ్మానంబుల్ బెలుచం దపోవని దహింపం గారుచిచ్చౌఁ గదా. 658

క. వేషమున జడుఁడె కాదు మ
నీషియు మోసమునఁ బడక నేరఁ డెఱిఁగి పీ
యూషస్యంది సుభాషి సు
వేషియునౌ కేకినోట బెగడవె ఫణులున్. 659

ఉ. కాన రహస్యరీతి నిటు కాన వసింతును గేశవాత్పరం
బైన ప్రయోజనం బెఱుఁగ నంతయు దైవమెఱుంగు లోకస
మ్మానమునం బ్రయోజనము మాకేది ప్రీతి ప్రతీతు లన్నిఁటిన్
నీ నెనరంత నాపయినె నిల్పితి నీకడ మర్మమేటికిన్." 660

తే. అని యుదాసునివిధమున ముని వచింప
నధిపు విశ్వాస మంతంత కధిక మయ్యె
వసుమతీశుఁడు తను మనోవచన శుద్ధిఁ
దనకు వశుఁ డౌటఁగని బకధ్యాని పల్కె. 661

తే. 'ఏకతనునామధేయుఁడ నో కుమార!'
యనఁ బ్రతాపమహీపతి వినయమెసఁగ
'దాసుగా నన్నుఁ దలపోసి తాపసేంద్ర
చెపుడు మీపేరి యర్థవిశేష'మనిన. 662

చ. "మునుకొని బ్రహ్మసృష్టికిని మున్నె జనించి జరామృతుల్ బున
ర్జనువు లెఱుంగ నింతకును క్ష్మావర! యేకతనుండ నంటకుం
బనుపడు కారణం బిది తపోబలమం దనుమాన మూన కే
పనియును గా దసాధ్యము తపోబలులై జగతిం ద్రిమూర్తులున్. 663

క. సృజియింత్రు పెంత్రు తుంతురు
భుజగపతి తపఃప్రభావమున భువిఁ దాల్చుం
ద్రిజగముల నగమ మెయ్యది
యజసృష్టిఁ దపఃప్రభావ మాధారంబౌ." 664

చ. అనుచుఁ బ్రతాపభానుమది క్రమము దోఁప నుపన్యసించె నా
ముని, బహుధర్మమర్మముల ముక్తిదమైన పురాణగాథలున్
జన జననస్థితి ప్రళయచర్చల జ్ఞాననిరూపణంబులన్
వినివిని ఱేఁడు బొమ్మగతి వెల్వెలవోయి నిజంబుఁ దెల్పఁబోన్. 665

ఉ. "వచ్చె భవచ్చరిత్ర మెద వచ్చె భవచ్చతురత్వ మెంతయున్
నచ్చెను నామగోపన మొనర్చుటయున్ నయమార్గమహా నృపుల్
కుచ్చితు లందు నాత్మపదగోపనవృత్తి మెలంగుచుంద్రు నా
కెచ్చెను నీపయిన్ నెనరు నే గురుసత్కృప నిన్నెఱింగితిన్. 666

ఉ. అంద్రు నినుం బ్రతాప రవి యంచును దండ్రిని సత్యకేతుఁ డం
చంద్రు గురుప్రసాదమున నంత యెఱింగితి నైనఁ దెల్ప నో
తండ్రి! తపోవిధిన్ దొసఁగు తార్కొనునంచుఁ బ్రతీతిఁ బ్రీతి నీ
తీండ్రను నీతినైపుణిని దిన్ననఁ గన్న మమత్వ మేర్పడెన్. 667

ఉ. నన్నుఁ బ్రసన్నుఁ డంచు మది నమ్మి యభీప్సిత మొండుఁ గోరుమా"
మ్మన్న మునీశుపల్కులకు నానృపమాళి ప్రహృష్టచిత్తుఁడై
సన్నుతిఁజేసి కేల్మొగిచి "స్వామి! చతుర్విధపూరుషార్థముల్
మున్నె లభించె నిన్ గన ప్రముష్టుఁడ నంటివి కానఁ గోరెదన్. 668

క. ఇమ్ము జరామరణ క్లే
శమ్ములు లేశమ్ముఁ గమ్మఁ జనని తనువు యు
ద్ధమ్మునఁ బరయోద్ధాజే
యమ్మగు నటు లి మ్మకంటకాధ్యక్ష్యంబున్. 669

క. చేకొన శతకల్పాంతము
లేకచ్ఛత్రాధిపత్య మీ వర మిడి నన్
సాఁకు" మనిన రాకొమరున
కా కుహనాకృతియు 'నేవమ' స్తని మఱియున్. 670

ఉ. "కాలము నీ కధీనమగుఁ గాకిఁకఁ గీలక మొక్కఁడుండె భూ
పాలక! నీకు భూసురులఁ బాసి తదన్యుల భీతి కల్గ దా
మూలమునన్ ద్విజావళికి మ్రొక్కుము వారలు వశ్యులైనచోఁ
జాలరు నిన్నుగెల్వ నొక చక్రియు గ్రక్రియు శూలి గీలియున్. 671

క. బాపలు వశులయి చేపడ
భూప! త్రిమూర్తులును వశులు, భూరి తపస్వుల్
బాపలు, వారల కోపముఁ
బాపి మనుప నోపరెట్టి బలియురునైనన్. 672

ఆ. బ్రహ్మవిదుల తోడ బలములు సాగవు
బాహువెత్తి రూఢిఁ బలుకుచుంటి
విప్రశాపము విడి వేఱొండువగ నీకుఁ
జీకుఁ జింత కలుగ దో కుమార!" 673

చ. అనవుడు మౌనిపల్కులకు హర్షము నొందుచు 'లే దిఁకన్ వినా
శన మది నాకు నీకృపను సర్వశుభంబులుఁ బర్వు సర్వదా'
యనిన నృపుం 'దథా' స్తనుచు నా కృతకాకృతి పల్కె నిట్టు "లో
యనఘుఁడ! యీయుదంతము ని దంతయు నేనికిఁ దెల్పఁ బోకుమా.

చ. పెఱచెవి కెక్కెనేని యిది పెంపరిపోదుచుమీ మదుక్తి ద
బ్బఱగఁ దలంపఁ బో కెద నిబద్ధిగ నమ్ముము మంతనం బిదే
పెఱచెవిసోఁకు టొండె, ద్విజు బిట్టలుకన్ గురియాట యొండుగా
కఱవఱ లొంద వొండొకట నల్గినఁ గాని త్రిమూర్తు లొక్కమై." 675

మ. అన 'నౌఁగా' కని యానృపాలుఁడు "గురుత్వామర్త్య కోపంబులన్
మనుపం జాలు నెవండు మౌనివర! బ్రహ్మక్రోధమున్ మాన్పుచున్
మనుపంజాలు గురుండె యల్గినను మన్పంజాలు నెవ్వండు నీ
పనుపున్ దాఁటినఁ గీడు మూఁడు ద్విజకోపం బోపరా దెంతయున్.

మ. అని చింతింతు మునీంద్ర! యగ్రజులు మత్స్వాధీనులౌ యుక్తియు
న్నను దెల్పంగదె నిన్నుఁ బోరినహితుల్ నా కెవ్వరుం" డన్న నా
ముని పల్కెన్ "నృప! కష్టసాధ్యము లవేమో యుండినం గాని సా
ధన మొండుండె వచింతు నందున నసాధ్యం బొండు గల్గుం జుమీ.

ఆ. అట్టి సాధనం బదరయ నాచే నుండె
నాదురాక తగదు నీదుపురికి
నివ్వనంబ కాని యే యూండ్లు నే యిండ్లఁ
బుట్టినయది గోలె మెట్టి యెఱుఁగ. 678

క. రారాదు నాకు నచటికి
నే రాకుండఁగను గాదు నీహిత మందున్
బోరామి కలిగె నిందున
నారా" యన మాయి తపసి కారాయఁ డనెన్. 679

చ. "అలఘుమతుల్ సమాదృతిని నల్పులనే శిరసావహింం, త్రిలా
తలము తలన్ దుమారమును దాల్పదె; ఫేనము నబ్ధి తాల్పదే!,
మల తలఁదాల్పదే తృణము మాళిగ, నీ వటు నన్ భరింపఁగా
వలయును దీనబంధు! వెతఁ బాల్పడి నాకయి," యంచు మ్రొక్కినన్.

మ. తనకున్ లోఁబడె ధారుణీశుఁ డని యా దంభర్షి యిట్లాడె "నో
యనఘా! నీపనిఁ బూర్తిజేసెద నసాధ్యం బొండు లేదెందు నా
కొనరింపంగ మదుక్తి నిక్కువముగా నూహింపు న న్నీవెదం
దనువాజ్మానసశుద్ధి నమ్మితి వొరుల్ త్వాదృక్షులే యారయన్. 681

శా. ఈ మర్మం బెపు డాచరితు వపుడే యీ యోగయుక్తుల్ దపం
బీ మంత్రంబు ఫలించు, వంటకము లొం డెవ్వారికిం గానరా
కేమై వంటలు సొచ్చి వండెదనుగా కే నీవు వడ్డింపు నీ
చే మత్పాక మటుల్ భుజించిన నె నీచేఁ జిక్కియుం డ్రగ్రజుల్. 682

ఉ. వారును, వారివారి పరివారమువారును, వారి యిండ్ల నె
వ్వారు భుజింత్రు వారును భవద్వశు లయ్యెదరయ్య! యిట్టు లే
వారము నూఱువేల్ సపరివారులఁ బాఱులఁ బిల్చి పెట్టి య
వ్వారిగ నీవ్రతంబు నొక వత్సరమాత్రము నిర్వహింపుమా. 683

క. భోజనముల నేర్పరచెద
భూజాని భవద్వ్రతంబు ముగిసెడు దాకీ
యోజ ద్విజులు వశులైనను
జేజేలును విప్రసేవఁ జేపడువారల్. 684

చ. విను మొకఁ డుండె నీతపసివేషమునం జనరాదు కావునన్
జనపతి! నీపురోహితు వనంబునఁ దెచ్చి తపోబలంబునన్
ఘనమతి మత్సమానునిఁ బొనర్చి కుటిన్ నిలఁబెట్టి వత్సరం
బొనరుతు వానివేష మటు లూని పురిన్ భవదీయ కార్యమున్. 685

ఉ. రాత్రి గతించె నెంతయుఁ ద్వరన్ శయనింపు సమాగమంబు వా
రత్రయమం దగున్ మనకుఁ గ్రమ్మఱఁ బొఱని వాలకమ్మున
క్షత్రవతంస! యేకతమునన్ నినుఁ బిల్చి వచింతు నంత నిన్
జిత్రముగా సుషుప్తి నిలుజేర్తు నిదే కను మత్ప్రభావమున్.” 686

ఆ. అనుడు నృపుఁడు పండె నాపల్కులను నమ్మి
మునియుఁ గపటయోగ ముద్రఁదాల్చి
నొడలు మఱచి తేఁడు పడినపాటునె పండె
మాయకాఁడు కనులు మూయు నేడ. 687

సీ. మునిమోల కరుదెంచె మును సూకరాకారుఁ
డై నృపుఁ దెచ్చిన యసురుఁ డపుడు
కాలకేతుఁ డనెడు కపటర్షి మిత్రుఁడా
తండుఁ గైతవ మంత్రతంత్ర విదుఁడు
మును దన నూఱ్వురు తనయులుఁ దమ్ములుఁ
లోకభీకర దురాలోకను లయి
లోకాల నన్నిఁటిఁ జీఁకా కొనర్పఁగఁ
బోకార్చె రాకాసిమూఁక నప్పు

డీ మహీపతి యని యెద నక్కసూని య
క్కసిని దీర్చుకొనఁగఁ గపటమునినిఁ
గలసి మంత్ర తంత్రములఁ బన్ని నెన్నిని
యి వ్విధంబు నెఱుఁగ డింత నృపుఁడు. 688

క. అరిఁ దేజస్వి నలంతిగఁ
బరిమార్ప నుపేక్ష తగదు బడుగొకఁ డనుచున్
శిరసావశిష్టుఁ డయ్యును
హరిదశ్వేందులను రాహు వలయించుఁ గదా ! 689

మ. ముని రాత్రించరమిత్రు రాక కపు డామోదంబునన్ లేచి క్ర
న్ననఁ దోడ్తెచ్చి యుదంతముం దెలుప నానందించి వాఁడిట్లనెం
"జెనకం బోక మదుక్తి నీ పిడికిటం జిక్కించుకొం టీ వరిం
జని నిశ్చింతగఁ బండు కొమ్మికఁ జికిత్సల్ లేకె మాయుందెగుల్.

క. ఏటికి వగ పవళింపుము
నేటికి నాల్నాళ్లలోన నినుఁ గలియుదు శ
త్ర్వాటవి నెల్ల సమూలో
ద్ఘాటన మొనరించి" యంచుఁ దాపసవేషున్. 691

మ. పరితోషింపఁగఁజేసి రక్కసుఁడు భూపాలున్ హయోపేతుగాఁ
బురిలోఁజేర్చి హయంబు మందురను భూపున్ స్వీయ తల్పంబునన్
నిరపాయస్థితి నుంచి రాజగురు నన్వేషించి వానిన్ నిజా
సురమాయన్ హరియించి తెచ్చి వనికిం జొక్కించి విభ్రాంతుగన్.

క. దరినుంచి పురోహితునిన్
ధరియించి యవానిరూపుఁ దత్తల్పమునం
దొరగి శయింప నటించె న
సురుఁ డటు తెలవాఱకుండ క్షోణీపతియున్. 693

చ. కళవళమంది లేచి కనఁ గల్గితినెట్టు పురంబిటంచు లో
పల మునిశక్తిగాఁ దలఁచి పౌరు లటుల్ నడురేయి రాకకుం
గలకల మందకుండఁ జనెఁ గ్రమ్మఱఁ గానకు జక్కి నెక్కి తాఁ
దెలతెలవాఱకుండ నలదేవియుఁ గానదు రాకపోకడల్. 694

ఉ. అంతటఁ బ్రొద్దు మింటెనడు మంటుతఱిం బురికేగుదెంచె భూ
కాంతుఁడు స్వాగమంబునకుఁ గౌతుకముల్ బొనరింపఁ బౌరులు
న్వింతపురోహితుం గన వనిం గతయెల్లను జ్ఞప్తిఁ దోఁపఁగా
స్వాంతమునన్ దినత్రయము క్ష్మాపతి పుచ్చె యుగత్రయంబుగన్.

తే. అధిపుఁ డీగతి నుద్విగ్నుఁడైన యుక్త
వేళవచ్చి పురోహితవేషధారి
యగుచు నా ధూర్తుఁ డేకతమందుఁ గలిసి
తన్నెఱింగించి తెలిపెఁ గర్తవ్యసరణి. 696

చ. వసుమతి భర్తయున్ సపరివారులఁ బాఱుల నూఱువేపురన్
వెసఁ బిలువం బురోహితుఁడు వే దినుసుల్ దగ వండుచుండె ష
డ్రస సముపేతముల్ బలు తెఱంగులభోజ్యము లెన్నొ యన్నముల్
పసగల లేహ్యచోష్యముల భక్ష్యములన్ నిజమాయ మీఱఁగన్.

క. పలు మెకముల పలలంబులఁ
గలిపి కలిపి విప్రమాంసఖండంబుల నా
పలలాశి వండెఁ బాకముఁ
బలలమయము భూపపాపపరిపాక మనన్. 698

ఉ. భూసురకోటులం బిలిచి భూవరుఁ డంఘ్రులఁ గడ్గి వారలన్
వాసిగఁ గూరుచుండ నిడి వడ్డన సల్పుచునుండ మింట 'నో
భూసురులార ! యన్న మిది భూసురమాంస సమన్వితంబు సూ
మోస మి దారగింపకుఁడు ముట్టకుఁ డయ్య ! చనుండు ఘాం'డనన్.

తే. అని వినంబడు నా మినుమినుకు కులికి
పడి తటాలున లేచి రా పాఱు లెల్ల
రా నృపుండును బల్కఁ నోరాడకునికి
భావిగతిఁ గాంచు మోహవిభ్రాంతుఁ డగుచు. 700

శా. బ్రాహ్మణ్యంబు ప్రతాపభానుఁ గని యుగ్రక్రోధ తామ్రాక్షులై
"బ్రాహ్మణ్యం బగు ధర్మకర్మవితతిన్ భంజింప మా కీ గతిన్
బ్రాహ్మణ్యామిషమున్ భుజింప నిడుదే బ్రహ్మఘ్న! కాచెం బర
బ్రహ్మం బిప్పుడు గాని తక్కిన కులభ్రంశంబు సిద్ధింపదే. 701

క. పొమ్మిఁక రేద్రిమ్మరి వం
శమ్మున జన్మింపు స్వజన సహితుఁడవై నా
శమ్మగు దేడాదిని వం
శమ్మున నొకఁ డుండఁ బోఁడు జలముల విడువన్." 702

క. అని మనమున నణుమానము
ననుమానము లేక బాప లధిపు శపింపన్
మిను మినుకు మగుడ వినఁ బడె
'జనపతి నిర్దోషి నాడఁజను నె యి' టనుచున్. 703

ఆ. వింటి పలుకు లట్లు వినఁబడి నంతనె
చిత్రచకితులయిరి క్షితిసురులును
విప్రశాపదగ్ధ వికలుఁడై నృపుఁ డేగ
వంట యింటఁ గానఁ బడ దొకండు. 704

క. ఆ మాయావి పురోహితుఁ
డే మాయెను వంటకంబు లే మాయెనొ కా
కీ మాయ నెఱుఁగఁ డానృపుఁ
డే మాయను గనఁడు వంటయింటం జనియున్. 705

ఉ. భూపతి యప్పు డీ కథను భూసుర కోటికి విన్నవించుచున్
భూ పతితుండుగా నెడలఁ బొక్కుచుఁ బల్కిరి విప్రు లిట్లు 'మా
శాపము దారుణం బణఁప శక్యమె భావివిధంబు నీవు ని
ష్పాపి వదోషివైన నెటు బాపల శాపముఁ గ్రమ్మతింపనౌ.' 706

క. అని పలికి విప్రు లిండ్లకుఁ
జనినం బురవాసు లట్టి శాపవిధంబున్
విని విధిని దూఱుకొని 'శే
మనఁ గాక మొనర్చె రాజహంసము' ననుచున్. 707

ఉ. అంతటఁ గాలకేతుఁడు గృహమ్మునఁ జేర్చి పురోహితున్ నృపో
దంత మదంతయుం దెలుప దంభమహర్షికి శత్రుకోటికిన్
సంతస మంది యోడ్వడిన శత్రువు లెల్ల ప్రతాపభానుప్రో
లంతయు ముట్టడించి పటహంబులఁ గొట్టుచుఁ బిల్చె రాజికిన్. 708

ఉ. సాంగ సమాజులై విరియ శత్రు లతర్కితశాత్రవాగమం
బుంగొని యప్రయత్నుఁ డయి పోటు తనంబునఁ బోయి ఘోరమహా
సంగరకేళి సల్పి పలుజాడల నాప్తసహోదరాళితోఁ
ద్రుంగెఁ బ్రతాపభూపతియు భూపతితుం డయి విప్రశప్తుఁడై. 709

ఆ. సత్యకేతు కులము జలతర్పణ మొనర్ప
నొకఁడుఁ దక్కకుండ నుక్కడంగె
విప్రశాప మేల వృథ యౌను బృథివిని
బ్రహ్మవిదుల వాణి బ్రహ్మవాణి. 710

క. విధి విపరీతం బౌ తఱిఁ
బృథివిని ధూళియె సుమేరు పృథివీధ్రము దం
డధరుండౌ నల తండ్రియుఁ
బృథాకు వగుఁ గాదె రజ్జు పీడింపంగన్. 711

## రావణ కుంభకర్ణ జనన తపశ్చర్యాది వృత్తాంతము

సీ. ఆ ప్రతాపరవియు సాంగసమాజుఁడై
కాలగతిని దైత్యకాంతుఁ డగుచుఁ
బదిమోము లిరువదిబాహువు లొప్పార
జనియించె రావణుం డనెడు పేర
జన్మించెఁ దత్సహాజన్ముండు రిపుమర్ద
నుండును గుంభకర్ణుం డనంగ
ధర్మరుచిప్రధాని ధర్మపరుండు శ్రీ
విష్ణుభక్తుండౌ విభీషణుఁ డయి
రావణవిమాత కాజ్ఞానరాశి పుట్టె
నిట్టు పరివారమెల్లను బుట్టెఁ గ్రూర
దైత్యకులమున ఖలులు నిర్దయులు, గామ
రూపు లఘుమతుల్ విశ్వసంతాపకు లయి. 712

తే. విప్రశాపవశంబున వికలులగుటఁ
బరమపావనపౌలస్త్యవంశమందుఁ
బొడమినను వారు చెడుగులై కడఁగి ఘోర
నిష్ఠఁ దపియించి రప్పరమేష్ఠిఁ గూర్చి. 713

శా. ఘోరం బౌ తప మాచరించినఁ దదుద్ఘోషంబు వారింపఁగా
నీరేజాసనుఁ డేగుదెంచి తపముల్ నిండారె మీకోర్కి నిం
డారున్ వెండికఁ గోరుకొం డనినఁ బంక్త్యాస్యుం డనెన్ భక్తినిం
డారన్ మ్రొక్కిడి 'వానరుల్ నరులుఁగాకన్యుల్ మఱెవ్వారికిన్. 714

తే. నన్నసాధ్యు నవధ్యు నొనర్పు దేవ'
యనినఁ బరమేష్ఠి 'యేవమ'స్తని 'విరించి
యఁరుగుదెంచి ప్రసాదించి వరమునించె
నీతపోన్నతి నేమందు నిశిచరేశ.' 715

చ. అని ఘటకర్ణుఁ గన్గొని తదాకృతి కచ్చెరు వొంది నిచ్చలున్
దిన మఱఁగన్ జగంబుఁ గడతేర్చెడు వీ డని యెంచి వాణినిం
బనిచిన వాణి వానితలఁ బట్టి తలంపులఁ ద్రిప్పి మాంద్యమున్
మొనపుచుఁ గోరిపించె నిరుమూఁడు నెలల్ దనివోవు నిద్దురన్. 716

ఉ. అంత విభీషణాగ్రమున కబ్జజుఁ డేగి 'సుతా! యభీష్ట మే
మెంతువు నీ' వటన్నఁ 'బరమేశపదాంబురుహాత్తభక్తి వాం
ఛింతు'ననెన్ విభీషణుఁడు శ్రీహరిభక్తివిభూషణుండతం
డంత నదృశ్యుఁ డయ్యెను 'దథాస్తు'నుచుం జతురాస్యుఁ డాపయిన్.

ఉ. ఆదట మంత్రసిద్ధు లయి యయ్యనదమ్ములు నిల్లుసేర మం
దోదరి నాన్ నిజాత్మజను దోడ్కొని తెచ్చి మయుం డొసంగె శా
త్రోదరి విశ్వసుందరి వధూమణి నామెను రాణిగాఁ గొనెన్
మోదముతో దశాస్యుఁ డటు ముందు వివాహితు లైరి తమ్ములున్.

చ. కల దొకదుర్గ మబ్జభవకల్పిత మాచుఁ ద్రికూట మన్ గిరిన్
జలనిధి మధ్యమందు మయసజ్జితమై మణిరత్నరాజితం
బలఘు హిరణ్మయాకసమునై యమరావతినిన్ భుజంగ రా
ణ్ణిలయము నైన భోగవతినిం బురిడించుచు లంకపేరిటన్. 719

క. చుట్టును సింధువె కందక
మెట్టులు వర్ణింప నౌను హేమమయం బౌ
చుట్టుం గల ప్రాకారం
బట్టిపురం బెలుచుండె హరిప్రేరణచేన్. 720

క. ఒక్కొక యుగమున నొక్కొక
రక్కసియొకమీఁడు తత్పురంబున నుండున్
మిక్కిలి యుక్కలుఁ డగుచునుఁ
దక్కినబల ముక్కడించి దళసహితుండై. 721

క. అందుండు దనుజయోద్ధా
బృందంబులు రణము లందు బృందారకులం
గుందించు చుండ సురపతి
యందఱ ధనదార్థరక్షణార్థం బనిచెన్. 722

చ. దశముఖుఁ డయ్యుదంతము నదంత యెఱింగి చమూసమేతుఁడై
పశుపతిమిత్రు పట్టణముఁ బట్టె నొకమ్మడి యక్షులెల్ల భీ
వశు లయి పాఱి ర ద్ద్విజవైరియు నప్పురిఁజొచ్చి దుర్గమున్
వశమొనరించి చూచుకొని స్వాంతమునన్ ముదమంది యెంతయున్.

తే. దుర్గమది దుర్గమంబుగఁ దోఁప దాని
రాజధానిగఁ గైకొని రాక్షసులకుఁ
బంచి యిచ్చె యథాయోగ్యభవనములను
సుఖముగ వసింప లంక రక్షోగణంబు. 724

క. యక్షపతి యాన మొకపరి
రక్షఃపతి గెలిచి తెచ్చి రజతాద్రిని దా
నక్షీణబాహుబలముఁ బ
రీక్షింపఁగ ననఁగ నెత్తెఁ గ్రీడార్థముగన్. 725

క. నిచ్చలు జయప్రతాపము
లుచ్చైశ్వర్యములు సుఖము లూహాబలముల్
పెచ్చు సిరిసంతు లతనికి
హెచ్చెను లాభమున లాభమెచ్చిన మచ్చెం. 726

ఉ. తమ్ముఁడు కుంభకర్ణుఁ డొకడండిమగం డిఁక నీఁడు జోడు లే
దిమ్మహి వానికెందును శయించును మద్యముఁ ద్రావి యార్నెలల్
వమ్మగుఁ గాదె లోకములు వాఁడొకసేపు పరుండకున్న జ
న్యమ్ముల నెక్కటీఁ డొకఁడు నడ్డఁడు నొడ్డఁడు వాని కడ్డమై.

తే. మేఘనాదుఁడు సుతుఁడు భటౌఘమందుఁ
దొలుదొలుత లెక్కపెట్టఁగ వలయు వానిఁ
బోర నెదురింప నోప రెవ్వారలైన
సురపురిన్ గెల్చె బల్మాఱు శూరుఁ డతఁడు. 728

క. ధూమ్రమధ్వజుఁడు నకంపన
ధూమ్రేక్షణ వజ్రదంష్ట్రి దుర్ముఖు లను నా
తామ్రమధ్వజాతికాయను
తామ్రాక్షుల నొకఁడె మ్రింగఁ దగు జగమెల్లన్. 729

ఉ. అందఱు మాయకుల్ సుభటు లందఱు నందఱుఁ గామరూపులే
యందఱు సత్యశౌచసుదయాగుణదూరులు ధర్మదూరు లీ
చందపు దైత్యజాతు లనుజాతుల జ్ఞాతుల నాత్మజాతు లం
దందఱఁ గూడఁబెట్టుక దశాననుఁ డిట్లనె సాభిమానియై. 730

మ. "వినుఁడీ దానవయోధులార మనవిద్వేషుల్ నిలింపాగ్రణుల్
మనవారిం గని పాఱుచుండు రెదురై మాఱొడ్డి పోరాడ లే
కని వారింపఁగ వారి సాధన మొకం డాత్మన్ విచారించితే
నొనరింపన్ ద్విజభోజనాధ్వర తపోహోమాంతరాయంబులన్. 731

తే. అన్నపానీయముల్ లేక సన్నగిల్లి
పొగులు సురతతి మనదిక్కు మొగము వెట్టి
వచ్చి చేఁ జిక్కు శరణముఁ జొచ్చిరేని
మనుతు మటుగాక యొండేనిఁ దునుతు" మనుచు. 732

మ. దనుజానీకము యజ్ఞదానజపసత్కర్మాంతరాయార్థమం
పి నిజాత్మోద్భవు మేఘనాదు నటకుం బిల్పించి "యెమ్మె విప
క్ష నికాయంబున విద్విషానలము రాజం గొల్పి వేల్పుంగమిన్
మొనకాండ్రంచును వాసిఁగన్న భటులన్ మున్ముందు బంధింపుమా.

క. వడి నడు" మనఁ గొడు కొడఁబడి
వెడలుడు న య్యసురపతియు వెడలెఁ బుడమిఁ దా
నడు గిడు నెడ నడరం దన
పెడబొబ్బల సతులగర్భపిండము లవియన్. 734

శా. క్రోధోద్దీపితుఁడై చనంగఁ గని రక్షోనాథు, బృందారక
వ్యూథంబుల్ గిరికందరంబులకుఁ బర్వన్ రావణుం డంత ది
జ్నాథౌకంబుల నెల్లఁ దిర్గి యవి శూన్యంబైన సం కూడుచున్
శోధించెం, బ్రతివీరుఁ దూఱె సురలం జొచ్చెన్ మదోన్మత్తుఁడై. 735

శా. వెన్నంటెన్ వరుణేంద్రరుద్రయమరాడ్విత్తేశ వాయ్వగ్నులన్
వెన్నాడెన్ సురసిద్ధ సాధ్యనరులన్ వే యేటి కాతండు యా
వన్నారీనరదేహధారులను దా స్వాధీనులం గాఁ గొనెన్
మన్నింపం దలఁదాల్చి వారు తనయానం గేలుజోడించుచున్. 736

ఉ. వెండియు నా దశాననుఁడు విశ్వము నెల్ల వశీకరించి భూ
మండలసార్వభౌముఁ డయి మార్కొనఁ దన్నెదు రొండులేక దో
ర్దండ బలంబునన్ దివిజ దానవకిన్నర నాగకన్యలం
బెండిలి యాడె గెల్చుకొని పోరున నెన్నికఁగన్న కన్నెలన్.

తే. మేఘనాదునిఁ బిత యే నిమిత్తమునకు
నంపె నయ్యది పంపినయంత జరిగెఁ
దక్కఁగల రక్కసి గమి నల్ దిక్కులఁజనె
దనుజపతి యంప జగదుపద్రవమున కయి. 738

క. పాపులునుం ద్రిభువనపరి
తాపకులుం గామరూప ధారులు నౌచున్
రూపుల నెన్నియొ తాల్చి మ
హోపద్రవముల్ బొనర్చి రురుతరమాయన్. 739

క. కూల్చిరి శ్రుతిసేతువులం
గాల్చిరి బాపలును బసులు గల యూళ్లెల్లన్
జీల్చిరి మొదలింట ధర్మము
నిల్చిరి సత్కర్మనాశనీరూపకులై. 740

క. ఆలింపరు శ్రుతి గురు ద్విజుఁ
బాలింపరు శ్రుతిపురాణభాషణముల ని
ర్మూలింత్రు ధర్మ మందున
గాలింపను లేవు ధర్మకర్మము లెందున్. 741

మ. జపముల్ యోగవిరాగ యాగతపముల్ స్వాధ్యాయముల్ పాఱె దై
త్యపతిన్ వీనుల విన్న యంత ఖలుఁ డీతం డంత మొందించు నం
చపుడే పాఱెను సర్వధర్మములు భ్రష్టాచార మయ్యెన్ జగం
బుపరోధించుచుఁ దోల దేశమున శ్రుత్యుక్తాచ్ఛ ధర్మంబులన్. 742

క. ఏ తీరున వర్ణింతును
దైతేయవినీతి దుష్కృతంబుల నిచ్చో
నే తీరున హింసారత
చేతస్కుల పాపములకు సీమయు నుండున్ ? 743

ఉ. హెచ్చిరి కుచ్చితుల్ పరధనేషణులుం బరకామినీరతుల్
హెచ్చిరి జూదరుల్ ఖలులు హెచ్చిరి సాధులఁ జాకిరీలకై
బుచ్చిరి ముచ్చుమూఁక, సురభూసురమాతృపితాదరంబుఁ బోఁ
బుచ్చిరి, యిట్టి దుష్కృతులె పో యసురుల్ కులమెట్టిదైననేన్. 744

## భూమి గోరూపమున బ్రహ్మాదులకడ కేగి మొఱపెట్టుట

ఉ. ఈ గతి ధర్మహానిఁ గని యెంతయుఁ బొక్కుచు భూతధాత్రి లో
నీ గిరు లీ సముద్రము లి వీ నదు లింత భరంబుగావు నా
కా గతి విశ్వతాపకుల యట్లు జనంబు లధర్మకర్ములై
రే గతి నోపుదాన నని యెంచి భయాకులచిత్తయై కడున్. 745

శా. గోరూపంబు ధరించి భూమి దివిషద్యూటంబునం జొచ్చి లో
నారాటం బెడఁగించి కుయ్యిడినఁ గుయ్యాలించి యం దొక్కరున్
వారింపం జన కా మెపాటు వెతలన్ వాపోవు నాయమ్మతో
వారెల్లం జని రబ్జయోనిఁ గనుఁగో వారింప భూతాపమున్. 746

ఉ. అంతట వారినుండి చతురాస్యుఁ డుదంత మదంత వించు న
త్యంత మసాధ్యమంచు హరి నాత్మఁ దలంచి వచించె నూఱటన్
"చింతిలె దేల దేవి ! భువి జీవుల నెల్లర నిన్ను నన్ను స
ర్వాంత రుపాంతవర్తియయి, యాధు లడంచు కృపాళుఁ డుండఁగన్.

క. దిక్కెవరు నీకు నాకును,
దిక్కెవ్వరు భూతసంతతికి నాహరియే
దిక్కయి యుండఁగఁ బొక్కుచు
నిక్కరణిఁ దపింపనేల యెద వగఁగూరన్." 748

ఉ. అంచు విరించి పల్క సురలందఱు శ్రీహరినొందుఁ గంద మిం
దంచును నిందునం బిలుత మంచుఁ బయోధి శయించుఁ బోద మం
దంచు వికుంఠమందుఁ గలఁ డంచు నెవం డెటు భక్తియుక్తుఁడై
యెంచునో వాని కట్లు కన నేర్పడు నంచును వేఱువేఱుగన్. 749

మ. ఒకఁ డొక్కం డిటు పల్కుచుండ దివిషద్వ్యూహంబునం దుండి యిం
చుకవేళం గని యిట్లు లంటి నుమ, యెచ్చో శౌరిలేకుండు ? నె
ట్లాకరీతిన్ జెలువారు భక్తిమెయిఁ బ్రాదుర్భూతుఁడౌ నెల్లెడన్
సకలాత్ముండు చరాచరాత్ముఁడగుఁ గాష్ఠస్థాగ్ని చందంబునన్. 750

తే. అందులకు నంద! తానంద మంది రందు
నావిరించియు 'బళిబళీ' యంచుఁ బొగడి
హర్ష పులకితతనుఁడు బాష్పాంబు పూరి
తాక్షుఁడై దోయిలించి యిట్లని నుతించె.

సీ. "జయ సచ్చిదానంద! జయ శ్రితమునిబృంద
యిందిరాహృదయారవిందభృంగ!
జయ సర్వసుందర! సద్గుణమందిర!
భవవార్ధిమందర! భవ! ముకుంద!
జయ సురనాయక! జనసుఖదాయక!
సౌఖ్యసంధాయక! చారుకాయ!
జయ శ్రుతిశేషభాషా దేవ్య శేషర్షి
శేముషీభాషణాచింత్యరూప!
జయ జయ పునీత గోతీత! సద్వినీత!
సర్వఘటవాసి! క్షయవినాశి! సౌఖ్యరాశి
గోద్విజ హితైషి! సురపోషి! కుజనశోషి!
మా మొఱాలించి పాలింపవే మహాత్మ!

సీ. ఎవఁ డనన్యసహాయుఁ డీ సృష్టివిధి నెంచె
ధ్యానింత్రు రేబగ లేనిఁ బాడి
యెవనికయి విరక్తుఁడే యనురక్తుఁడౌ
యోగులేని వియోగ మోపఁజాల
రే చిత్రచారిత్రు నెవ్వా రెఱుంగరు
భూతధాత్రీ సురత్రాత యెవఁడు
భవభయభంజనుం డెవఁడు మునిజన మ
నోరంజనుం డసురారి యెవ్వఁ

డట్టి దీనదయాళు దయాలవాలు
జోతఁ జేతుము సురలము చేతు లొగ్గి
తనుమనశ్శుద్ధి నేర్పరితనము లుడిగి
శరణు జొచ్చితిమయ్య! రక్షణముకొఱకు. 753

తే. భక్తియుక్తుల పూజలపస యెఱుఁగము
చింతఁ బాపఁగదే యసురాంతక!" యని
పుడమియును వేల్పు లీగతిఁ బొగులుచుండ
వినఁబడియె మింట నొకపల్కు వనట వాయ. 754

శ్రీహరి ప్రసన్నుఁడై భూదేవి నూఱడించుట

క. "జడియకుఁడి వేల్పుజోదులు
జడియకుమా పుడమి! యేను సాంశుఁడనోచుం
బొడమెద భవదర్థ మిపుడ
పుడమిని నరదేహ మూని పూషకులమునన్. 755

చ. అదితియుఁ గశ్యపుండును మహత్తపముం బొనరింప వారికే
న్ముదితుఁడనై వరం బిడి తనూజుఁడఁగా నియకొంటి వారలుం
బదపడి కోసలేశసుత పంక్తిరథుండును నై జనించి శే
నొదవెద నాల్గురూపముల నూని యినాన్వయ మందు వారికిన్. 756

మ. జనియింతున్ నిజశక్తితో మునినుడిన్ సార్థంబుగాఁ జేతు ని
మ్మును నిర్భీకులఁ జేతు క్ష్మాతలభరమ్ముం డింతు రక్షింతు" నా
మినుమిన్కుల్ విని వేల్పు లుబ్బి రట నెమ్మిం దమ్మిపూఁజూలి మే
దిని నోదార్చి సురాళిఁ గాంచి 'కపులై దేవున్ భజింపుం' డనెన్. 757

తే. అనుచు వేంచేసె సురలోకమున కజుండు
వేల్పులుం జనిరి నిజనివేశములకు
శ్రాంతధాత్రియు నేగి విశ్రాంతిఁ జెందె
నంత విధియాజ్ఞఁ దలఁ దాల్చి యమరతతియు. 758

ఉ. వానరయోనిఁ బుట్టి యనివార్యభుజాక్రమవిక్రమంబులం
బూని భువిం జరించుచును బూని ద్రుమాద్రినఖాయుధంబులం
గానల గుట్టమెట్టలను గాచుక గుంపులుగూడి దేవతా
యోనులు వార లెల్ల పురుషోత్తము రాకకు వేచియుండిరిన్. 759

## దశరథరాజ చరిత్రము - పుత్రకామేష్టి

మ. అతిరమ్యంబు శుభావహం బినకులోపాఖ్యాన మాలింపుమా!
శ్రుతివిఖ్యాతుఁడు ధర్మమర్మవిదుఁడున్ సుజ్ఞానియున్ భక్తిపూ
రితచిత్తుండు గుణాలయుండు రఘుధాత్రీనేతృగోత్రంబునన్
రతనం బౌచు నయోధ్య నా దశరథ ప్రఖ్యాతుఁ డేలెన్ దగన్. 760

క. సతులు కలరు ముగు రతనికి
క్షితిఁ గౌసల్యయు సుమిత్ర కేకయసుత నా
సతులు సదాచరణ రతలుఁ
బతిభక్తి వినీతలు హరిభక్తిపునీతల్. 761

చ. కొడుకులు కల్గరై రనుచుఁ గుందుచుఁ గీడ్వడి యొక్కనాఁట నా
యొడయఁడు నవ్వసిష్ఠముని యొద్దకునేగి తదంఘ్రు లంటి మేల్
నుడువుల నొజ్జకున్ నిజమనోవ్యధహేతువు విన్నవింపఁగా
నొడయని కూఱటం బలికి యొజ్జ యనెం గడుణార్ద్రచిత్తుఁడై. 762

తే. "సుతులు నలువురు భువిని విశ్రుతులు నతుల
బలసమన్వితు లాశ్రిత భయవిదారు
లొదవెదరు నీకు నగవకు మోయి ఱేఁడ"
అనుచు నాతఁడు దశరథావనిపుచేత, 763

ఉ. అర్థిని ఋష్యశృంగముని నయ్యెడకుం బిలిపించి పుత్రకా
మార్థ మొనర్పఁ జేసె నొకయాగము ఋత్విజులున్ నృపార్థ సి
ద్ధ్యర్థము వేల్మి వేల్చి హుతాశనుఁ దన్పినఁ దచ్చరుప్రదా
నార్థము యజ్ఞపూరుషుఁడు హస్తములం జరుపాత్ర మూనుచున్.

తే. అగ్ని కుండంబునం బుట్టి యజ్ఞపురుషుఁ
డాదటం బల్కె "హృష్టుఁడ నైతిఁ జుమ్ము
దశరథేశ్వర ! సిద్ధించెఁ ద్వన్మనోర
థములును కులగురు వసిష్ఠు తలఁపు లెల్ల. 765

ఆ. పంచి యిమ్ము నీదు భార్యలకిది యథా
యోగ్యముగ" నని చరువొసఁగి ప్రీతి
నగ్ని దేవుఁ డంత నంతర్హితుం డయ్యె
నంతఁ గనని హర్ష మందె నృపుఁడు. 766

శా. అర్థిం బంక్తిరథుండు పత్నులను రా నంపించి యాహవ్య మం
దర్ధాంశం బిడి కోసలాత్మజకు శిష్టార్థాంశ మం దర్ధ మ
త్యర్థప్రీతి నొసంగి కైకకు సుమిత్రాదేవి కిప్పించె శి
ష్టార్థం బట్టిరుపాళ్లుగాఁ గయికచే నందించి కౌసల్యచే. 767

ఉ. ఇట్టులు పాయసంబు భుజియించిన కొంతకుఁ జూలు దాల్చి యా
పట్టపుదేని రాణు లొకపట్టున శోభయు శీలతేజముల్
మెట్టె ననంగఁ గన్నడిరి మేడల, శ్రీహరి గర్భమందు నె
ప్పట్టున మెట్టె నాదినమె పర్వె జగంబుల సర్వసంపదల్. 768

# శ్రీ రా మ జ న న ము

చ. కడచినఁ గొన్నినాళ్లిటు సుఖమ్మున హర్యవతారవేళయున్
వడి చనుదెంచె నంత గ్రహవారము, వారము, లగ్నయోగముల్
కడు ననుకూల మయ్యెను సుఖంబునఁ బొల్చెఁ జరాచరాళి ప్రా
మిడి విడి చైత్రశుద్ధనవమి న్నభిజిత్సుముహూర్త మేర్పడన్. 769

సీ. చల్లగ మెల్లగఁ బిల్లతెమ్మెర వీచె,
నుల్లసిల్లి రహెల్ల రెల్లెడలను,
దరు లెల్ల పుష్పించె గిరులు మణులమించె,
ప్రాదినుల్ ప్రవహించె నమృతవారి,
సాధుసజ్జనులకు సర్వగీర్వాణుల
కుల్లముల్ చల్లనై యుల్లసిల్లె,
మింటినడుమునంటె మింటిమాణికమును,
శీతోష్ణముల్ తగురీతి నుండె,
శ్రీహరియవతార మూహించి బ్రహ్మాది
దేవతాగణ మరుదెంచి హరిని
నాడి రచ్చరలును బాడిరి కిన్నరుల్
మురియుచు విరివానఁ గురియు చెలమి. 770

క. మ్రోయించుచు దుందుభి స్తుతిఁ
జేయుచు గర్భస్థశిశుని శ్రీదేవేశున్
బోయిరి నెలవులకును సుర
లా యెడ నావిర్భవించె హరి కౌసల్యన్. 771

తే. ఇటుల నవతరించు హరిఁ బ్రకటితరూపుఁ
దెలిసి దేవాదిదేవుని దివ్యరూపు
శంఖచక్రగదాపద్మసజ్జితభుజు
మునిమనోజ్ఞాకృతిన్ బాలుఁ గనులఁ గాంచి. 772

సీ. మునిమనోవిశ్రాము ఘననీరదశ్యాము
నయనాభిరాము దుర్ణయవిరాము
భూషిత వనమాలుఁ బోషితసురజాలు
నయనవిశాలు ఘృణావిశాలు
సారసలోచను సంసారమోచను
సౌందర్య రోచను సత్యవచను
భూషితస్వాయుధు, భుజచతుష్టయభూషు
నద్భుతవేషు, దయావిశేషుఁ
గాంచి తలవాంచి మేన రోమాంచ మలరఁ
బలికెఁ గౌసల్యసాధ్వి యంజలి ఘటించి
కన్నబిడ్డను గని "నను గన్నతండ్రి
యెట్లు స్తుతియింపనేర్తు నిన్నే ననంత. 773

తే. సద్గుణసముద్ర! నిర్నిద్ర! జ్ఞానముద్ర!
జ్ఞానమాయాగుణాతీత! సద్వినీత!
యుద్భవించితె తండ్రి! నన్నుద్ధరింప
వరకృపాస్వాంత! శ్రీకాంత! సురనియంత. 774

క. మెండగు బ్రహ్మాండంబులె
యుండును నీ రోమకోటి నొదిగి యని శ్రుతుల్
గొండాడు నట్టి నీ విటు
లుండుట నాగర్భ మొదిగి యుపహాసమె కా. 775

ఉ. ధీరులచిత్తమే కలఁగు దీని వినంగ" ననంగఁ దల్లి జ్ఞా
నారభటిం గనుంగొని మహాచరితుం డగుగాన బాలుఁ డిం
పారఁగ సస్మితాస్యుఁ డయి యాదికథావిధ మెల్ల తల్లికిన్
గారము పుట్టు నట్టు పలుకన్ జనయిత్రి ప్రహృష్ట చిత్తయై. 776

ఉ. 'పాపఁడవై చరింపుము కృపాపర పాపుము దివ్యరూపముం
బాపని యాటపాట లగపట్టు టదే యపురూపమా' ననం
బాపని రూప మూని సురపాలుఁడు రోదనమున్ నటించె సం
తాప మడంగి శ్రీహరిపదం బొడగూడుఁ బఠింప నీకథన్. 777

క. భూసుర భూ సుర గోహిత
మే సతతము సేయఁ గోరి స్వేచ్ఛాతనుఁడై
యా సర్వాత్ముఁడు శ్రీహరి
వాసిగ నరదేహమూని వసుధ జనించెన్. 778

చ. పదపడి రాణు లెల్లరును బర్విడి వచ్చిరి సంబరాన, న
య్యదనున బిడ్డఁ డేడ్వవిని, హర్ష వశంబున దాదు లెల్ల త
త్తదుచిత కార్య మగ్నత నతంద్రత నుండిరి పుత్రజన్మమున్
ముదమున నాలకించి నృపముఖ్యుఁడు మైమఱ పొప్పఁ బ్రేముడిన్.

శా. 'యన్నామంబు వినంగ నిచ్చలును గల్యాణంబు సేకూరు శ్రీ
మన్నారాయణుఁ డాదిమూర్తి యతఁడే మాయింట జన్మించి నాఁ
డన్నా! భాగ్యము నే మనందు' నని బ్రహ్మానంద మగ్నాత్ముఁ డై
మన్నీఁ డంతట బ్రాహ్మణోత్తముల సంభావింపఁ బిల్పించినన్. 780

క. వచ్చి పురవాసు లెల్లరుఁ
జొచ్చిరి నృపప్రాంగణంబు క్షోణీసురులుం
జొచ్చి రటేమని చెప్పుదు
నచ్చిఱుతని రూపరేఖ లాకారంబున్. 781

మ. ద్విజు లేతెంచిన జాతకర్మమును నాందీకర్మముం జేసి త
ద్విజవారంబున కిచ్చె రాజు పసులన్ వెండిం బసిండిం గడున్
ధ్వజముల్ తోరణముల్ జెలంగె పురి నంతం బూలు వర్షించె నా
యజసృష్టిం బురుడింపఁగా సలుపఁగా నత్యంత శృంగారమున్. 782

క. పొంగుచుఁ బాటలఁ బాడుచు
సింగారము లూని చనిరి శృంగారవతుల్
బంగారుపళ్లెరంబుల
మంగళహారతులఁ దాల్చి క్ష్మాపతిగృహమున్. 783

ఆ. ఆ శిశుస్వరూపుఁ డౌ రఘూత్తము నంఘ్రు
లంటి మచ్చికంటు లారతు లిడి
దిగదుడిచి రటంత దృగ్దోషములు బాయ
వందిమాగధనుతి పాఠ మెసఁగ. 784

ఉ. అందఱు దానముల్ సలిపి రందిన వందిన యట్లు వస్తువుల్
సందడి సందడించెను బజారులఁ జందనకుంకుమాగరుల్
జిందఁగఁ జేసి పంకిలముఁ జేసి ర టందఱు మందిరంబులన్
విందులఁ జేసికొందు రరవిందదళాక్షుఁడు పుట్టెనం చొగిన్. 785

శా. ఇంటింటన్ శుభవాద్యముల్ మొరసె నెంతే సమ్మదోత్కంఠమై
కంటం గన్పడె నందు స్త్రీపురుషసంఘాతంబు లవ్వేళ నా
వెంటం గైకకుమారు నొక్కరుని య వ్వెన్కన్ సుమిత్రాంబయున్
జంటం గాంచెను బుత్రులన్ బలజిద్గోత్సన్నద్విషద్గోత్రులన్. 786

క. చిన్నారి దొరను గనుఁగొన
న న్నిశయుం బెందలాడ నరుదెంచెనొ నా
న న్నగరిఁ బ్రొద్దుపోకకు
మున్నే రేచిన్నెలన్ని మొగిఁ గనుపట్టెన్. 787

మ. బుడుతం గన్గొన రేయి పట్టపవటం బ్రొద్దుండనే సొచ్చె నాన్,
బొడకట్టెం బురి సాంధ్యశోభ, కపురంపుం దావిదూపంబులే
కడిఁదిం జీకఁటు లౌచుఁ జల్లుకొను బుక్కా సంజకెంజాయనై
యుడురాజై నృపసౌధహేమఘట మా జ్యోతిస్తతుల్ చుక్కలై. 788

ఆ. వేదపఠనరవము విహగకలరవమై
కానివేళ సంజ కానరాఁగ
నిట్టి కౌతుకముల నీక్షించు చా రవి
కాలగతిని మఱచి కదలఁ డయ్యె. 789

శా. ఆ సాకేతపురాంబరంబున నినుం డా రామజన్మోత్సవ
శ్రీసందర్శనలీల నిండునెల నిల్చెం గాని యా సందడిన్
మాసంబంతయు నేకవాసరముగా మన్నించిరే కాని లో
వీసంబుం గనిపెట్టరైరి ప్రజ వేవెల్గాగు నాచందమున్. 790

క. తనివోవ బాలరాముని
గనులారం గాంచి వేల్పుగములుం బొద్దుం
జనె నిజభాగ్యము లెంచుచుఁ
జనుదురె పురభాగ్యమెంచ శతవాక్శేషుల్. 791

ఉ. నా దొకవింతచెయ్దము దనర్చె నదే వినిపింతు విన్మొగిన్
భేద మెఱుంగకుండఁగను నే నల గాకభుశుండిఁ గూడి యా
మోదము మీఱఁ దాల్చి నరమూర్తుల నా పురి నంతఁ దిర్గుచో
నా దరి మాదుభేద మొకరైనఁ బురిం గనుపెట్ట రైరి చూ. 792

క. అందందం దిరుగుచు నా
నంద నిమగ్నులము నగుచు నగరమునన్ మే
మం దుండఁ గాన రెవ రీ
చంద మెఱుఁగు రామకృపకుఁ జాలినవాఁడే. 793

ఉ. అందుల కేగి నట్టి జను లందఱ కందు నరేంద్రచంద్రుఁ డా
నందము సందడింప హయనాగరథాదుల స్వర్ణ రూప్య గో
బృందముఁ దత్త దిచ్ఛల నెఱింగి యొసంగ, నొసంగి రంత వా
రందఱు నందనుల్ గడుఁ జిరాయులు గావుత మంచు దీవనల్. 794

దశరథుఁడు పుత్రులకు నామకరణము లొనర్చుట

ఉ. అట్టులు లేవగల్లెఁగ నట్టులె కొన్ని దినంబు లేగ నా
పట్టెల పేరు పెట్టుటకుఁ బట్టపుతేఁ డదనైన పట్టుఁగ
న్పెట్టి వసిష్ఠమౌనిఁ బిలిపించి సమర్చ లొనర్చి 'దేవ! మా
పట్టెల కర్హనామముల భద్రమతిం దలపోసి పెట్టుఁడీ.' 795

చ. అనుఁడు గురుం డనెన్ "నరవరాగ్రణి! నీదు కొమాళ్ల కెన్నియే
ననుపమ నామముల్ గలుగు నైన యథామతి విన్నవింతు నే
వినుము త్రిలోకవాసి వరవేషి మహాసుఖరాశియున్ జనా
వనుఁడును లోకసౌఖ్యదుఁ డెవం డతఁడీ తఁడు రామనాముఁడౌ. 796

చ. భరణముఁ బోషణంబు సలుపన్ జగమున్ భరతాఖ్యుఁ డౌ నితం
డరులు నశింతు రేనితలఁ పారిన నాతఁడు శత్రుహంతయా
సిరులకుఁ బట్టుగొమ్మ భువి జీవజగత్తున కూఁతగొమ్మయై
తిరముగ రామభద్రున కతిప్రియుఁ డౌ నిదె లక్ష్మణాఖ్యుఁడౌ." 797

తే. అని కులగురుండు తత్తదర్హాఖ్యలుంచి
అనియె "శ్రుతితత్త్వముల్ నీదు ననుఁగుసుతులు
బాలలీలావిలోలుఁడౌ భవుని ప్రాణ
ములును భక్తసర్వస్వముల్ మునిధనములు." 798

ఉ. చిన్నతనంబు నుండి ప్రభుసేవక భావమునన్ రఘూద్వహుల్
మన్నన సల్పుకొంచుఁ గడుమచ్చిక నుండిరి రామలక్ష్మణుల్
సన్నయ శీలు రా భరత శత్రువిఘాతులు శ్యామగౌరు లా
యన్నను దమ్ములం గని తృణాళినిద్రుంత్రు దృగంహాసుల్ విడన్. 799

చ. నలువురు సుందరుల్ గుణులు నల్వురు రూపసుశీలధాము లా
నలువురఁ జెన్ను మీఱు రఘునాథుఁడు రాముఁడు సర్వదా మదిన్
వెలువడు సత్కృపాత్మ మగు వెన్నెల నా స్మితరూపభానువుల్
చెలువుగఁ దెల్పఁగా జననిచేతులఁ దొట్టెలఁ బెట్టి ముద్దిడన్. 800

క. చిక్కఁడు మాయాగుణములఁ
జిక్కఁడు సుఖదుఃఖములను జింతలలోనం
జిక్కం డట్టి యజుం డిటఁ
జిక్కెను గౌసల్యయొడిని స్నేహవశుండై. 801

సీ. కోటికామాకృతి దీటగు తను శోభ
ఘనఘనేందీవరకాంతి మీఱ
నరుణచరణపద్మకరముల నఖకాంతి
యబ్జదళముల ముక్తాభఁ దోఁప
వజ్రాంకుశధ్వజ ప్రముఖరేఖలు గ్రాల
నందెలచప్పుళ్లు సందడింప
మువ్వల మొలత్రాడు మొల వళిత్రయమును
గంభీరనాభియుఁ గాంతు లీన
భూషణవిభూషితాయత భుజము లెదను
హారినఖంబుల పతకంబు హారములును
విప్రపదచిహ్న మలరారు విధ మదెల్లఁ
గనవలయుఁ గాని తచ్ఛోభ కాదు తెలుప. 802

ఉ. సుందరకంబుకంఠమును సూనశరాభ నెసంగు మోముసొ
రం దరుణాధరోష్ఠరుచి నందము మీఱెడు నా రదచ్ఛవిన్
సుందరనాసికా శ్రవణశోభను జారుకపోలపాళి నా
పొందగు చిల్కపల్కులను భూమి నెవండు నుతింపనేర్చెడున్. 803

శా. ఆ నీలాబ్జదళాయతాక్షుల విధం బా భ్రూకుటిచ్ఛాయసౌ
రా నీలచ్ఛవి మీఱు వేనలిపసం దా రూపరేఖాదు లా
జానుల్ మోపుచు దోగులాడు సొగ సా సౌందర్యమున్ స్వప్నమం
దేనిం గాంచినఁ గాక వాకొనఁగలారే శేషభాషాదులున్ 804

మ. సుఖసందోహుఁడు మోహదూరుఁ డవినాశుం డింద్రియాతీతుఁడై
యఖిలార్థంబు లొసంగ భక్తులకుఁ బ్రేమాయత్తుఁడై లీల లం
దఖిలంబుం గనుపింపఁ జేసెఁ బితృమాత్రాదుల్ తమిం గన్గొనన్
సఖ! శ్రీరామపదానురాగులకె యా చందం బెఱుంగం దగున్. 805

చ. సకలచరాచరాత్ములఁ వశం బొనరించెడు మాయ నెవ్వఁ డా
భ్రుకుటివిలాసమాత్రమునఁ బోలు నటింపఁగఁ జేయ నావిభున్
వికచదళాక్షురాఘవుని వీడి తదన్యులఁ గొల్తువేల యె
న్నక రఘువీరు కోటిజతనంబులనైనను ముక్తిఁ గాంతువే. 806

తే. తనుమనశ్శుద్ధి నేర్పరితనము లుడిగి
కోరి సేవింపఁ గృపఁజూపు నా రఘుపతి
బాలలీలావినోదముల్ చాలఁ జూపెఁ
గనెడు పౌరుల కన్నుల కఱవుదీర. 807

క. పుత్రప్రేమవశంబున
రాత్రియుఁ బవ లెఱుఁగ రయిరి రాణులు తమ స
త్పుత్రుల లీలాభాషణ
చిత్రములం జెప్పుకొనుచుఁ జెలు వలరారన్. 808

క. ఎక్కడు మక్కువ నెక్కొన
నొక్కపరిం గోసలేయ యొడి నిడు సుతు నం
దొక్కపరి ముద్దుఁగొను వే
ఱొక్కొకతఱిఁ దొట్టిఁబెట్టి యూఁచును బట్టిన్. 809

చ. ఒకపరిఁ గోసలాత్మజ రఘూద్వహునిన్ జలకంబు లార్చి డో
లికను బరుండఁ బెట్టి పపళించినపై నిలువేల్పు గొల్చుచుం
ద్రికరణశుద్ధిఁ బాయసము దేవనివేదన మాచరించి య
ర్భకు నటు వోయి కన్గొనియెఁ బాయసముం దమి జుబ్బుచుండఁగన్.

ఉ. అట్టి యెడన్ విచిత్రమున కాత్రము నొంది బిరానఁ బర్వి యా
తొట్టెఁ బరున్న పట్టిఁగని తోడనె కన్గొని చిట్టి పొట్టకుం
బట్టిన పాసెముం గుడుచు వాని వణంకుచు 'నిందునందుఁ గ
న్పట్టుదు రిర్వు రెట్టు లొకపట్టున వింతయొ లోని భ్రాంతియో.' 811

ఆ. అనుచు విస్మయపడు నా తల్లిగతిఁ గాంచి
మొగమునందు మొలక నగవు తోఁప
నిసువు చూపె నపుడు నిజవిశ్వరూపంబు
నలర రోమముల నజాండపంక్తి. 812

శా. అంతం గన్గొనెఁ గోసలేశసుత పుత్రాస్యంబునన్ భూమిభృ
త్కాంతార క్షితి సింధులన్ రవి శశాంక బ్రహ్మ శర్వాళి నం
తంతన్ భీతిని జేతు లొగ్గుకొను మాయన్ మాయ కాధీనుఁడౌ
భ్రాంతాత్ముం డగు జీవునిన్ భ్రమముఁ జిత్రం బొత్తరింపన్ మదిన్.'

ఉ. కాంచెను గాలకర్మములఁ గాంచె గుణంబు స్వభావ మందునం
గాంచెను జీవమాయలను గాంచెను గాంచనగర్భముఖ్యులం
గాంచెను జీవు మాయ యను కట్టెడ బాపుచుఁ బ్రోచు భక్తినిం
గాంచెను మున్నె వండుఁ బొడగాంచి యెఱుంగని చిత్రజాలమున్. 814

తే. ఇట్లు పొడగాంచి రోమాంచ మెనయ మేనఁ
గన్నుగవ మూసి గద్గదకంఠి యగుచు
నుడులు తడఁబడ నోరాడ కడుగులఁ బడఁ
బాపఁ డయ్యెను విశ్వరూపమును బాసి. 815

మ. స్తుతియించెన్ శిశురూపుఁ డైనహరిఁ బుత్రుం డంచు భావించుచుం
'బితవీ వెల్లజగాల కంచు మది భావింపంగ లేకే నినున్
సుతుఁ డం చెంచితి విశ్వరూప !' యని కేల్జోడించు చాయమ్మ యీ
గతిఁ బల్కెన్ 'విభు!నీదు మాయ యిఁకఁ దాఁకంబోదు కాకెప్డు నన్.'

తే. అని యిటు నుతించు జననియుఁ త్రి నఖిలవిధులఁ
దెలియఁ బలుకుచు బాలలీలలను జూపె
నందుఁ బౌరుల కానంద మావహిల్ల
రాముఁ డెదిగెను నయనాభిరాముఁ డగుచు. 817

క. అంతం జూడాకరణము
సంతసమునఁ జేసి ద్విజుల సద్దక్షిణలన్
సంతసపెట్టెను తేఁ డ
త్యంతమనోహరచరిత్ర నాత్మజు లలరన్. 818

క. డెందానకు వాకునకే
నందని యావిభుఁడు దశరథాంగణ మందుం
జిందాడె శ్రుతుల కందని
కందఁట యడ్డాలబిడ్డ కౌసల్య కిలన్. 819

శా. 'రారా! తండ్రి!' యటంచుఁ దండ్రి నెనరానన్ బువ్వఁ దిన్పింపఁగాఁ
జేరం బిల్చిన సంగ డీండ్ర విడి రాఁ జిత్తంబు రా కాటకై
పాఱం దల్లి కవించి పట్టుకొనె నాబ్రహ్మేశులున్ బ్రహ్మముల్
బారం బొందని బ్రహ్మరూపు శిశు బాపండంచు భావించుచున్. 820

చ. ఒకపరిఁ గూడుఁ దించుఁ బెఱు వోరెము మూతిని బ్రాముకన్ వికా
వికనగి పర్వులెత్తి, యొకవేళను దుమ్మునఁ దోఁగి యాడి యిం
కొకపరి గంతు వైచి, నృపుఁ డుత్సుకుఁడై యొడిఁ జేర్చుకోఁ గకుత్
స్థ కులకిశోరుఁ డిట్లు తలిదండ్రులఁ దన్పెను బాలలీలలన్. 821

క. ఆ రఘుపతి శైశవలీ
లారతి భారతియు శ్రుతి బిలాశ్రయపతులుం
గౌరీశులు పేర్కొని రవి
వేఱడముగ నెంచు వారు విధివంచితులే. 822

ఉ. నెమ్మిఁ గుమారు లెల్ల రుపనీతులునై గురువర్యు సన్నిధిన్
సమ్మద మొప్పఁగన్ సకలశాస్త్రము లొయ్యన నభ్యసించి ర
ల్పమ్మగు కాలమందె శ్రుతివార మదేనికి శ్వాసరూప మ
ద్బమ్మగుఁ గాదె యాతఁ డవి పార మొనర్చె నటంచుఁ బల్కుటల్.

చ. వినయవివేకయుక్తు లయి విద్దెల నేరిచి రాజలీలలం
బొనరుచు చస్త్ర శస్త్ర వరభూషిత బాహువులై చరాచరా
త్మనిచయముల్ విముగ్ధ మయి ప్రాన్పడ మోహనరూపులై పురిం
జనుదురు గుంపు గూడుక ప్రజల్ తము గూరిచి ముచ్చటించుకోన్.

తే. కూర్మి సాకేతవాసు లా కొమరు లందు
రమ్యగుణధాము నయనాభిరాము నమల
కోమలశ్యాము, జనమనఃకాము రాముఁ
గనుగొనుచు నుంద్రు ప్రాణాధిక ప్రియునిగ. 825

సీ. అను దినమ్మును రాముఁ డనుఁగుఁ దమ్ములఁ గూడి
విల్లమ్ములను బూని వేఁట కరుగు,
నరిగి సుగతికర్హమగు పావనమృగాళి
నరసి నిజశరోపహతుల వాని
ప్రమందించి సుగతుల నందించి తండ్రి యా
నందింప నవి తెచ్చి ముందు వెట్టు,
ననుజన్ములను గూడి యారగించుం గూడు
నాలించు శ్రుతిపురాణార్థములను

రేపకడ మేలుకాంచి మాతాపితృగురు
దేవులకు మ్రొక్కి వారిచ్చు దీవనఁ గొని
తదనుమతిఁ బ్రజాహితమతిఁ దలఁపున నిడి
రాజకార్యము లొనరించు రాజు మెచ్చ. 826

క. విన్నను వేర్పడఁ దను మును
విన్న విశేషము ల వన్ని వివరించి వచిం
చు న్నయగతిఁ దమ్ముల కతఁ
డన్నింటం బ్రజ సుఖించు నను వొనరించున్. 827

తే. రూపగుణజన్మ హీనుఁడై వ్యాపకుఁ డయి
యెట్టి రూపునఁ జూపున కెడకు నుడికి
శ్రుతుల కందని వేల్పయ్యు శ్రితులఁ దనుప
వింత చెయ్వులఁ జేసి చూపించె విభుఁడు. 828

## విశ్వామిత్రుఁడు యజ్ఞరక్షణార్థము రామలక్ష్మణులఁ గొంపోవచ్చుట

మ. అవధానంబున నాలకింపఁ గదె విశ్వామిత్ర ముఖ్యుల్ మునుల్
నివసింపన్ వనిఁ బావనాశ్రమములన్ సిద్ధాగరిష్ఠాత్ములై
భువి మారీచసుబాహు లన్న తొలివేల్పుల్ మూఁకతో వచ్చి త
త్సవహోమాది తపోజపంబులను విధ్వంసంబు గావిం త్రొగిన్. 829

మ. ఇటు లా రాక్షసబాధలం గని మహర్షీంద్రుండు గాధేయుఁ డం
తటఁ జింతాతురుఁ డౌచు నా దనుజులన్ దండింప నా శ్రీశుఁడే
పటు దక్షుం డని యెంచి యాతఁడు మహీభారాపనార్థం బిలం
బటిమం బుట్టెఁ గదా, యవాని నిటకుం బ్రార్థించి తోడ్తెచ్చెదన్.

మ. కనులారం గనుఁ గొందు నీ మిష విరాగజ్ఞానధామున్ హరిన్
వినుతింతుం గొని తెత్తు సోదరునితో వేవేగ నిచ్చోటి కం
చని యక్కౌశికుఁ డాలసింపక సరయ్వాంభస్సులం గ్రుంకి పో
యెను గాకుత్స్థ నృపాలుప్రోలికిని లోకేశేక్షణాపేక్షుఁడై. 831

క. మునిరా కటు వినరాఁగనె
వెనురాఁగను విప్రకోటి వేఁడుకొనుచు న
మ్మునిరాజును దోడ్కొనిపో
వను రా జా దశరథుండు వచ్చె నెదురుగన్. 832

ఆ. వచ్చిన మునిఁ దెచ్చి యుచ్చాసనం బిచ్చి
యర్ఘ్యపాద్యము లిడి యధికభక్తి
వివిధ భక్ష్యములను సవిధంబునం బెట్టి
సుతుల నెఱఁగఁ బుచ్చె క్షితివరుండు. 833

శా. అంతన్ భక్తిని మ్రొక్కు రాముఁ గని రాగాయత్తుఁడై యోగియున్
స్వాంతం బందు విరాగ మేది ముఖశోభం గాంచె నా యామినీ
కాంతుం గన్న చకోరమట్లు లపు డా క్ష్మాకాంతుఁ డిట్లాడె "నా
కెంతే సంతస మయ్యె మౌనివర ! మీ రీ నాటి కే తెంచుటన్. 834

క. దేహము గేహంబును నెం
తే హేయము ; లైన మీరలే తేరఁగ నా
గేహాదు లయ్యెఁ బూతము
లే హేతువుఁ జేసి వచ్చి రిచటికిఁ జెప్పుఁడీ ?" 835

మ. అన గాధేయుఁడు పల్కెఁ "బంక్తిరథ ! దుష్టాచారు లింద్రారులం
దనయంబున్ నయ ముజ్జగించి చెఱుపన్ యజ్ఞాదిసత్కర్మముల్
అనుజోపేతుని రాము న ద్దనుజసంహారార్థ మచ్చోటికిం
గొనిపోవన్ నినువేఁడ వచ్చితిని సేకూరంగఁ గల్యాణముల్. 836

క. విడుమా ! మోహతమమ్ముల ;
విడుమా నీసుతుల నాకు వీరికి శుభముల్
బొడము యశము ధర్మము నీ
కొడఁగూడు" ననంగ నొడయఁ డొడలు వడంకన్. 837

ఉ. "అద్దిర! పెద్దకాలమున కచ్చిన సంతతి కాన వీరి నే
ప్రొద్దెడ బాయ నోపఁ గొనిపో నిటు ముద్దులపాప లిద్దరన్
సుద్ది నెఱింగి పల్కితివె సుంతయుఁ గొంకక వీరిప్రాపు నా
కెద్దడి యైన నాబ్రతుకు నెద్దడియౌ, వెనుకాడ కిచ్చెదం
దద్దయుఁ గోరు సర్వధనధాన్య ధరాదులఁ బ్రాణమేనియున్. 838

తే. కాని సుతులందుఁ బ్రాణసమానుఁడైన
ప్రియతమున్ రామ భద్రునే విడువనొల్ల
ఘోరరూపులు దానవవీరు లేడ?
పరమ కోమలమూర్తి మాపాపఁడేడ.?" 839

మ. అనితేఁ డివ్విధిఁ బుత్రమోహవివశుండై పల్క గాధేయుఁడున్
విని తత్సంతత ప్రేమభాగ్యగరిమన్ వే భంగు లగ్గించె లోఁ
గని యారీతి వసిష్ఠుఁ డద్ధార కెఱుంగం బల్కె రామామరా
వన జన్మాదివిశేషముల్ సుతుల నంపన్ తేఁడు సిద్ధుండుగాన్. 840

చ. కొమరుల నిర్వురంబిలిచి గ్రుచ్చి కవుంగిటఁ గూర్చి యర్థవా
క్యముల నుపన్యసించి 'కుశికాగ్రణి! నా కపురూపు బిడ్డ లీ
కొమరులు ప్రాణతుల్యు లనుఁగుల్ జనకాధికుఁడౌదు వీవు నె
య్యమి' నని యొప్పగించె ముని కాత్మజులన్ బొనరించి దీవనల్.841

ఉ. అంతట మాతృపాదముల కంజలి సేయఁగ నేగి రాఘవుల్
సంతస మార వచ్చి మునిచంద్రునివెంటఁ దదాజ్ఞ నేగి ర
ష్టంతట వారు సాధుభయహారులు మానిమనోవిహారు ల
త్యంత దురాఘహారులు నుదారులు ధీరులు వీరమూర్తులై. 842

చ. నరహరి విశ్వకార్యకరణంబునఁ గర్తయుఁ గారకుండునుం
బరగఁ దమాలనీలతనుభాసితుఁ డబ్జదళాయతాక్షుఁడున్
వరసువిశాలబాహుఁ డురువక్షుఁడు సుందరమూర్తి కాంచనాం
బరుఁడు నిషంగభూషితుఁడు బాణవిభూషితబాహుయుగ్మఁడున్.843

తే. అయిన నారాము సౌమిత్రి శ్యామగౌర
దేహులం గని తలఁచె గాధేయుఁ డిటులు
'తెలిసితిని మీరు బ్రహ్మణ్యదేవు లట్టు
కానిచో నాకునై పాయఁగలరె పితను.' 844

రాముఁడు తాటకాదుల వధించుట

చ. అని మది మోద మొందుచు మహానిధు లందిన పేదమాడ్కి న
మ్మునిపతి రాకొమారులను ముం దిడుకొంచు వనంబు సొచ్చి చూ
పిన నలతాటకాసురను బేరిమి న మ్మునియాజ్ఞ రాముఁ డ
ద్దనుజను సంహరించి స్వపదం బిడె దీన యటంచు దానికిన్. 845

మ. ముని యంతన్ నిజదైవమంచు రఘురాముం గాంచి యస్త్రంబుతో
ఘనమంత్రం బిడుచున్ బలాతిబలనాఁగన్ క్షుత్పిపాసాదు లెం
దున లేకుండ బలప్రతాపములు తోడ్తోఁ గల్గ నాపైన వా
రిని గొంపోయి నిజాశ్రమంబున నొసర్పించెన్ ఫలాహారముల్. 846

క. మరునాఁ డరుణోదయమున
దిరముగఁ గౌశికుని యజ్ఞదీక్షను గొనుమం
చు రఘూద్వహు లా రక్షణ
కురుశరచాపములఁ దాల్చి యుద్యుక్తులుగాన్. 847

క. కని కౌశికయాగముఁ జెఱు
పను జన మారీచుఁడున్ సుబాహుఁడు రాముం
డనలాస్త్రంబున నొక్కని
ననిలాస్త్రముచే మఱొకని నణఁచెం బఱచెన్. 848

మ. అనలాస్త్రాహతుఁ డందె మ్రగ్గె ననిలాస్త్రాఘాతుఁడై తూలి కూ
లెను మారీచుఁడు వందలామడల వార్థిందాఁటి, సౌమిత్రియున్
దునిమెం దక్కుఁ గలట్టి మూఁకల నటన్ దుర్వారదోస్సత్త్వుఁడై
మునులన్ నిర్భయులం బొనర్ప దివి వేల్పుల్ రాము నగ్గింపఁగన్. 849

క. చనుదెంచి నతు లొనర్చుచు
వినుతించిరి దనుజహారి ద్విజభయహారిన్
ముని యజ్ఞ విఘ్న హారిని
వినతాఖిలదుఃఖహారి వృజినవిదారిన్. 850

క. మునియు బహుకథల వా రెఱుఁ
గనియవి కాకున్న వేని గడు వత్సలుఁడై
వినిపించి తనిపెఁ దచ్ఛో
భనకారున్ నిర్వికారు భద్రాకారున్. 851

శా. రాముం డమ్మెయిఁ దత్తపోధనులపై రాగాన్వితుండై కడున్
సేమం బారఁగఁ గొన్నినాళ్లచట నిల్చెం దమ్మితో నంతటన్
భూమీశాత్మజులం గనుం గొని కృపాపూర్ణాబ్ధి గాధేయుఁ డన్
'రామా! పోదమె మైథిలీపురి ధనుర్యాగంబు నీక్షింపఁగన్.' 852

ఆ. కౌసలేయుఁ డంతఁ గౌశికమునివర్యు
పలుకు లాలకించి కులుకుతోడ
తోడఁబుట్టు తోడ తోడను ముని రాఁగ
ముని జనాశ్రమములఁ గనుచుఁ జనుచు. 853

## అహల్యా శాపవిమోచనము

వ. ఖగమృగజంతు శూన్యమయి కన్పడు నొక్కతపోవనంబు నం
దగపడ నొక్క యశ్మము 'మహాముని! దీని విశేష మే'మనం
దగు నటు లా కథల్ తెలిపి తన్ముని తన్మనుజేంద్రసూతితో
నగుచును "రామచంద్ర! యిట నాతిఁ బునీత నొనర్తువే కృపన్. 854

క. వని రాపడి పడి యుండెను
వినుమా, గౌతముని నాతి విభుశాపమునన్
గనుఁగొను దఁజు నీపదరజ
మును గోరెడు" ననుఁడు నడుగు మోపిన నతఁడున్. 85

ఉ. శోకవినాశకాంఘ్రిము లెద సోఁకిన యంతనె సత్తపశ్చయం
బాకృతిఁ దాల్చెనో యన శిలాకృతి యంతస వాయ మ్రోలఁ దన్
సోఁకినవేల్పు రామవిభు సాంద్రకృపుం గని కేల్మొగుడ్చుచున్
వాకొన వాక రాక భువి వ్రాలి యొడల్ వడకంగ భీతయై. 856

చ. ప్రియమునఁ దా నధీర యయి దృష్టుల నశ్రులు జాలువారఁ ద
ద్దయు నతిభక్తియుక్తి నెద ధైర్యముఁదాల్చి పునీతవాక్కునన్
"జయ రఘునాయకా! నిశితసాయక! భక్తసుఖప్రదాయకా!
జయ సదసద్వివేచన! కుసంసృతి మోచన! పద్మలోచనా! 857

చ. గరిత నపూత నేను త్రిజగత్పరిపూతుఁడ వీవు నాపయిం
జరణరజంబు నిల్పి నను సోఁకితి జన్మము ధన్య మయ్యె నిన్
శరణముఁ జొత్తుఁ గావు మయ! నామది నేఁడవశత్వ మొంది యే
వరమును నిచ్చగింపక భవచ్చరణంబ శరణ్య మం చనున్. 858

శా. కంటిం గంటి రఘూత్తముం బరము నాకండ్లారఁ గన్గొంటిఁ జే
కొంటిం గొంటి మహానిధిం దలనుఁ గైకోగంటిఁ దద్ధూళినిం
గంటిన్ మేలుగ భర్తృశాపమును శ్రీకంఠుండు నెవ్వానిఁ గ
న్గొంటన్ మేలని యెంచు నా విభుని దన్మూలంబునం గాంచుటన్.859

ఉ. ఏ పదమూలమందు జనియించిన దా శివమూర్ధ్నధార్య దే
వాపగ లోకపావని యజాదిసురావళి గొల్తు రే పదం
బా పద మీశిరంబున దయాపర! మోపితి మేలు మన్మనో
రూపమిళింద మీ పదసరోజమరందము నాని మత్తిలున్." 860

ఆ. అనుచుఁ బెక్కుగతుల నా గౌతమాంగన
ప్రణుతిఁ జేసి రాముఁ బరమధాముఁ
బదములం బడిపడి పతియున్న యెడకేగె
నిష్టవరము వడసి యింపుమీఱ. 861

ఆ. మానసంబ! యట్టి దీనదయాళుని
నిర్నిమిత్తమ కృప నెఱపు హరిని
వీడి యన్యు నేల వేఁడెదు వృథగను
వీడి కపటమతిని వేఁడు మతని. 862

ఉ. అంతట రామలక్ష్మణులు నా మునితోడుతఁజేరి స్వర్ణదీ
ప్రాంతముఁ దద్ధరావతరణాదికథల్ వినుచుం దదాపగన్
సంతస మారఁ గ్రుంకులిడి బ్రాహ్మణసురకోటిని సత్కరించి య
త్యంతరయమ్మతో నరిగి య మ్మిథిలాపురరామణీయమున్. 863

క. ఆ పురశోభావిధ మా
బ్రాహ్మపతిసుతు లంతఁ గనిరి మది ముద మొదవన్
వాపీకూపాదులు మణి
సోపానాంచితము లమృతసుజలాన్వితముల్. 864

## మిథిలాపురవర్ణనము

చ. రుచిరసరోవరంబుల సరోరుహముల్ వికసింప నం దళి
ప్రచయము జు మ్మటంచును మరందము నానుచు నుండఁ జారు ప
క్షిచయము కూయ నొప్పెసఁగ శీతలమందసుగంధయుక్తి వీ
చుచును సదా సదాగతి ప్రసూనవనంబు లెసంగు నా పురిన్. 865

మ. వరసౌధంబులు రత్నవిద్ధములు విశ్వస్రష్ట్రహస్తంబులన్
విరచింపం బడి నట్టు లుండుఁ బురవీథుల్ స్వాదుగంధంబు ల
త్తరుపన్నీరులఁ జిల్కుచుండ్రు గృహచిత్రంబుల్ స్మరాలేఖ్యమున్
బురుడించుం గనుపండువౌ నగరి నే మూలం గనుంగొన్న నేన్. 866

క. బేరులు కుబేరసము ల
వ్వారిగ దినుసులనుఁ గూర్చి వైభవవృద్ధిం
గూరుచు నుందురు పురనర
నారులు సద్ధర్మవిదులు నయతత్త్వనిధుల్. 867

ఉ. అందఱు ధర్మశీలనిధు లందఱు జ్ఞానులు తత్త్వవేత్త లీఁ
డెందున నొందనట్టి మిథిలేశనివేశవిలాసముల్ గనుం
గొందురు మత్సరంబు లెదఁ గూరఁగ వేలుపు లెల్ల వింతగా
నిందున విశ్వశోభ కదియెల్లగ నడ్డిడి నిల్చెనో యనన్. 868

క. శ్వేతప్రాసాదంబుల
జోతులు మణిమయకవాటసుఘటిత మగు నా
సీతానివాసభవనము
జ్యోతియు వర్ణింప నగునె చూపఱ కెందున్. 869

మత్తకోకిల :
వాటమైన కవాటముల్ వర వజ్రఘట్టన దుర్గముల్
కోటవాకిట నెప్డు మందలు గూడి యుండ్రు నరేంద్రు లె
ప్పాట నా శ్రుతి పాఠకుల్ స్తుతిపాఠకుల్ నట నాటకుల్
వీటి మందుర లేతఱిన్ గజవీతులం దుములంబు లౌ. 870

క. శూరసచివదళపతుల య
గారము లవియెల్ల నృపనికాయ్యసమంబుల్
భూరమణులు విడిసి రటఁ బు
రారామమునన్ సరోవరాంతిక భూమిన్. 871

శా. అంతన్ గాధితనూజుఁ డన్నగర బాహ్యాళిన్ వన మ్మొక్కటఁ డ
త్యంతప్రీతి ఘటిల్లఁ జేయఁ గని 'యీ యారామ మోరామ! నా
కెంతే సంతసమున్ ఘటించె వనమం దిందుందమే' యంచు భూ
కాంతాత్మోద్భవు లియ్యకో నిలిచె సౌఖ్యం బార సవ్వారితో. 872

మ. ఋషిబృందంబును గూడి గాధితనయుం డేతెంచె బాహ్యాళి నా
విషయంబున్ విని యవ్విదేహుఁ డెలమిన్ మిన్నంటి వెన్నంటిరాన్

ఋషిముఖ్యద్విజరాజబంధుగణముల్ ఋష్యాసయార్థంబుగాఁ
దృష్టమై నేగి శిరంబు మోడ్చె మునికిన్ దీవించె నహ్యాసియున్.

క. వందించె విప్రబృందము
వందించుకొనెన్ విదేహవసుధేంద్రుఁడు నా
నందమునన్ నిజభాగ్యము
నందఱఁ గుశలంబు నడిగె నపు డమ్మునియున్. 874

మ. కుశలప్రశ్న మొనర్చి మాటికి నృపుం గూర్చుండఁగాఁ బంచినం
గుశికాత్మోద్భవుఁ జేర వచ్చి కెలనం గూర్చుండి రా రాఘవుల్
కుశలుల్ మోహనమూర్తు లంబుజదళాక్షుల్ నేత్రసౌఖ్యావహుల్
శిశువుల్ శ్యామల గౌర వర్ణులు జగచ్చిత్తాపహారాకృతుల్. 875

విశ్వామిత్రుఁడు జనకరాజునకు రామలక్ష్మణుల నెఱిఁగించుట

మ. ఇటు లేతెంచిన రాట్కిశోరములఁ దా మీక్షించి వారంద ఱా
దట లేవన్ మిథిలాధినాథుఁ డెలమిం దన్మోహనాకారులం
దటిదాభన్ మిఱుమిట్లు గొల్పఁగని వింతం జెంది గాధేయు నా
దట మేనెల్ల చలింప గద్గదిక నొందం గొంతు యి ట్లడ్గెడిన్. 876

చ. "మునికులవార్ధిచంద్ర! మునిముఖ్యులొ వీరలు రాజవంశపా
వనులొ కొనంగనుం గొనక ప్రానుడు లోడి యనంతుఁ డన్న యా
ఘనుఁ డిరురూపు లూని ననుఁ గావఁగ వచ్చిన వాఁడొ తెల్పుఁ డీ
య్యనఘులఁ గన్న రాగ మడుగంటిన నామనసే రమించెడిన్. 877

చ. సహజవిరాగరూపమతి చంద్రునిఁ గన్న చకోర మట్లు నేఁ
డహహా! వశంబు మీఱె నిపు డంటక బ్రహ్మసుఖంబు సౌహృదా
వహమగు వీరిదర్శన మెవం డ్రొకొ వీరి నెఱుంగఁ దెల్పుఁ డీ
రహిని మఱుంగు పెట్టక త్వరన్ మునివర్య!" యటంచు మ్రొక్కినన్.

చ. మునివరుఁ డంత లేనగవు మోమునఁ దోఁప ననెన్ "నృపాల! నీ
వనునది నిక్కమౌ దశరథాత్మజు లీరలు రాఘవాన్వయా
వను లిల సర్వజీవసుఖవర్ధనులుం బ్రియదర్శనుల్, మఖా
వన మొనరింపఁ దండ్రి పనుపం జనుదెంచిరి నాదు వెంబడిన్. 879

ఆ. రూపశీలనిధులు భూపాలతిలకులు
రామ లక్ష్మణు లవిరామధృతిని
జగముసాకిరిగను సాఁకిరి నామఖం
బసురకోటి నెల్ల కసి మసంగి." 880

క. అన జనపతి మునిపతి కి
ట్లనె "నీపద దర్శనం బనర్ఘ్యము మత్ప్రా
క్తన పుణ్యమే మనుదు నీ
యనుజులు నానందమునకె యానందకరుల్. 881

క. భ్రాతల సౌభ్రాతృత్వముఁ
బ్రీతియు నన్యోన్యమైత్రి ప్రేమ పవిత్రం
బే తీరున వర్ణనముం
జేతును దత్ప్రీతి బ్రహ్మజీవముల కళా." 882

చ. అని యిటు రామచంద్రుఁ బులకాన్వితదేహుఁడు నై విదేహుఁ డం
దునఁ గడు నెయ్యమారఁ బలుతూరులు తన్మయుఁ డౌచుఁగాంచి య
మ్మునిని బ్రశంసఁ జేసి కయిమోడ్చి పురిం గొనిపోయి వారి కం
దనయము సౌఖ్యదం బగు గృహంబు నొసంగె నివాస మేర్పడన్.

తే. పలు తెఱంగుల శుశ్రూష లలరఁ జేసి
యర్చలనొనర్చి జనకరా జనుమతిఁ గొని
యరిగె నమ్మెయి మునులతో నారగించి
రామలక్ష్మణు లుండి రారామమునను. 884

## రామలక్ష్మణులు మిథిలాపురముఁ జూడ నరుగుట

ఉ. అంత సుమిత్రసూతి జనకాధిపు పట్టణవైభవాదికం
బంతయుఁ జూడ వేడ్కపడి యమ్మునికిన్ జడుపొంది యన్నతో
నాంతరికేచ్ఛఁ దెల్ప దరహాస మొనర్చినఁ గౌసలేయుఁ డో
క్కింత యెఱింగి వాని తలఁ పిట్లడిగెం జతురోక్తి నమ్మునిన్. 885

'క. మునివర ! జనకపురిన్ మా
యనుజుఁడు కనఁ గోరి మీభయంబున నడుగం
డనుమతి నిడిరేన్ దోడ్కొని
చనిక్షణమునఁ జూపి తెత్తు సౌమిత్రి' ననన్. 886

మ. అనురాగంబున గాధిసూతి యనె 'మీ రా పాడిఁ గాపాడరో
వినుఁ డీరల్ నయసేతురక్షకులరై ప్రీతిన్ సుఖం బిచ్చి కో
ల్చిన భక్తాళిని బ్రోచువారు మిథిలాశృంగారముల్ గన్గొనం
జని మీమోములఁ జూపి లోకనయనోత్సాహంబుఁ గావించుఁడీ.887

తే. పోయి రం డయ్య ! సుఖనిధుల్ పురముఁజూడ'
ననిన మునిపతి యంఘ్రుల కంజలించి
యఖిలలోచనసుఖదాత లనుజు లరిగి
రంటిరాఁగను దమ వెంట నర్భకతతి. 888

శా. లోకాలోకనసౌఖ్యదాతను మనోలోభంబు దృగ్లోభముం
బైకో బాలురు వెంటఁ బర్విడుచు రాన్ బాయంగలేకే పురా
లోకాపేక్షను దిర్గుచుండి రనుజుల్ శోభాయమానుల్ శుభా
లోకుల్ శ్యామలగౌరదేహు లిరు కేలున్ వెల్గ విల్లమ్ములన్. 889

సీ. కేల విల్లమ్ములు గెలన నమ్ములపొది
మొలను బంగరువల్వ మోపుమూపు
నిడుపు బుజమ్ములు నిడుపైన ఱొమ్మును
నఱుత వ్రేలెడు ముత్తియంపు సరులుఁ
దమ్మి కన్నులసౌరు నిమ్మైన మైపూఁత
లొమ్మైన చెవిపూల యుదిరిచాయ
జానైన జానుగుల్ జాబిల్లి మోమును
జూడఁ దాపత్రయం బోడిపాఱ
మదిని మ్రుచ్చిలు రూపు బొమడికము నిగ
కనుబొమలవంపు నా తిలకంపు సొంపు
సొంపు మీఱెడు నుంగ్రంపు జుట్టుఁ గట్టు
నా నఖశిఖాంతశోభ నాకొనె తెలుప. 890

## పురకాంతలు రామలక్ష్మణులఁ జూచి ముచ్చటించుకొనుట

క. రహిని బురిం గనుఁగొన నిటు
మహీశసుతు లరుగుదెంచు మాట వినఁగనే
గృహకార్యము విడి పఱచిరి
మహానిధికిఁ బర్వుపేదమాదిరిఁ బౌరుల్. 891

మ. అతిరమ్యాకృతు లాసహోదరుల హర్షావిష్టలై కాంచి స
మ్మతిమై నేత్రఫలంబుఁ గంటి మని వామాక్షుల్ గవాక్షంబులం
గుతుకం బారఁగ మోహనాంగుఁ గని వాకొం ద్రిట్టు లన్యోన్య మం
“దతివా! కంటిమె వింటిమే మును జగం బందిట్టి రమ్యాకృతిన్. 892

మ. అరయంగాఁ జతురాస్యుఁడై విధియుఁ బంచాస్యుల్ ప్రపంచాస్యులై
హరవిష్ణుల్ వికృతాకృతుల్ వడసినా రవ్వా రన న్నేల త
త్సురరక్షోరగమర్త్యకోటుల నిఁకెందుం గందు మేతన్మనో
హరరూపోపముఁ గోటికోటి శత కామాతీత దివ్యద్యుతిన్. 893

మ. చెలిరో ! వీరల సొంపుఁగాంచి వలపుం జెందం డెవండెందుఁబూ
వుల విల్కాండ్రను గోటిసంఖ్య దిగదుడ్పుం దీయఁనౌ వీరిపై
విలసద్బాలమరాళగాములు లసద్వేషుల్ శుభాలోకనుల్
లలితాకార కిశోరమూర్తులు తమాలశ్యామగౌరాభులున్. 894

సీ. కంటివే యీజంట వింటితాలుపులను
వింటివే దశరథు బిడ్డలంట !
వీ రకే రక్షించినా రకే మునియాగ
మసురవిసర మందుఁ గసిమసంగి !
యీ పద్మలోచనుండే సుబాహుమా
రీచరాక్షస మదమోచనుండు !
నీ శ్యామలాంగుఁడే రామనాముఁడు
కౌసల్య కడుపారఁ గన్నబిడ్డ !
వాని వెన్నంటి విల్లమ్ము లూని వచ్చు
గౌరవర్ణకిశోరుఁ డో వారిజాక్షి !
లక్ష్మణాఖ్యుఁ డతండు తల్లఘుసహోద
రుం డతండె సుమిత్రాసుతుండు చెలిరో. 895

ఆ. మునిసవంబుఁ గాచి మునిపత్నినిం బ్రోచి
జనకు చాపసవముఁ గనఁగ వచ్చి
నారు భ్రాత లిందు వీ" రన నొకతె యా
నంద మొంది రతివ లంద ఱందు. 896

మ. 'కనుఁగొంటే నవమోహనాంగు నితనిం గండ్లార నో నెచ్చెలీ !'
యనుచున్ నాతి యొకర్తు 'సీతఁ గయికో నర్హ్హం డితం డింత కా
జనకుండే కనుఁగొన్న నీ ఘనఘనశ్యామున్ బలోద్దాము వీ
డు నకే యానఁ దొలంగి కూఁతు నిడి యీడుం జోడుఁ జేకూర్చకే.'

సీ. సఖి యోర్తు 'మన రాజు సమ్మాన మొనరించె
మునిసమేతముగ నీయనుజుల' ననె,
చెలి యోర్తు 'విధిగతిం జెడి యజ్ఞతం బడు
నేమొకా కటు వీడునే పణ' మనె,
సతియోర్తు 'దైవంబు సత్కృపఁ గాంచిన
నెల్లరి కోర్కు లీడేరు' ననియె,
'మనసీత కీతండ మగఁ డగు సందియం
బిసుమంత లే' దనె నిం కొకర్తు,
'విధిగతి సంబంధవిధి యిది కూడుచో
మనము ధన్యుల మౌదు' మనె నొకర్తు
యింకొక తె 'యిట్టి సంబంధమే యొదవిన
నెన్నఁడే నిందు సుందరు నిందుఁ గుందు
మిట్టి సంబంధ సంయోగ మెట్టులైనఁ
బూర్వసుకృతంబులం గాక పొడము నె?' యనె. 898

ఉ. భామ యొకర్తు పల్కెను 'సెబా సనఁ బల్కితి వీ వివాహ మో
చామ! హితావహం బగును సర్వజగంబుల కన్న విన్ననే'
లేమ మఱొర్తె యిట్లనెఁ 'జెలీ! శివకార్ముకమా కఠోర మీ
శ్యామలమూర్తి కోమలుఁ డిదా నసమంజస' మన్న నొర్తనెన్. 899

క. 'ఎవ్వని పాదరజమ్మున
న వ్వని నఘరూపయౌ నహల్యయు రా రూ
పవ్విధి విడి సతి యయ్యెనొ
య వ్వాఁ డి వ్విల్లు వంప ననుమానంబే? 900

తే. ఉవిద యోర్తనెఁ 'జూడ ని ట్లుందు రైన
వీరలు మహానుభావు లో వారిజాక్షి!

యెంచి జానకి సృజియించె నే విరించి
య ల్లతఁడ యేర్చి యుంచె నీ నల్లమగని.' 901

ఉ. అందఱు మోదమందిరపు డాత్మ నటేయవుఁ గాతమంచు నా
సుందరు లందఱు మింట విరిసోనలు మాటికి నమ్యో నందు వా
రెందునఁ బోదు రందె జను లెల్లరు మందలుగూడి కందు రా
సుందరమూర్తులం బరమశోభనమూర్తులఁ బుణ్యకీర్తులన్. 902

## రామలక్ష్మణులు ధనుర్యజ్ఞశాలను గననేగుట

ఉ. పోయి యటంత వారు పురపూర్వదిశం జని కాంచి రంత న
త్యాయతచారుకాంచనసమంచితమంచము లుండ ధారుణీ
నాయకు లెల్లరున్ నిలువ నల్గడలం బలువేదు లుండ స్థా
నీయులు గూరుచుండఁ గమనీయముఁ గార్ముకయజ్ఞవాటమున్. 903

క. ఉన్నతమంచము లవి భూ
భృన్నాథులు కూరుచుండ వెనుదెసఁ గల వం
దెన్నియొ వన్నెల తిన్నియ
లన్నగరనివాసు లెల్లరటఁ గూర్చుండన్. 904

క. స్వర్ణప్రాసాదంబులు
వర్ణింపఁగ రాని సిరులు వఱల నిలిపిరా
వర్ణానుసారముగ వర
వర్ణినులుం గూరుచుండఁ బ్రత్యేకముగన్. 905

ఉ. ఈమెయి న వ్విశేషముల నెల్ల నశేషముఁ జూపి తెల్పుచున్
శ్యామలగౌరగాత్రముల నంటుచు నీ మిష మే గగుర్పడన్
వేమరు గాంచుచుం దుదు తనివిం గనఁ బోని మనఃప్రవృత్తితోఁ
బ్రేముడి రామలక్ష్మణుల వెంబడి వచ్చెడి పౌరబాలకుల్. 906

తే. ప్రేమవశుఁ డంచు శ్రీరామవిభు నెఱింగి
యా బుడుత లెల్ల నిజనిజేచ్ఛానుసరణిఁ
బ్రీతిఁ దమ తమ యిండ్లఁ జూపించి పిలువ
నా రఘూత్తము లరిగి ర వ్వారి వెంట. 907

ఉ. ఎ వ్విభు నాజ్ఞఁ జేసి సృజియించునొ మాయ నిమేషమాత్రలో
ని వ్విధి విశ్వ మెల్ల నతఁ డీశుఁ డమానుషుఁ డాశ్రితార్థుఁడౌ
న వ్విభుఁ డట్టి చిత్రముల నబ్బురపాటునఁ జూచి భ్రాతతో
న వ్విధ మెల్లఁ జూపి తెలియం బలికెన్ మృదుమంజులోక్తులన్. 908

తే. ఇవ్విధిని జిత్రములఁ గాంచు చెంతొ నైళ
మయ్యె ననుభీతి గురుఁ జేర నరిగి రపుడు
భీతునకె భీతుఁ గొల్పు నిర్భీకుఁ డయ్యు
భీతుఁ గొనె సేవమహిమఁ జూపించుకొఱకు. 909

ఉ. అట్టు పురిం గలట్టి పరమాద్భుతదృశ్యము లెల్లఁ గాంచి తోఁ
బుట్టులు తమ్మువెన్నవులు బొట్టెల నెట్టులొ మంచిమాటలన్
నెట్టన వీడుకొల్పుచు మునిప్రవరుం గన నేగి మ్రొక్కి య
ప్పట్టునఁ బ్రొద్దుక్రుంకఁగనె వార్చిరి తీర్చిరి సాంధ్యకృత్యముల్. 910

క. సారామల భక్తి వినన్
బోరాముల ప్రీతి నుబుసుపోవఁ దెలుపుచుం
బౌరాణికేతిహాసము
లా రాఘవు లడుగు లొత్త న మ్ముని పండెన్. 911

క. ఎవ్వాని యడుగుం దమ్ముల
క వ్వాని యోగులు విరక్తు లనురక్తులునై
యవ్వారి తప మొనర్తురొ
య వ్విభుఁ డటు బడుగుదపసి యడుగులనొత్తెన్. 912

మ. 'చను మన్నా ! నిదురింపు' మంచును మునిస్వారాట్టు తన్నెంతయే
ననురోధింపఁ బఱుండె రాముఁడు, సుమిత్రాత్మోద్భవుండుం గడున్
నను వారన్ భయభక్తు లొప్పఁగను భ్రాత్రంఘ్రిద్వయం బొత్తి త
న్ననురోధింపఁగ విశ్రమించె విభుచింతాయత్త చిత్తంబునన్. 913

క. 'కొక్కొఱొకో' యని వేకువఁ
గుక్కుటముల్ గూయ లేచి గుఱునకు ముందే
గ్రక్కునఁ గాల్యము లొనరిచి
యా కౌశికమునికి మ్రొక్కి య కాకుత్స్థుల్. 914

ఉద్యానమున సీతారాము లొండొరులఁ గాంచుకొనుట

క. కుసుమానయనార్థము చని
వన పడి సంతతవసంతవైభవ మింపుం
బనఁ గొనఁ జొచ్చెనొ యనఁగాఁ
బసమీఱు విదేహపుష్పవనముం గనుచున్. 915

ఉ. ఎన్నొ తెరంగులౌ తరువు లెన్నఁగరాని లతావితానముల్
వన్నెల వన్నెలౌ విరులఁ బల్లవకోటులఁ గల్పవృక్షమున్
జెన్నునఁ జిన్నఁబుచ్చఁదగు జెన్నగు కీరచకోరశారికల్
జెన్నుగఁ గూయఁ గోకిలలు జెచ్చెరఁ గేకులు గేకలెట్టఁగన్. 916

క. ఆరామమధ్యమునఁ గా
సారము మణిమయమనోజ్ఞసోపానములన్
సౌరారు వివిధవనరుహ
వారమునన్ జలవిహంగ బంభరయుతమై. 917

క. ఆరామముఁ గాసారము
నా రామానుజులు కాంచి యబ్బుర పడి ర
య్యారామవిభవ మేమన
నా రామప్రభునకే మహాప్రియ మయ్యెన్. 918

చ. నలుదెసలం గనుం గొని వనంబునఁ గావలివారి నడ్గి పూల్
దళములఁ గోయ వారపుడె తద్వనసీమకుఁ దల్లి పన్ప న
క్కెలనఁ గలట్టి గౌరిగుడికిన్ గవురిం గొలిపింప జానకిం
జెలులటు తోడితెచ్చి రటఁ జిత్తము మత్తిలు భంగిఁ బాడుచున్. 919

మ. అపు డాసీత సఖీసమేత యయి వాప్యంభస్స్థలం దోఁగుచున్
విపులాభన్ జనచిత్తహారి యయి వాపీప్రాంతమం దున్న యా
విపులాభృత్సుత కోవెలం జని కడుం బ్రేమంబునం గొల్చి రు
ద్రుపడంతిన్ వినుతించి కోరెను బతిన్ రూపానురూపాకృతిన్. 920

శా. అంతన్ జానకి జంట వాసి సతి యోర్తారామముం జూడఁ నా
చెంతం దిర్గుచు మోహనాకృతుల నా శ్రీరామసౌమిత్రులన్
వింతం గన్గొని పర్వుపర్వునను వేవే వచ్చి యచ్చోటికిన్
సంతోషంబున మేన్ గగుర్పఁ గనులం జాల్వార బాష్పాంబువుల్. 921

క. ఈరీతి సంబరంపడు
నా రామామణినిఁ గాంచి యా రామ లిదే
మే రామామణి కులు కన
నా రామోదంత మాడె నా రామ యిటుల్. 922

క. "మన వనమును గన వచ్చిరి
వినుఁ డిర్వురు నీలగౌరవిగ్రహు లలఘుల్
కనఁ జాలిన వనఁ జాలవు
ననఁ జాలిన వరయఁజాల వవ్వారి వగన్. 923

క. మారసుకుమారమూర్తులు,
వారల కొమరెట్లు పలుక వచ్చును నా" కం
చా రాకొమరుల కొమ రటు
లా రామవచింప నలరె న జ్జానకియున్. 924

మ. పరమాత్మైక్యము నొంద నొక్కసఖి తాఁ బల్కెన్ 'చెలీ వింటె భూ
వరసూనుల్ ముని వెంట వచ్చిన నుడిన్ వారే సుమీ వీర లీ
నరనారీతతి రూపమోహమున లోనం జేసుకొంచుండి రీ
పురి నెచ్చో విన వచ్చె వీరి నుడులే పో వారి నీక్షింపనా.' 925

మ. అనుడున్ నెచ్చెలి పల్కు వీనులకు విందై సోఁక నాసుందరున్
గను నాత్రంబు సహింపలేక, చెలి యేగన్ ముందు వెంటం బురా
తన మైత్రిన్ మది మాటువెట్టి, నిజమై తన్నారదోక్తుల్ ఘటిం
చెను గాఁబోలు నటన్న ప్రీతిఁ జని కాంచెన్ సీత దృగ్లాలసన్. 926

క. నలుదెసలం గనుఁగొని చం
చలదృష్టిన్ భీతహరిణశాబకరీతిన్
జెలఁగఁగ జానకి కంకణ
ముల ధ్వనులెద నాట రామభూపతి పలికెన్. 927

చ. 'అనుజుఁడ! వింటె విశ్వవిజయం బను లాలసఁ జూపి మన్మథుం
డొనరఁగ భేరి కొట్టె నన నొక్కరవం బగు' నంచుఁ గన్గొనెం
డన కులకన్యఁ గాంచు నెడఁ దన్నిమి శంకిలి తెప్ప వీడె నా
ననిమిషుఁ డౌచు జానకి ముఖాబ్జము స్వాక్షిచకోరపంక్తిచే. 928

శా. సీతాసుందరి చెన్నుఁ గాంచి మది మెచ్చెం బల్క నోరాడకే
ప్రీతిన్ రాముఁడు విశ్వసృట్టు తనపేర్మిన్ నేరిమిం జూప నీ
రీతిన్ సీతమనోహరాకృతి నొనర్చెన్ నాఁగ, సౌందర్యమున్
జ్యోతిష్మంత మొనర్చు దీపశిఖనాన్ శోభాగృహంబందునన్. 929

ఆ. ప్రాకృతాంగనాంగ వర్ణన కవిముఖో
చ్ఛిష్ట మైన యుపమఁ జెప్పనొనె
మెచ్చులాడి నీమె మెచ్చుగా నని యన్నఁ
నెమ్మిఁ బలికెఁ బిన్న తమ్మునకిటు. 930

మ. కనుఁ గొంటే! క్షితిజాతఁ జాపమఖముం గావించు తేఁడీమెకై
పౌనరన్ గౌరి భజింపఁ బంప సఖు లీ పూఁదోఁటకుం దేఁగ నీ
మెను దోఁపెల్ల వెలుంగఁజేసె, మది యీమెం గన్న నిర్గుష్ట మై
నను క్షోభించెడు దక్షిణాంగమడరెన్ భాగ్యం బదే హానాకో. 931

మ. మదినైనం జొరఁబోరు రాఘవులు దుర్మార్గంబునం దేను నా
యెద నమ్మంగలవాఁడ స్వప్నముననే నీక్షింప దన్యాంగనన్
ఎదనేనిం బరకాంతఁ గోర కని వెన్నీకుండ శత్రావళికిన్
సదనార్థ్యంబున భిక్షు కోటిని నిరాశం ద్రిప్పకుం ద్రేరిలన్. 932

తే. అట్టి సుజనులు కొలదిగ నవని నుందు
రనుచుఁ దెలుపుచు రాముఁడు మనసుఁ దగుల
జానకీరూప మందున షట్పదగతిఁ
దన్ముఖసరోజరుచిమరందమును గ్రోలె. 933

మ. తిలకింపన్ జనకాత్మజాత యట నల్ దిక్కుల్ మనోమోహనాం
గు లెటందేగి రఁటంచు నామె చకితాక్షుల్ బర్వ చోళ్లల్లెడన్
దెలిదమ్ముల్ గురిపించినట్లు తెలి వాఁదెన్ నెచ్చెలుల్ దీనె లిం
డ్ల లలిన్ వారలఁ జూప వేడ్కఁగనె నష్టద్రవ్యముం గన్నటుల్. 934

క. విడువక రామచ్ఛవిఁ గనఁ
బడలెను గన్దోయి, ఱెప్పపాటును మానెం
బొడమెను మైమర పామెకుఁ
గడుఁ దమి శశిఁగను చకోరికకు వలె నంతన్. 935

క. కన్నుల తెన్నుల వారిని
గ్రన్నన మదిఁదెచ్చి నిలిపి కనుఱెప్పలు నా
సన్నని తలుపుల మూసెను
జెన్నొ తద్ప్రేమ మరసి చెలు లబ్బపడన్. 936

ఆ. అంత నన్న దమ్ము లా నికుంజంబు నం
దుండి వెలువడి రట గండు మీఱి
జలదపంక్తి నుండి వెలువడి వచ్చెడు
నిండు చందురు నిగ నెగడుకొనఁగ. 937

సీ. సుషమానిధానులు సుభగాంగు లిర్వురు
నీలారుణాంబుజ నిభ వపుషులు
కాకపక్షంబుల ఘనసుమ కలికల
శీర్షంబు శోభను జెలఁగు చుండ
శ్రమశోయకణయుతాంచత్ఫాల తిలకంబు
వంపు కన్బొమ్మ లుంగ్రంపు జుట్టు
తరుణారుణాంబుజవరనయ నంబులు
శ్రవణముల్ భూషణచ్ఛవి వెలుంగఁ
జారు చిబుక కపోల నాస దరహాస
ముల విలాసము లేమందు మోము గోము
నేమనందును దలవంచుఁ గామకోటి
దానిఁ గన్నంత విన్నంత దర్పమోడి. 938

క. ఉరమున మణిమాలలు శుభ
కర కంబుగళంబు మత్తకరికరభుజముల్
కరమునఁ బువ్వుల దొన్నె య
లరఁగన్ శోభించుఁ గోమలశ్యాములుఁడే. 939

తే. అనుచు నాసఖులంతఁ బీతాంబరధరు
శీలసుషమానిధానుని సింహావక్షు
హంసవంశావతంసు రామావనీంద్రు
నరసి యవ్వేళ మేనులు మఱచి రపుడు. 940

ఉ. దిట్టతనంబుఁ దాల్చి సఖి తెల్పె నొకర్తపు డిట్లు సీతతో
నిట్టులు రాకుమారుల నికేల కనుంగొనఁ గొల్వుమా యుమన్
దట్టపు బత్తిఁ గ్రమ్మఱ ననన్ జనకాత్మజ కొంకి తండ్రి తాఁ
గట్టిన పందెముం దలఁచి కాంచె నఖాది శిఖాంతకాంతినిన్. 941

క. ఇట్టులు పరవశయా రా
పట్టినిఁ గని యంద అనిరి పలు జా గయ్యేన్
జట్టుగ వత్తము లే రే
పిట్టితఱిన్ మగుడ ననఁగ నీగూఢోక్తిన్. 942

మ. విని లజ్జించి విదేహపుత్రి జననీభీతిన్ విలంబమ్మగా
జ్జనకాధీనమగున్ నిజేచ్ఛయనుచున్ స్థైర్యం బెదం దాల్చి యా
త్మను రామాకృతి నిల్పి వృక్షలతలన్ దర్శించు వ్యాజంబునం
జని తద్రూపముఁ గన్నులారఁ గనియెన్ సంతుష్టచిత్తంబునన్. 943

## సీత గౌరీదేవి నర్చించుట

ఉ. శ్యామల కోమలాంగరుచి స్వాంతమునం దిడి శైవచాప మెం
దేమెయిఁ గర్కశం బనుచు నెంచి ప్రియుం బలుమాఱుఁగాంచ, సీ
తామదిరాక్షి, రాఘవుఁడు తద్గుణశీలసురూపధామ నా
ప్రేమమయన్ లిఖంచె హృదిఁ, బ్రీతి నుమాలయ మేగి యామెయున్.

చ. జయ! గిరిరాట్కుమారి! జయ శర్వముఖేందు చకోరి! యో జగ
త్త్రయ జననీ! మదేభముఖ తారక జిజ్జననీ! శ్రుతుల్ చతు
ష్టయమును నీమహత్త్వఁ గనఁ జాలవు విశ్వవిమోహినీ! జగ
త్త్రయ జననస్థితిప్రళయదాయిని విశ్వజనానపాయినీ! 945

క. గట్టులదొరపట్టీ! వెలి
గట్టొడయని చెలువ! ముజ్జగంబుల తల్లీ!
మొట్టమొదలు నట్టనడుముఁ
దుట్టతుదయు లేకె పెంతు ద్రుంతు జగమ్ముల్. 946

చ. పరమ పతివ్రతామణులఁ బ్రప్రథమంబుగ నిన్నె యెన్న నా
నరయ సహస్రశీర్షులు సహస్ర మజస్రముఁ బాడుచుండినం
దరిఁ గనువారె నీమహిమఁ దాము చతుర్విధసిద్ధులన్ భవ
చ్చరణముఁ గొల్చి పొందుదురు, శర్వమహాప్రియ! సర్వమంగళా!

మ. నినుఁ బూజించియ కాదె తల్లిరో! భవానీ! సర్వకామప్రదా!
జను లస్వప్నులు సిద్ధి నొందుట మదిచ్ఛల్ తెల్లమా నెల్ల నీ
కని యంతస్థలి నుండు దాన వని యాఖ్యానింప! విశ్వాత్మికా!
యనినై దేహి యుమాంఘ్రులంటినను బ్రేమాయత్తయై యా మెయున్.

మ. నగుచున్ మాలిక నేలఁ జార్చినను లోనం దత్ప్రసాదంబ యి
ట్లగు నంచుం దలఁదాల్చె సీత యపు డయ్యార్యామహాదేవి యిం
పిగురొత్తం బలికెం గుమారి! మది నీ వెవ్వానిఁ గామించి తా
మగఁ డబ్బున్ ఘనమేచకాంగరుచి నమ్మంబోవె నాదీవనల్. 949

మత్తకోకిల:

నిందు నీమదిఁ గోరు కోరికి నీరజాక్షి! మదుక్తి వే
యొందుగా మది నెంచఁ బోకుమి! యుత్పలాభవినీలదే
హుండు శీలనిధానుఁడుం గరుణాకసుందు మగండగున్
దండిగా మదిఁ గోరు నాతఁడె తథ్యముల్ మునివాక్యముల్. 950

మ. అను నద్దేవి ప్రసన్నవాణికిని బ్రహ్మానందమగ్నాత్మయై
జనకాత్మోద్భవ పెక్కు మ్రొక్కులిడి యాశర్వాణి నగ్గించి శో
భనమూలంబగు వామపార్శ్వ మదరం బ్రాపయ్యె నాగారి యం
చని యత్యంతముదంబునం జనె వయస్యల్ తోడురా నింటికిన్. 951

## రామలక్ష్మణు లుద్యానము నుండి విడిది కరుదెంచుట

ఉ. అంతట రామలక్ష్మణులు నాత్మ నుతించుచు సీతరూపు గు
ర్వంతికభూమి కేగి తమ రారసినట్టివిధం బదెల్ల నా
కింతయు డాప కంతవచియించిన నమ్ముని సంతసించి మీ
యాంతరికేచ్ఛ సిద్ధిఁ గను నంచును దీవనలిచ్చె మచ్చికన్. 952

తే. హర్ష మిగురొత్తఁ బవటి విం దారగించి
శ్రుతిపురాణకథాశ్రుతిం బ్రొద్దుపుచ్చి
సందెవేళ యెఱింగి దాశరథి యపుడు
తమ్ముతో వార్చి సాంధ్యకృత్యములుఁ దీర్చె. 953

సీ. పొడుపుగట్టునఁ బుట్టు పూర్ణచంద్రునిఁ గాంచి
జానకీముఖశోభ జ్ఞప్తిఁ దోఁప
విషధిఁ బుట్టినవాఁడు విషపుతోఁబుట్టువుఁ
బవట వెల్వొలవోవు వన్నెవాఁడు
హెచ్చు తగ్గులవాఁడు కుచ్చితమ్ముగలాఁడు
నారాహుకబళమై యడలువాఁడుఁ
గోకవిరహాలోకశోకప్రదుండును
బంకజద్రోహికళంకమూర్తి
యైన యీచంద్రుఁ డీడె తదాననమును
బోల్కి సేయ నటం చిటు పోలదనుచు
నెల మిషన్ సీతశోభ వర్ణించుకొనుచు
గురువుదరి కేగెఁ జాల రే యరుగు టెఱిఁగి. 954

చ. మునిచరణంబులన్ శిరమువోపి తదాజ్ఞఁ బరుండి రాముఁ డం
తనె యరుణోదయం బయినఁ దద్దయు మేల్కొని తమ్ముతోడ నో
యనుజుఁడ! ప్రొద్దు తోఁచె కను మంబుజ కోకసుఖప్రదాతయై
యనవుడు లక్ష్మణుం డనియె నన్నప్రభావముఁ దెల్ప నమ్మిషన్. 955

సీ. అడఁగెను గుముదంబు, లుడిగె నయ్యుడుకాంతి,
నృపుల సత్తువు లాఱు నీవులేవ!
రాజనక్షత్రముల్ దేజరిల్లినఁ గాని
చాపతమిస్రంబు నోప వఱఁప
హర్షింత్రు చంచరీ కాబ్జకోకము లట్లు
త్వద్భక్తతతి నీవు ధనువుఁ దునుమ
భానుఁ డుదయమొంద! బాధాంధ మశ్రమ
వాయుఁ జుక్కలు సుక్కఁ బ్రభలు మీఱు
రవి నిజోదయనిభమున రాజులకును
దెలుపుచుండెను నీదగు దివ్యమహిమ
మిట్టి నీప్రభావోదయ ఘట్టమునకు
శివధనుర్భంగ మొకపాటి చిహ్నమావె. 956

చ. అనవుడు లక్ష్మణోక్తుల స్మితాననుఁడై రఘురాముఁ డంతఁ బా
వనుఁడయి స్నాన మాడి తగ వారిచి తీరిచి సాంధ్యకృత్యముల్
చని కుశికాత్మజాంఘ్రులకు జాగిలి మ్రొక్కినయంత వారిఁ దో
డ్కొని సభ కేగుదేర జనకుం డనుపన్ గురుఁ డేగుదెంచినన్. 957

తే. గురుశతానందు పదములఁ గొలిచి రాముఁ
డనుజు దెస నిల్వ గాధేయుఁ డనియె నేఁడు
జనకుఁ డంపె స్వయంవరోత్సవముఁ జూడ
మనల రమ్మని చని చూత మనఘులార! 958

మునివెంట రామలక్ష్మణులు స్వయంవరసభ కరుగుట

చ. కనుఁగొని వత్తమూ ఘనఁత గాంచు నెవం డన లక్ష్మణాప్రతా
పనిధి భవత్ప్రసాద ఫలభాజనుఁడౌ జనుఁడే సుకీర్తిభా
జనుఁ డగు శంకయేల మునిచంద్ర! యటన్న మునుల్ తథాస్తనన్
గనఁగ స్వయంవరోత్సవముఁ గౌశికు వెంబడినేగి రయ్యెడన్. 959

మ. అరుదేరంగ స్వయంవరాంగణమునం దాబాలురం జూడఁగాఁ
బురవాసుల్ గృహకార్యముల్ మఱచి గుంపుల్ గూడి యేతెంచి రా
నరనాథుండు భటాళిఁ బంచె జనులన్ వర్ణానుసారంబుగా
వరపీఠంబులఁ దత్తదర్హతల సంభావించి నిల్పింపఁగన్. 960

ఉ. ఇట్టుడు రాజిలోన నిగలీనెడు నయ్యెడు రాజు లిర్వుర
న్నట్టులు రాజరాజి నలశ్యామలగౌరకిశోరమూర్తు ల
ప్పట్టున రామణీయ మొకపట్టున మెట్టె ననంగ నందుఁ గ
న్పట్టిరి తత్తదాశయముఁ బట్టియ యందఱ కన్నిరీతులన్. 961

ఉ. వీరులు వీరమూర్తిగను భీరుమతుల్ ప్రళయోగ్రమూర్తిగన్
ఘోరయమస్వరూపముగ క్షోణిపవేషసురారులున్ బురీ
పూరుషు లెల్లరుం బురుషభూషణు దృక్సుఖదాయిగాఁగ శృం
గారము మేనుఁ దాల్చినటు కాంతలుఁ గాంచిరి తత్తదిచ్ఛలన్. 962

సీ. విబుధులు కని రల విశ్వరూపునిగాఁగ
వేగాలుసేతుల వెలయుచుండ
శుద్ధతత్త్వాత్ముగాఁ జూచిరి యోగులు
గనిరి స్వయంప్రకాశునిగ సాధు
లీక్షించి రల భక్తు లిష్టార్థము లొసంగు
నిలువేలుపులు గాఁగ నిర్వుర నట
జనకబంధు జ్ఞాతిజనములు గాంచిరి
ప్రియబంధు లట్టులు ప్రేముడి మెయి
మారసుకుమారు లా రాకొమారు లనుచు
రాజదంపతు లీక్షించి రోజమీఱ
సీత శ్రీరాముఁ గన్న తత్ప్రీతిరీతి
కని యనుభవింపనే కాని కాదు తెలియ. 963

క. మది కనుభవైకవేద్యం
బది కైసరుఁ డెట్టు పలుక నౌ నది చెప్పఁ డ
య్యదనునఁ దమతల పోతలఁ
బదపడి తలకొక్కరీతిఁ బ్రభుఁ గనుఁగొనిరా. 964

క. రాజిల్లి రాజిరాజ త
నూజులు జితరాజరాష్ట్రనూజ మనోజ
భ్రాజన్మనోజ్ఞతనులు స
భాజనహృన్నయనహరణభాజనరుచులై. 965

క. రాజిలిరి రాజరాజిని
రాజఘ్నన గౌరవర్ణ రంజితమూర్తుల్
భూజన చక్షుశ్చోరమ
నోజ మనోజ్ఞాకృతుల మనోరంజనులై. 966

ఉ. అందము చంద మేమనుదు నాశరదిందువినిందకాస్యమున్
సుందరకుండలాంచితము శ్రోత్రయుగం బరవిందనేత్రముల్
వందలువేలుగా మరుల వన్నెల డించు కడిందిరూపమున్
డెంద మెఱుంగుఁ గాని ప్రకటింప నుడుల్ పొడకట్టఁ బోనెదన్. 967

ఉ. ఎందు నుతింపనేర్చు నెవఁ డిందు వినిందకమందహాసమున్
సుందరమంజుభాషలను సూనశరాధికసౌష్ఠవంబు నిం
దిందిరకోటి సిగ్గునను దించెడు కేశము సుందరభ్రువుల్
బొందగు నాసికేక్షణ కపోలవిశాలసుఫాలభాగమున్. 968

క. సుందర కంబుగ్రీవము
నందలి రేఖాత్రయం బదలరును ద్రిజగ
త్సౌందర్యసీమ మనఁగా
నంద మెసఁగు హత్తిముత్తియంబులపేరుల్. 969

మ. తులసీమాలయు జన్నిదం బెదను గేల్దోయిన్ ధనుర్బాణముల్
మొలఁ దూణీరముఁ బీతవస్త్రమును బల్మూపుం గనన్మౌళి పెం
దలపై వెల్గ మృగేంద్రుఠీవిఁ జను తద్రామాకృతిం గాంచి లో
కులు నాపోకయె కన్నుమూయరల నాక్షోణీశుఁడుం బ్రేముడిన్. 970

తే. వినుతు లొనరించి ప్రకృతమున్ విన్నవించి
రంగ భూచిత్రములఁ జూపె రాజు మునికి
నెందు నాత్రభాత లరిగి రందంద జనులు
మందలుగఁ గూడి కందు రానందకందు. 971

క. ప్రమదమున రాముఁగాంచిరి
తమతమ తత్త్వముల కొలఁదిఁ దత్త్వమెఱుఁగ కే
ప్రమదము నొందుచు మునియు వ
సుమతీశునిఁ జాలమెచ్చెఁ జోద్యముఁ గనుచున్. 972

## రామునిఁగాంచి సభలో రాజులు గుసగుసలు పోవుట

మ. జనకుం డంతటఁ గూరుచుండ నిడ విశ్వామిత్రరాడ్పుత్రులన్
ఘన రత్నాంచిత మంచ మంచున రఘుక్ష్మానాథుఁ జూడంగనే
జననాథుల్ వెలవెల్లవోవుచును నక్షత్రాళి పూర్ణేందుకాం
తిని నైవర్ణ్యముఁ గాంచి నట్లయి ప్రతీతింజేసి కొం డ్రీవిధిన్. 973

చ. విడుఁ డికఁ సందియం బితఁడు విల్ దునుమున్ దునుమాడకున్న నె
య్యెడ జయమాల వీని మెడనే తగిలించి వరించు సీతయున్
నడువుఁ డికయ్య లిండ్లకు ఘన ప్రతిభాబలశౌర్య సత్త్వముల్
మడుఁగ ననన్ మఱొక్క యఁభిమాని యనెన్ వెడనవ్వు నవ్వుచున్.

క. విలు విఱుచుఁ గాక మన ముం
గల నెవ్వఁడు పెండ్లి యాడఁ గలఁడన పణముం
దలపకె పెండ్లాడ మనము
గెలువమొ యవ్వాని జానకిం గైకొనమో. 975

ఉ. అంతట ధర్మశీలనృపుఁ డాడె మఱొక్కఁడు సుస్మితాస్యుఁడై
యంతటి పంత మేటికయ ! యారఘురాముఁడు రాజదుర్మదం
బంతము గాగ విల్విఱుచు నాతని గెల్చు నెవండు సెప్పుఁ డా
యంతగ మోముఁ జించుకొన, నాకలి తీరు నె బూరెమాటలన్. 976

ఉ. నాయుపదేశమున్ వినుఁడు నమ్మి జగత్పిత రాముఁ డంచు నిం
దీయమ సీత లోకజనయిత్రి యటంచుఁ గనుండు లోచనా
పాయము దీర, జన్మఫల మందుఁడు సుందరసౌఖ్యరాశులౌ
నీయనుజన్ము లిర్వురు మహేశహృదాశయవాసు లారయన్. 977

తే. దరి సుధాంబుధి తనరఁగ దాని వీడి
యెండమావులఁ గని పర్వి యేలచత్తు
రెవ్వ రెటువలెనైన నదేల నాకుఁ
గంటి నే మాత్ర మీజన్మ ఘనఫలంబు. 978

## సీతను చెలులు స్వయంవర సభకు తోడ్తెచ్చుట

చ. అన విని సాధులెల్ల ముద మందిరి, వేల్పులు పూలఁ జల్లి రా
జనకుఁడు పిల్వనంపఁ గనె జాడ నెఱింగి వయస్య లెల్ల సీ
తను గొనివచ్చి రందు జగదంబిక రూపము నేమ నందు నే
తనరునె యామె కన్య వనితాజనతా వయఃవోపమానముల్. 979

తే. సీత వర్ణింప సరిపోని ప్రాత వడ్డ
చాటువలు దెచ్చి యెవఁడు నౌబాటుఁ గాంచు
సీతయే సాటి సీత కే రీతి నన్న
నామె కెవరీఁడు దివిజభూజాంగనలను. 980

మ. పతి చింతారత యారతీసుదతి, యవ్వాగ్దేవి వాచాల, శ్రీ
సతి హాలాహలవారుణీసహజ యాశర్వాణి సామేనిదా
ద్యుతిపీయూషమహోదధిన్ మదనుఁ డుద్యుక్తిన్ స్వహస్తంబునం
దత శృంగారసుమందరాగమును సౌందర్యాది కూర్మంబుపై. 981

క. శోభారజ్జునఁ జిలికిన
నాభాస్వరలక్ష్మి యొదవ నామెయు, నీ సీ
తాభామకు నీడగు నన
నాభావం బౌను గాదనన్ శంకించున్. 982

ఉ. అంత వయస్య లెల్ల సకలాంగవిభూషితఁ జేసి తత్సభా
భ్యంతర సీమ కామెను శుభావహగీతముఁ బాడి తోడితే
నంతట లోకమాత యడు గందునఁ బెట్టిన నే విముగ్ధు లై
కాంతు రటామెఁ గన్దైదరఁ గన్ మగవారన నేల మానినుల్. 983

క. అప్పుడు భేరులు మ్రోసిన
పుప్పరమునఁ బూలు గురిసె నొగి నచ్చరలున్
గొప్పగఁ బాడిరి నృపులును
తెప్ప యిడక కనిరి బాల ధృతజయమాలన్. 984

శా. సీతాసంభ్రమచిత్త మర్కకులుఁ గాంక్షింపన్ విముగ్ధాత్ములై
రా తక్కుంగలమొక్కలుల్ నొరలు తేజారెన్ రఘూత్తంసు దృ
గ్జోతుల్ పెన్నిధిఁ గన్నటుల్ వలపు సిగ్గుల్ చెగ్గలింపం గడున్
సీతాభామయుఁ జూపునిల్పి చెలిపై స్నేహస్వరూపుం గనున్. 985

క. గురుజనలజ్జాభరమునఁ
బరిజనముల కన్నొరంగి పరిపరిఁ గాంచున్
ధరణిజ తొంగలి ఱెప్పల
మఱుఁగున రామప్రభుం దమాలతరు నిభున్. 986

శా. సీతారాముల దృగ్విలాసము లటుల్ స్త్రీపూరుషౌఘంబు క
న్నాతల్ మూయకె కాంచుచున్ విధిఁ దలంపున్ సేసె నాభూమిభృ
చ్ఛ్రీరీతి మరల్చి తొంటి ప్రతినం జింతింప కెంతే తమున్
సీతారాముల గూర్చు బుద్ధి నిడి సుక్షేమంబుఁ జేకూర్చఁగన్. 987

మ. తొలఁగింతేని నృపాలు పందెమును ; డిందుం డెందపుంగుందు లోఁ
గలఁగుం జిత్తము లట్లుకాక యని లోకం బెల్లదృగ్జాలసా
కులమై శ్యామలమూర్తియే తగును మాక్షోణీజకం చాడుచోఁ
బిలువన్ వచ్చిరి వందిమాగధు లటన్ బీరంబు లగ్గించుచున్. 988

క. జనకుఁ డపుడు మత్పణమును
వినుపింపుఁడు వందు లనిన విని ముద మొదవం
జని వారనిరి నృపాలురు
వినుఁడీ మాటేని పణము వినుపింతు మిదే. 989

చ. సుభటభుజాబలంబు శశి శూలిశరాసన మిద్ది రాహువౌఁ
ద్రిభువనవేద్య మౌనె కద! దీని భరంబును బాణరావణ
ప్రభృతులు దీని కోడి యిలుబాఱుట, యీవిలు ద్రుంచు జెట్టినిం
ద్రిభువన లక్ష్మితోడుత వరించును సీత యశంకి తాత్మయై. 990

## విలునెత్త నోడిన రాజులను జనకుఁడు నొవ్వనాడుట

చ. అన విని రాట్పణంబు నడియాసల నాత్మబలాభిమానులై
చని కటిబద్ధులై నిలిచి క్ష్మాపతి యెంచి యభీష్టదైవమున్
ధనువుఁ గదల్పలేక జతనంబు లొనర్చియు రిత్తవోవఁగాఁ
గని యది కొండ యాదరికె కాంచరు పెద్దటికంబు నిల్పుకో. 991

క. భూపతు లొక్కొక్కరు దా
మోపిన లా వెల్లఁ జూపి యూపఁ గదలదా
చాపం బంతంత నృపుల
యోపిక దిగలాగి భార మురవయ్యెననన్. 992

మ. పదివేవుర్ నృపవీరు లంత నొకతేపం గూడి విల్లెత్తఁ బోఁ
గదలం బో దది కాముకోక్తులకు లొంగంబోని సాధ్వీ వధూ
హృదయం బట్లటు శౌర్యసత్వముల నందే యోడి యవ్వింటికై
వదనంబుల్ దిగవాల్చి యంటుఁ గొను నావైరాగి చందంబునన్. 993

క. వాడిన మోముల తోడను
బోడిమి సెడి కూరుచుండు భూపాలుర కా
ఱేఁడు జనకుఁ డెద రేఁగెడు
వేఁడిమి నిటు లాడెఁ దలఁ బ్రీడను వంపన్. 994

మ. ప్రకటింపంగనె మత్పణంబు విని ద్వీపద్వీపపృథ్వీపతుల్
సకలాశాస్థసురాసురుల్ మనుజవేషం బూనియున్ వచ్చినా
రకటా! ధాత సృజింపఁడే యొకనినే నవ్వారిలో మామాకు
రికిఁ బోల్పం జను మా కుమారిని యశశ్శ్రీలన్ వరింపం జనన్. 995

తే. కడలకొనలకు ఘనకీర్తి కడలుకొనఁగ
విల్లు నెక్కిడి మాసుతం బెండ్లియాడు
ఘనుఁడు వీ రంద ఱందు నొక్కండు లేఁడొ
నచ్చదో దీన నొకనికి నిచ్చలేదొ. 996

తే. మాకుమారిని బెండ్లాడ రాకుమారు
లెందటెందఱో వచ్చి రీ యిందఱందు!
నొక్కరుఁడు లేఁడు గాక విల్లెక్కు వెట్ట
నెత్త నైనను దిలమాత్ర మెత్తినారె. 997

ఉ. వీరులు పోవఁ డింద్లకును వీరముఁ జూపక యాసవాసి నే
వీరవిహీన యయ్యె నని పృథ్వి నెఱింగితి నేఁడు వ్రాయఁ డీ
ధారుణి సీతపెండ్లి నిఁక ధాత, పణంబు విడంగఁ బున్నెముల్
జాఱు నిఁకేమి సేతు నిటు జానకి కన్నెతికంబ తాల్చెడిన్. 998

జనకుని పల్కులకు లక్ష్మణుఁడు కుపితుఁ డగుట

ఉ. నీరస యయ్యె నీరసయు నీరస భూధవరాజిఁ గూడి యీ
తీ రిది మున్నెఱింగిన ప్రతిజ్ఞ వహింతువె నవ్విపోవ నం
చీరస మాడ నజ్జనకుఁ డెంతో కలంగిరి పౌరు లెల్ల రా
ధారుణికన్య భీతిలెఁ గ్రుధన్ వెలిగ్రక్కె సుమిత్రసూనుఁడున్. 999

క. పెదవు లదరఁ బలు గొఱుకుచుఁ
బదపడి పలుకంగ లేక భ్రాతృని భీతిన్
బదములఁ బడి తల సోఁకఁగ
నెద నేర్చెం బలుకు ములుకు లిట్లనె సభలో. 1000

మ. రఘువంశార్భకుఁ డొక్కఁ డున్న సయిపన్ రానట్టి కాఱోడ్డెమున్
రఘురాట్కేసరి మోసలం గొలువులో రాజిల్ల రాఁజెల్లునే,
రఘునాథా! భవదాజ్ఞ బంతివలె నీ బ్రహ్మాండమ్ముం బట్టి యా
మఘుటంబుం బలె ఛిన్న భిన్నములుగా మాయింప నేఁజాలనే. 1001

మ. సెల విమ్మా! రఘువీర! నీవు కనుఁగో శ్రీకంఠుకోదండమున్
నళినీ నాళము భంగిఁ బట్టి పఱువన్ దక్షుండ నూతామడల్
విలు పుట్టం గొడుగుం బలెన్ విఱుతు నిన్ వేడ్కొంచునుం బ్రల్లదం
బులు గావివ్వి త్వదంఘ్రిసాక్షి విలునమ్ముల్ ముట్ట నొండైనచో.

మత్తకోకిల :

మెంచఁ డోకండును బల్కె రాఘవ! మేరువుం బెకలించెదన్
బెండు మూలిక పోరికిన్ నిలఁబెట్టెదన్ విరిచెండసన్
బండు వట్టు లజాండ మామనిపంబు మాదిరిఁ జెండెదన్
బెండు ప్రావి లిదెంత నా కిటు నీ మహత్త్వము ముంగటన్. 1003

క. అని లక్ష్మణుఁ డిటు చెనకినఁ
దొనకెను భువి దిక్కరులును దొట్రుపడె జగమున్
జనులు జనపతులుఁ దొనఁకిరి
జనకుఁడు శంకించె సీత శంకయుఁ దొలఁగెన్. 1004

ఆ. గురుఁడు నన్న కనిరి గురుత రామోదంబు
తెలమి మేనఁ బులక లలము కొనఁగ
నన్న కన్న సన్న నన్నయశీలునిఁ
బెరిమఁ గూరుచుండఁ బెట్టె నపుడు. 1005

క. మంజూక్తుల ముని యనె, ముని
రంజన! లేలెమ్ము వేగ ప్రమథేశ ధను
ర్భంజన మొనర్చి జనకుని
నెంజిలిఁ దీరిచి ముదంబు నెఱపు మనంగన్. 1006

తే. గురుని పల్కుల కలరి తచ్చరణములకు
భక్తి సాగిలి మ్రొక్కి నిర్ద్వంద్వబుద్ధి
ఖేద మోదంబు లూన కాక్షితిపసుతుఁడు
లేవి నిల్చుండె మృగరాజులేవ మీఱి.  1007

మ. పొడమన్ రాఘవ బాలభాస్కరుని రూపుల్ మంచపూర్వాద్రిపై
విడిచెన్ సాధుసరోమహాశయము లువ్విళ్లూరె దృగ్భృంగముల్

అడఁగెన్ మత్తమహీంద్ర కుందములు స్వస్వాశానిశల్ మాయఁగా
నుడిగెన్ వాగుడుకాంతి దుర్మద మహీపోలూకముల్ దాకొనెన్.

చ. సురమునికోకముల్ విగతశోకము లయ్యెఁ బ్రసూనవృష్టులం
గురిసి భజించి రంత సురకోటులు నయ్యెడ నారఘూత్తముం
డెరఁగి గురూత్తమాంఘ్రులకు ఋష్యనుశాసన మంది మత్తకుం
జరగమనంబునం జనియె సర్వజగత్పతియున్ నిగర్వియై. 1009

ఉ. ఆసుకుమారమూర్తిఁ గని హర్ష ముతోడ నొడల్ గగుర్పడన్
దోసిలు లొగ్గి తత్పురవధూతతి దైవపితష్టులన్ మహో
పాసన సేసెఁ బ్రాక్తనతపోమహిమం బిసుమంత యున్న మా
కీసుకుమారమూర్తి యిపు డీవిలు ద్రుంచు మృణాలముం బలెన్. 1010

క. పౌరాంగన లిట కొలువఁగ
శ్రీరామాకార మిట్లు ప్రియ మారంగా
నారసి సీతామాతయుఁ
జేరన్ సకురాంద్రుఁ బిలిచి చింతించె నిటుల్. 1011

తే. అంద ఱీవింతఁ గాంచనే యైరి కాని
హితుల రయ్యును రాజున కెఱుఁగజెప్పి
మారసుకుమారు లీరాకుమారులన్ గ
ణింప రా దని పణము మాన్పింప రొకరు. 1012

ఉ. రావణబాణు లంటరుగ రాజవరూథము దర్ప మోడఁగా
నీవిలు నెత్తుకో, నితని కిచ్చిరి బాలమరాళమేడ నిం
దీవిలు మందరాద్రి యిది యేడను ఱేఁడు వివేక మోడెనో
దైవవిధం బ దెట్లొ యనఁ దత్సతి కొక్క వయస్య యిట్లనెన్. 1013

సీ. దేవి! శంకింపకు, తేజోయుతంబైన
దలఁతి యైన నదియ కొలఁదిమీఱుఁ
గుంభజుం డేడ నాయంభోధి యేడన
నింకింపఁడే దాని నెల్లరుఁ గన
రవికుండలం బెంత భువనత్రయధ్వాంత
మెంత దాని నడంపదె యుదయమున
మంత్ర మదేపాటి మహనీయ ధాత్రాది
దేవు లే డది వారిఁ ద్రిప్ప లేదె
యంకుశమె వణంకించు మహాగజమును
బూవుతూపుల లోఁగొను భువనములను
మారుఁ డటు కాన నీశంక మానుమింక
ధనువు భంజించు రాముఁడు తప్ప దనిన. 1014

మ. చెలిబల్కుల్ విని జానకీజనని హర్షించెన్ మహీపుత్రియున్
లలితాకారుని రాముఁగాంచి మదిఁ గల్యాణిన్ శివం గొల్చెడిన్
దొలినేఁ జేసిన పూజకున్ ఫలముగా దుర్గాభవానీ! యిదే
పలుమాఱున్ విని మన్నుతుల్ శివధనుర్భారంబు వేడింపుమా. 1015

క. వరదాయక! గణనాయక!
కరుణను నీవేని డింపు కార్ముకభర మం
చు రఘూత్తము దివ్యాకృతి
నరసి యెడన్ గగుర సమ్మదాశ్రులు క్రమ్మన్. 1016

మ. కనులారన్ ముఖశోభఁ గాంచి మదివేగం దండ్రి పంతానకై
జనకా! కష్టసుఖంబు లెంచక ప్రతిజ్ఞం జేసితే యివ్విధిం
జన దీఘోరపణం బటంచును బ్రతిజ్ఞన్ మాన్పలేఁ డయ్యెనో
జన మాన్యుండు, ప్రధాని, చాలు బుధసంస్థన్ సీ యనౌచిత్యమున్.

చ. కులిశకఠోర మాధనువు, కోమలనీలతనూ విలాసుఁడీ
యలఘుఁడు వజ్రవేధమున కౌనె శిరీషసుమం బిదెట్టు లం
చెలమిని ధైర్య మూను దెటు లీవయ దిక్కిఁక శంభు చాపమా!
చులకన గమ్ము రాముఁగని చూపఱులం దిడి నీదుజాడ్యమున్. 1018

క. అని పరితపించుచున్ మదిఁ
జన క్షణ మొకయుగముగాఁగ జనకజ యంతన్
గనుఁగొనె రామప్రభువును
గనుఁగొనె మఱి పుడమి మగుడఁ గనుగొనె రామున్. 1019

మ. నునుసిగ్గారఁగ రామచంద్రముఖ చంద్రుం గాంచ గ్లాబింబ మం
దున మీనధ్వజి మీనయుగ్మ మలరం దూగాడి నట్లుండె నా
పెను వాగ్భృంగము మోముదమ్మి ముడుగన్ వ్రీడానిశావిష్కృతిన్
గను నీ గ్గండ్లనె నిల్చె లుబ్ధక కరగ్రస్తంబు విత్తంబనన్. 1020

తే. ఇటులు కనుఁ గొంచుఁ బెనువంత దిటముఁ గొనుచు
జివర కాయమ దిటమిటు చేసికొనియె
దనుమనశ్శుద్ధి గల్గు సత్యప్రతిజ్ఞ
నేని రామాంఘ్రులం బ్రీతిఁ బూనుదేని. 1021

తే. తథ్యముగ నన్ను రఘుపతిదాసిఁ జేయు
సర్వహృద్వాసి యది కాక స్వాంతశుద్ధి
దేన నిక్కపు వలపూను దానివాఁడు
పొందు నణుమాన మనుమాన మిందులేదు. 1022

## శివధనుర్భంగము

మ. అనుచుం బ్రేమపణంబు నొగ్గగను సర్వాత్ముం డెదం గాంచి విం
టిని గన్గో గరుడుండు సర్పశిశుమాడ్కిన్ లక్ష్మణుం డంత న
న్నను విల్గాంచినఁ గాంచి మేన్ వణఁకఁగన్ బ్రహ్మాండముం ద్రొక్కిప
ల్కెను దిక్కుంజరకోలశేషకమఠుల్ పృథ్వీస్థలిం బట్టుఁడీ. 1023

తే. విఱుచు మాయన్న నేఁ డిందు భీమధనువు
నొరగఁ బోకుండఁ జలియింప కుండ నుర్వి
నప్రమత్తతఁ బట్టుకొం డనిన యఃపుడె
ధనువు దరి కేగె రాము డత్తఱి యెఱింగి. 1024

సీ. సుకృతముల్ మెచ్చిరి సురనరనాథులు
రాముండు విలుదరి రాఁగ నపుడు
దుర్మద నరపతి దురభిమానంబును
సకలభ్రమామోహసంశయములు
భార్గవరాముని బలవీర్యదర్పముల్
వేలుపు తపసులు వెఱఁగుతనము
జనకానుతాపంబు జనకజవగపును
మిథిలేశ్వరీ మనోవ్యథ యివెల్ల
జంట నంటుక ముక్కంటివింటి నావ
నెక్కి దరియింపఁ జూచు నయ్యీనకులేశు
దోర్బలాంబునిధిం గాని దొరకఁ డయ్యొ
నావ దరిఁజేర్పఁగాఁ జాలు నావికుండు. 1025

తే. చిత్రగతి నిల్చి తనుఁ జూచు క్షితి జనులను
గడిగడియు వేయుగా లటు కడపుచున్న
పరమవైక్లబ్యమూర్తి నాపడఁతి మిన్న
క్షితిజ వగఁ గన్న నాదయాసింధు వపుడు. 1026

క. దప్పిని గూలిన వెనుక నిఁ
కెప్పని కమృతాశయంబు లేటికి వృష్టుల్
జప్పగఁ జే లెండినఁ దఱిఁ
దప్పిన ననుతాప మొందఁ దనరునె ఫలమున్. 1027

చ. అని యిటు లెంచి దాశరథి యాదర మార మహీజఁ గాంచుచుం
దనువు గగుర్పడన్ గురుపదమ్ముల నెమ్మది నిల్పి యెత్తి యా
ధనువుఁ దటాలునన్ మెఱసి దామిని మేఘవిలీన మైనటుల్
గనఁగ ఖమండలోన్నతముగాఁగ వడిన్ విఱిచెన్ దటుక్కునన్. 1028

క. కనువారలు నివ్వెఱఁగొనఁ
గనుగవ మిఱుమిట్లు గొనఁగ క్షణమాత్రములో
ధనువుఁ దునుమ నారఘుపతి
ఘనరవ మొకఁ డయ్యె ముజ్జగము లాత్రపడన్. 1029

చ. కళవళ మొందె లోకములు కాపథముం గొనెఁ బ్రొద్దు తేజులుం
గలఁగిన వష్టదిక్కరు లిఁకన్ ఫణికూర్మవరాహముల్ స్థితుల్
దొలఁగెను నోలలాడె భువి తూలి సురాసురముఖ్యు లాధ్వనిం
గళవళమంది వించు శివకార్ముకభంగ మెఱింగి యాపయిన్. 1030

తే. జయజయోక్తులఁ బల్కిరి జగతి నెల్ల
మున్ను మోహాంధులౌ వారు మునిఁగి రల్ల
రాఘవామోఘభుజబలార్ణవమునందుఁ
బరఁగ ముక్కంటి పెనువింటి పడవ నెక్క. 1031

చ. విలు నటు రెండుగాఁ దునిమివేయుడు జూపఱు లెల్ల పొంగిరాఁ
బులకతరంగముల్ విరియఁ బొంగఁగ బ్రేమసరః ప్రవాహముల్
జెలఁగెను గౌశికార్ణవము శ్రీరఘునాయకపూర్ణచంద్రునిం
గులుకుచుఁ జూచి, భేరు లనుగొట్టి పువుల్ గురియన్ సుధాంధసుల్.

ఉ. అచ్చర మచ్చెకంటు లపు డాడిరి పాడిరి కిన్నరాంగనల్
మెచ్చి ప్రశంసచేసి పరమేష్ఠిముఖామర సిద్ధులున్ మునుల్
ఇచ్చిరి దీవనల్ విభున కెచ్చుగ రాముఁడు విల్లుఁ ద్రుంచె నం
చెచ్చెను హర్ష నాదములు హెచ్చె జయధ్వని ముజ్జగమ్ములన్. 1033

ఉ. మ్రోఁగె జయోక్తు లాధనువు మ్రోఁత వినంబడి నంతఁ జెచ్చెరన్
మ్రోఁగె మృదంగ శంఖ రవముల్ సహనాయిలు డోళ్లుఁ దప్పెటల్
వాఁగె బహుప్రకారముల వాద్యవిశేషము లప్డు వందులున్
మాగధు లేగుదెంచి గుణమాన్య యశోవిధి నుగ్గడింపఁ గన్. 1034

క. కట్టనము గాఁగ నిచ్చిరి
పట్టపుఁ బ్రజలెల్ల రామ భద్రున కంతన్
బట్టగు హయ గజ రథములఁ
బుట్టములన్ మంగళములు పొలతులు బాడన్. 1035

సీ. ధనువు భగ్నంబైన ధరణీశముఖశోభ
దివసదీపచ్ఛవి దీటుకొనియె
వాడి చొక్కిన చేల వర్షము పడినట్లు
మిథిలేశ్వరి యెలర్చె వ్యథలఁ బాసి
ఈఁత నలయునాతఁ డూతముఁ గొన్నట్లు
జనకరా జలరె నిశ్శంకుఁ డగుచు
స్వాత్యంబు వృష్టికిఁ జాతకప్రీతినా
సీతా మనఃప్రీతి చెన్ను మీఱె
చందురునిఁ గన్న కోకంబు చందముసను
రామచంద్రుని జానకీరామ కాంచి
యలరి గురుశతానందుని యాజ్ఞ నపుడు
సఖులు వెనురాఁగఁ జనె రామసన్నిధికిని. 1036

మ. చనె నాబాల మరాళగామిని వయస్యల్ గీతముల్ బాడుచున్
వెనురాఁగన్ సుషమానిధాన మన నుర్విన్ దీప్తి మధ్యంబునన్
ఘనసౌందర్య మనంగ విశ్వవిజయాకారంబునన్ వెల్గుచున్
దనరారన్ జయమాలఁ గేలఁగొని చేతఃప్రీతి సంధిల్లఁగన్. 1037

క. మనసున దృగ్లాలస ముం
దునకున్ హ్రీంభరము వెనుకఁ ద్రోయఁగ గుట్టా
ననురాగ మొరుల కెఱుఁగం
జనకుండఁగ దాచుకొంచుఁ జని కని శోభన్. 1038

ఉ. చిత్తరువుం బలెన్ నిలిచి చేష్టలు దక్కినఁ జేడె లాయమన్
బొత్తున మాల రాముమెడఁ బూన్పు మటంచును బుజ్జగింపఁ గే
లెత్తి సనాళ పద్మయుగ మిందునకున్ జయమాలఁ బూన్చి న
ల్లెత్తి జయస్రజం బెటులో హ్రీనశయై ప్రియునట్టుఁ గూరిచెన్. 1039

మ. చెలువారన్ జయమాలఁ బూన్చి వరియించెన్ సీత శ్రీరాము నా
చెలువుం గన్గొని దేవదుందుభులు మ్రోసెం బూలు వర్షించె తేఁ
డుల మోముల్ రవిఁ గన్న కైరవము లట్టుల్ వెల్వెలంబాఱె సా
ధులు మోదిల్లిరి కన్ను కుట్టు చలపాదుల్ రోసి రీర్ష్యాళులై. 1040

మత్తకోకిల :

ఆడి పాడి ర టచ్చరల్ గొనియాడి రెల్ల వియచ్చరుల్
బాడబుల్ శ్రుతిపాఠముల్ స్తుతిపాఠముల్ భట మాగధుల్
బాడి రేయెడఁ జూడఁబో వినవచ్చె మంగళవాద్యముల్
వాడవాడల నేడఁబో వినవచ్చె జైజయనాదముల్. 1041

మత్తకోకిల :

ఇంట నింటను మింట నీధ్వను లెంచుఁబో వినవచ్చె ము
క్కంటి వింటిని ద్రుంచి సీతను గొనలేయుఁడు గెల్చినాఁ
డంట వింటివె యంచు నప్పుడు హారతిచ్చిరి నెచ్చెలుల్
అంటె నొక్కెడ కాంతిరూపము లంచుఁ జూచిరి వారలన్. 1042

మ. చెలిరో! మ్రొక్కవె రాఘవాంఘ్రుల కనం జేడెల్ మహీజాతయుం
డొలుతన్ గౌతమపత్ని పాటు తలఁపుం దోఁపం దదాశంక నం
ఘ్రులనంటం జన దయ్యె నయ్యమ తలంకుం గాంచి కాకుత్స్థుఁ డిం
పలరన్ లేనగ వూనె వారిఁ గని యీర్ష్యాయత్తులై రాన్నృపుల్. 1043

ఉ. పట్టుఁడు పట్టుఁ డయ్య! నృపబాలురఁ జాపముఁ ద్రుంచి నంతఁ జే
పట్టునె రాకుమారి నిటు ప్రాణముతో మన మెల్లరుండ రా
పట్టెలఁ బట్టుఁడీ పుడమి పట్టెని బట్టుఁడి యడ్డు వచ్చినం
బట్టి జయింపుఁ డింద నృపవర్యు విదేహుని సైత మన్న నే. 1044

ఉ. అక్కటిలోక్తులన్ విని ధరాధిపుఁ డొండనె ధర్మశీలుఁడై
యక్కట సిగ్గు దెచ్చిరి నృపాళి మొగంబులు మాడ్చె ధాత ము
న్నెక్కడి శౌర్య సత్యము లవెల్ల పినాకముతోనె పోయె నేఁ
డెక్కడి నుండి వచ్చె నిపుడీబలసత్వము లిట్టు క్రమ్మఱన్. 1045

సీ. గరుడినోటఁ గఱచు కరుడును గరటంబు
సింగంపు దిండిని జెవులపోతు
నిరత కామరతుఁడు నిష్కళంకతయును
లోభి మహాకీర్తి లాభములను
నిర్నిమిత్త క్రోధి నిత్యకుశలమును
శంకర ద్రోహి యైశ్వర్య సుఖము
హరిపద విముఖుండు పరమపదంబును
నాశించు నాశ లీయాశ లరయ!
మిడిసి లక్ష్మణ రోషాగ్ని మిడుత లౌచు
బేలలై మాడి చావ మీ కేలనయ్య
కనుఁగొనుఁడు రాముఁ గన్నుల కఱవుదీర
రోషమదమత్సరంబుల రోసి యనిన. 1046

క. కోలాహల మది విని యా
బాలామణి బెదరఁ దోడి బాలలు గొనిపో
నాలలనామణి ప్రీతిని
లోలో మెచ్చుచును రఘుకులుండుం జనియెన్. 1047

మ. అకటా! యే మొనరింప నుండెనొ కదా! యాదైవమం చంత జా
నకి లో వందురె నప్పు డప్పలుకులన్ సౌమిత్రి యాలించుచున్
వికటభ్రూకుటిలోహితాక్షుల రుషన్ వీక్షించెఁ దన్మత్తరా
ణ్ణికరంబున్ మృగరాజు మత్తకరులన్ వీక్షించుచందంబునన్. 1048

పరశురామాగమనము

చ. కలకలమిద్ది కాంచి పురకాంతలు దూఱుచు భూమికాంతులం
గలవల మొందిరంత శివకార్ముకభంగ మెఱింగి వచ్చె ను
జ్జ్వలతనుఁ డుగ్రమూర్తి భృగువంశలలాముఁడు రాముఁ డానృపుల్
వెలవెలవోయి దాఁగొనఁగ బిట్టలు డేగకు డాగు లాగునన్. 1049

సీ. భూతివిభ్రాజితపూతగౌరశరీర
మల త్రిపుండ్రాంచితమైన నొసలు
క్రోధవివశములౌ రోహితేక్షణములు
రాకేందుముఖము జటాకలాప
మల కుటిలభ్రుకుటు లెపుడు సాజమౌ
చురచురలాడెడు కఱకుచూపు
నురువృషస్కంధంబు వరదీర్ఘబాహువుల్
జారూపవీతముల్ హారములును
తపసిపుట్టంబు మొల నిరుతరకసములు
విలునుగోలలు కఱకుగొడ్డలియు దాల్చి
వీరరస మిట్లు మునివేషధారి యగుచు
వచ్చెనో యన మునితతిన్ వచ్చిచొచ్చె. 1050

తే. రుచిరవేషియు భీమకర్ముండు నైన
భృగుకులీనుని రాకను భీతిఁ జెంది
యులికిపడి లేచి నృపులెల్ల దొరగుచుఁ దమ
తండ్రితాతలఁ బేర్కొంచు దండ మిడిరి. 1051

క. ఆతఁడు హితుఁ డం చెవ్వనిఁ
బ్రీతిఁ గనుంగొను నతండె భీతిలు నను న
ట్లే తెంచు భార్గవుంగని
ప్రీతిని జనకుండు మ్రొక్కి పిలిపించి సుతన్. 1052

శా. మ్రొక్కింపంగఁ దదంఘ్రు లందు భృగురాముం డంత దీవించె న
ష్టక్కన్యం గొనియేగి రంతట వయఃస్యల్ కౌశికుం డత్తఱిన్
మ్రొక్కింపన్ రఘురామలక్ష్మణుల రామున్ నీరదశ్యాము నే
దిక్కుం గానక చూచె నిర్నిమిషుఁడై దివ్యప్రభావశ్యుఁడై. 1053

తే. వారి నాశీర్వదించి యాభార్గవుఁ డెద
నెఱుఁగ నట్టి తెఱంగున నీసమాజ
మేటి కిటఁ గూడె నని యడ్గ నీసు మీఱ
నెఱుఁగఁ బల్కెను జనకుఁ డాహేతు వెల్ల. 1054

మ. విని యంతన్ భృగువంశ ధామనిధి య న్వీక్షించి నల్ చక్కియల్
గని మ్రోలన్ శివచాపఖండయుగమున్ గన్ జాయ కెంజాయఁగాఁ
బెనుకిన్కన్ మిథిలేశుఁ గాంచి యెవఁడీ విల్ ద్రుంచినాఁ డట్టి ధూ
ర్తుని వే చూపుము చూపకున్న దలక్రిందుల్ సేతు నీరాష్ట్రమున్.

మ. అనినం బిడ్డలఁ బోలు నాకటికి ఫల్కాలించియున్ జంకునన్
జనకుం డేమనఁ డయ్యె నయ్యెడ ఖలుల్ శాంతించి రంతం బురీ
జనముల్ గుందిరి దేవతాముని సమాజం బెల్ల భీతిల్లెఁ బా
డొనరించెన్ విధి చక్కఁ జేసియు నటం చోడెన్ మదిన్ రాణియున్.

ఉ. స్రుక్కిన పౌరులన్ మిగులఁ జొక్కి నిమేషము కల్పమట్లుగా
నెక్కొనఁ బుచ్చు జానకిని నెమ్మదిఁ గాంచి విషాదమోదముల్
నెక్కొన నీక రాముఁడు మునిం గని దేవరవారి దాసుఁడే
ముక్కనువేల్పు లివ్విఱిచిపుచ్చిన మూఢుఁ డనుజ్ఞ నిం డనన్. 1057

ఉ. సేవకుఁ డైన సేవలను జేయనగున్ రిపుకృత్య మొంచుచో
జేవను బోర నౌను శశిశేఖరు వింటిని ద్రుంచువాఁడు నా
కావెయిచేతు లాని కెనయౌ రిపుఁ డాతని వేఱుఁ జేయుఁడీ
యీవల కట్లుకాక నృపులీల్గెద రన్నను లక్ష్మణుం డనెన్. 1058

ఉ. చిన్నతనంబునం దిటులు చెండితి మెన్నియు విండ్లుగాని మ
మ్మెన్నఁడు నొక్కరే మన రిటీవిలుపై మమకార మింతయే
లన్నఁ దదుక్తికిం గనిరి యాభృగువీరుఁ డనెన్ నృపార్భకా
తిన్నగఁ బల్కు మిత్తి తలఁ ద్రిప్పెనొ యిట్లు కుతర్క మాడఁగా.

ఉ. ఎన్ని జగత్త్రయప్రథిత మీశశరాసన మన్న దీని కెం
దన్నెము లన్ని విండ్లెనయె యన్నను లక్ష్మణుఁ డాడె నవ్వుచో
యన్న! య నన్యసామ్య మిది యంచు నెఱుంగను గ్రొత్తదంచు మా
యన్న స్పృశించునంత విడె నాతఁ డొనర్చిన దోష మేమిటన్. 1060

క. అక్కట! ప్రావిలు విఱిచిన
నెక్కొనె నేపేరుపరువు నీకిటు లేలా
యక్కర మాలిన కినుపని
లక్కుమనుం డనిన భృగుకులస్థుం డనియెన్. 1061

చ. పరశువుఁ జూచిపల్కు నృపపాంసన! బాలుఁడ వంచు వీడితిన్
గరుణ యొనర్చి, కాని ననుఁ గంటివొ వింటివొ నావిధంబు నన్
బరమజడర్షి గాఁ దలఁతొ పార్థివవంశవినాశకుండనై
ధర భుజశక్తి క్షాత్రరహితం బొనరించి ద్విజాళి కిచ్చితిన్. 1062

మ. విను ముల్లోకము లెన్ను క్షత్రియకులద్వేషిన్ మహారోషినిన్
గను మచ్ఛత్రుసహస్రదోర్దళనదక్షుంబౌ పరశ్వాయుధం
బని చూపించి నిజాయుధంబు నిది గర్భాంతస్థనిర్భేదనం
బును ఘోరంబు వృథాగ దీని కెఱ గాబో కయ్యె వాపోవఁగన్. 1063

ఉ. నావుడు లక్ష్మణుండు నెలనవ్వలరార వచించె నెన్న నో
దీవు మహాభిమాని వని యిందుఁ గుఠారము మాటిమాటి కి
ట్లీవలఁ దీసి చూపు దెదనెంచితె యూప్పలఁ గొండ నూదఁగా
నీవిటు తర్జనిన్ విసర నెండఁగ గుమ్మడిపిందె గానుజూ. 1064

ఉ. ఈవిలునమ్ము లీపరశు పీవరవేషముఁ జూచి పల్కితిన్
నేవరవీరవాక్యముల నీభృగువంశము జందెముం గనన్
నీవెటు లాడినన్ బడితి నేరదు మాకుల ముక్కుఁ జూపఁగా
దేవుల భూమిదేవులను దీనుల ధేనుల దైవభక్తులన్. 1065

క. నీపరుసు లెల్ల సయిఁచుచుఁ
గోపమణఁచుకొంటి నీదు కులమును గనినే
చాపము నపయశమా నినుఁ
గోపాన మతేమి యన్నఁ గొట్టినఁ బడనా. 1066

ఉ. కోపయుతంబు నీపలుకె కోటికుఠారకఠోరధారగా
నేపున మీఱ నేటికయ ! యీవిలునమ్ములు గంద్రగొడ్డలిం
దోపిక మోసె దిట్లు వృథ నోభృగువంశలలామ ! రామ ! నే
నేపరుసుల్ వచించితి సహింపు దయం గని యన్న నుగ్రుఁడై. 1067

మ. ముని గాధేయునిఁ గాంచి భార్గవుఁ డనెన్ మున్యగ్రణీ వి స్మితం
డినవంశేందుకళంక మాత్మకులమున్ హింసింపఁగాఁ జూచు దు
ర్జనుఁ డజ్ఞుండు నిరంకుశుండు పటునిశ్శంకుండునౌ వీనినిన్
విని వారించెదొ మిత్తినోట నిడెదో వే తెల్పుమా ! కౌశికా ! 1068

ఉ. ఏమునుముందె పిల్చి వచియించితి నా దొకయింత తప్పు లే
దో ముని! వీనిఁ గావ మన సొప్పిన మద్బలపౌరుషాదులన్
బ్రాముడిఁ దెల్పి మాన్పు మన భార్గవునిం గని లక్ష్మణుం డనెన్
"నీమహిత ప్రతాపమును నీ వలె నొండొరు లాడనేర్తురే. 1069

ఉ. ఎన్నియొ చిన్నవన్న లిడి యెన్నొ పరుల్ తనచేత లెంచుకొం
చున్నఁ దనంతటం దనివి నొందవిటుల్ రుష నాపుకొంచు నో
యన్న! వితానెతం బడకు మాడఁ దలంచినవేవొ యాడుమా!
యెన్నఁగ మేటిపోటరివె యీవిటు లాడిన వన్నెఁ గాంతువే. 1070

ఉ. పోటరి పోరుఁ గాని తనపోటుబలంబును నోటఁ దెల్పఁ డా
పోటునఁ జాల కూరకయె పోరను బీరములాడు భీరుఁడున్
చీటికి మాటికిం బిలుతు చేకొని వచ్చితొ వెంటమిత్తి నో
పోటరి బాపనయ్య!" యన భూరికుఠారము నెత్తి కిన్కమై. 1071

తే. భార్గవుం డనెఁ బ్రజలార! బాలుఁ డంచుఁ
బరుసుల సయించినకొలంది దురుసుతనము
మేర మీఱెడునేస్సెపనేర నింకఁ
జంపఁ దగువాఁడు కటువాది చనవుమాలి. 1072

తే. నా దొకింతయు దోషంబులేదు కాదె
యనిన గాధేయుఁ డపరాధమును సహింపుఁ
డర్భకుని యాగడము నెంత్రె యార్య లనినఁ
గినుక రగులగ మగుడ నిట్లనె నతండు. 1073

ఉ. చేతను గొన్నదో పరశు చేసువనో గురువైరి నేనొ ని
ర్హేతుకకోపమూర్తి నుర కిట్టు లెదుర్చుచు నున్న వీనిఁ జే
సేతుల వీడినాఁడ, ఋషిశేఖర! నిన్ గని కాదె కానిచో
శాతకుఠారధార నరిఁ జంపి గురుర్ణముఁ దీర్చుకో నొకో. 1074

క. అనఁ గౌశికుఁ డెంచెను ము
క్కనువేలుపు వింటిఁ జెఱకు కణుపటులు పెళు
క్కన విఱిచిన హరి నరిగాఁ
గనె హరితత్త్వంబు నేల కనఁ డితఁ డనుచున్. 1075

మ. మహితౌజస్కుఁడు లక్ష్మణుం డపు డనెన్ "హానీంద్ర! నీశీల మీ
మహి నెవ్వం డెఱుగండొ ? యద్ది త్రిజగన్మాన్యం బగుం, దీర్చి తీ
రహాహా! మాతృ పితౄణముల్, సరిగ నిష్టం బెన్ గురుర్ణవ్యథల్
అహాహా! యద్దియు మాతలన్ నిలిపితీ వౌ వృద్ధియుం జాలగా. 1076

క. మాతల నెట్టితి వాబుణ
మీతఱి కది వడ్డి హెచ్చ నేగె దినంబుల్
ప్రీతిఁ బిలువు వ్యవహారికు
గోతాముం దెఱచియిత్తు గుణితధనమ్మున్." 1077

మ. అనుఁడుం బోటరి బాపనయ్య ప్రజహాహాకారముం బెట్టఁగాఁ
గినుకన్ ఘోరకుఠార మెత్తఁగనె పల్కెన్ లక్ష్మణుం "డగ్రజుం
డని నిన్ వీడితి, గొడ్డలెత్తెదవె క్షత్రఘాతకా! మీదు బా
పనదేవుళ్ల మహత్తు లిండ్లకడఁ జూపంగాదె కన్పట్టెడిన్. 1078

ఉ. ఇంతకుఁ బోటుబంటొకఁడు నీడగువాఁడు లభింపఁ డయ్యెడిన్
సంతస మొప్ప" నన్నఁ గనుసన్నల నన్న యడంచెఁ బౌరుల
ట్లంతటి హేళి కూడదని రా భృగురామరుషాగ్ని మండఁ గొం
డంతగ, లక్ష్మణోత్తరఘృతాహుతి, వాక్సుధ దాని నార్పఁగా.

శా. రాముం డిట్లనె "దేవ! భార్గవ! కృపన్ రక్షింపు మీబాలునిన్
నీమాహాత్మ్య మెఱుంగనేర కిపుడున్ నీతోడ నాతోఁడిటుల్
సాముల్ సేసెఁ,బయోముఖుండు గద యోస్వామీ! కటాక్షింపుమా!
యామోదింపరె బిడ్డ లాగడముసేయన్ దల్లిదండ్రుల్ గురుల్. 1080

మ. క్షమమున్ శాంతిఁ గలట్టివాఁడ వీకఁ గిన్కంబాసి యీకింకరున్
క్షమియింపం గద వన్న !" యన్న ద్విజుఁ డల్కన్ వాయ సౌమిత్రి త
త్క్షమ నీక్షించి హసింప నానఖశిఖాక్రాంతక్రుధం బల్కె ని
క్కము నీతమ్ముఁడు కాలకూటముఖుఁ డౌఁగానీ పయోవక్త్రుఁడే.

ఆ. నీచుఁ డతఁడు వీని మైచాయ గెంజాయ
కాని కప్పు కప్పె లోనిచాయ
సహజ వక్రబుద్ధి సరివచ్చునే నీకుఁ
గానఁ డేల మిత్తి కరణి నన్ను. 1082

మ. అనుఁడున్ భార్గవుతోడ నిట్లనె సుమిత్రాతోక్మద్భవుం డమ్మెయిన్
వినుమా, కోపము పాపమూలము జనుల్ విశ్వప్రతీకార వ
ర్తనులై కాని పనుల్ బొనర్తు రెదఁ గ్రోధం బూనియే కాదె య
క్కనలున్ లోనెడఁ బాసి నన్నుఁ గరుణం గన్గొమ్ము నీదాసుఁడన్.

ఆ. అలిగి నంత మాత్ర నతుకునె ప్రావిల్లు
కాలు నొవ్వ నిలువనేల స్వామి
ప్రాఁతవిల్లె మీకుఁ బ్రీతిపాత్రం బైనఁ
గబుసుఁ బంపుఁ డతుకుఁ గమ్మరీఁడు. 1084

చ. అనుఁడు విదేహభూవిభుఁ డనర్హ మిటుల్ మితిమీఱు టొప్పదం
చనె భయ మంది పౌరజనులంత వణంకుచు నాటగాఁ డితం
డని రట లక్ష్మణుం గని రుషాకులుఁడై యొడలేర్చ దోర్బలం
బును సడలంగఁ బూషకుల భూషణుఁ గన్గొని భార్గవుండనెన్. 1085

చ. పొలుపుగ నీదుభ్రాత విషపూరిత హైమఘటంబు మాడ్కి లోఁ
గలఁ కది నిండ బంగరునిగన్ బయికిం గనుపట్టు వీనినిన్
నులుమక నీయనుంగని కనుంగొని పీడితినన్న లక్ష్మణుం
డెలనగ వొప్ప నన్నఁగని యించుక జంకి గుసుం గనంజనెన్. 1086

చ. మృదుమధురోక్తులం బలికె మెల్లన రాముఁడు కేలుమోడ్చి ప్ర
ల్లదముల సైపు మో భృగుకుల ప్రవరా! చెవిఁ జేర్పకానుడుల్
వదరెడు వారు బాలకులు వారిస్వభావము లొక్కటా బుధుల్
జెదరఁగఁ జేయరా దితఁడు చేసెనె దోషము దోషినేను జూ. 1087

క. కనికర మొనర్తొ కినుకనె
కనఁ బరుతువొ కొట్టఁ దలఁతొ కట్టం దలఁతో
మనుతువొ తునుతువొ పనుతువొ
పొనరింపు యథేచ్ఛ బంటు వోలెను నిలుతున్. 1088

చ. కినుక తొలంగుభంగి నెఱిఁగింపు మెదే నొనరింతు నన్న నేఁ
గినిసి యొనర్ప లేద యొకకీడును నీయనుజన్ము నట్టు క
న్గొనియును మత్కుఠారగతిఁ గుంఠితకంఠు నొనర్పనైతి నా
కినుక యదెట్లుపోవు సరిగెల్వున మార్తుఁడు ప్రోలనిల్వఁగన్. 1089

చ. కటకట దేనిభీతి నృపకాంతల గర్భములున్ స్రవించె న
ప్పటు నిశితాయుధంబుఁ జెయిఁ బట్టియుఁ బ్రాణముతోడ నిల్వ న
క్కట! పగతుంగనన్ వలసెఁగా విధి చెర్గుని క్షత్రఘాతమా
కటికి కుఠారమున్ మొరడుగాంచునె నాదశ మాఱకున్నచో. 1090

క. ఎక్కరణి మాట నైజం
బక్కట యిక్కటికి గుండె యక్కటికమునం
జిక్కెను భుజములు వశమునఁ
జిక్కవు మదిఁ గిన్కచిచ్చు సెగ లీనంగన్. 1091

తే. దారుణవ్యథఁ గుడిపెను దైవమన్న
భార్గవుంగని సౌమిత్రి పలికె నిటులు
ఘనకృపామూర్తి వౌదు కానని యిటీవు
పలుకుచుంటివి పూలను జిలికి నటులు. 1092

క. కృప కలిగినపుడె వేగిన దివు
డీతను వెట్టు కినియు నెడ వేఁగదా కో
కృపఁ గనవలె విధియన "నీ
నృపసుతుఁ డయ్యమపురంబె సెలవుగఁ గోరున్. 1093

మ. కనులన్ వేచుచు నుండె నీశరుఁ గులాంగారున్ వెసన్ ద్రొబ్బు డిం
కను గంటం బడకుండ నన్న నగుచుం గండ్లొక్కటన్ మూయుచోఁ
గనరా రెవ్వ రటంచు లక్ష్మణుఁడు పల్కన్ భార్గవుం డంతఁ గ్రో
ధనుఁడై రాఘవుఁ గాంచి విల్ దునిమి బోధం బిట్లు గావింతువే.

క. తమ్ముని పరుసులు నీకును
సమ్మతములె కేలుమోడ్తుసద్వినయమునన్
సమ్మదు నొనర్తొ నను జన్య
మ్మొనరిచి లేక రామనామము విడెదో. 1095

ఉ. పన్ని పెనంగినన్ గెలుతొ భ్రాతృయుతంబుగఁ గూల్పమందువో
నిన్నని గొడ్డలెత్తఁ గని నేరము తమ్ముని దీసు నాపయిం
దిన్నని వాఁడె యెల్లరకుఁ దేలిక, బీతగు వక్రబుద్ధిఁ గ
న్గొన్న నె యెందు రాహువును గ్రుక్కఁగొనం డల వక్రచంద్రునిన్.

ఉ. రోసము వీడు మయ్య! యిదె ద్రోలను నాతలయుండెఁ జేతనో
యీసును దీర్చుకో పరశు వేర్పడియుండె యథేచ్ఛ సేయుమీ
వేసము విల్లునమ్ముఁ గని వీఁడు వంచుఁ గులోచితంబులౌ
బాసల నాడెఁగాక మునిపద్ధతి వచ్చిన నంఘ్రము లంటఁడే. 1097

క. మా యనుజుఁడు నిన్నెఱుఁగ
కమాయకుడై పరుసులాడె భూమ్మసురవర! మ
మిమ్మాయనుఁగుల మని తలఁపుఁడి
యేయెడఁ బ్రభు భటులఁ గయ్య మిట్టిది తగునే. 1098

సీ. అజ్ఞాని చేసిన యాగడంబుల సైఁపు
మగ్రజుల్ క్షణకోపులంట వినవె!
యే రామనాముఁడ నీవో పరశు మయ
ప్రత్యక్షరాధిక పూర్వ రామనామి
వస్మద్ధనుర్గుణ మారయ నొక్కండు
నీ గుణమ్ములు తొమ్మిదా గణింప
మీ రేడ మే మేడ మిముఁ బోలు టేడను
శిర మదేడ నదేడఁ జరణయుగము

ఓడితిమి మేము మీకెల్ల పోడిములను
సైఁపు బాపఁడ మాయపచార మంచుఁ
బలుమఱులు వేఁడ రాముఁడు బాపఁడంచు
గినిసి ద్విజుఁ డనె నీవు నా దనుజున కెన. 1099

ఉ. బాపఁడు బాపఁ డందు నను బాపఁడనెట్టిడనో యెఱుంగు మ
త్తోకపక్ర శాను నందునఁ జతుర్విధసేన సమిచ్చయంబుగా
ఝ్మాపతు లెందఱో పశులుగా శరమాహుతిగాఁగ విల్ స్రువం
బై పొలుపారఁ గోటిరణయజ్ఞము లేపునఁ జేసి నట్టిఁడన్. 1100

క. నాదు ప్రభావము నెఱుఁగక
వాదించెదు విప్రుమాత్రు భావించితె నన్
మేదిని నెల్ల జయించిన జో
దటు విల్విఱిచి మదముఁ జూపెద వౌరా. 1101

ఉ. నాపుడు రాముఁ డిట్లనెఁ "గనంబడ దింత మదీయదోష
ప్రావిలు ముట్టినంత విడె భార్గవ! నే గరివింతు దేని కి
ట్లివిధి నింతమాత్ర కిటు లీసును జూపుదు మాపయిన్ బరీ
భావమె యెంతుమేని మము పాదముఁబట్టని దిట్టఁ డుండునే. 1102

మ. పదముల్ బట్టని దిట్టఁ డుండునె పరీభావంబె మేమెంచినం ?
త్రిదివేశాసురమర్త్య వీరుల బలాతీతుల్ సముల్ గాని మ
మ్మెదిరింపన్ రణభూమి మృత్యువయె రానిం డీ విలాసంబుగన్
జెదరం బోదుము యుద్ధభీరువన సీ! సీ! జాతికిన్ మచ్చయా. 1103

చ. కులము పొగడ్త కాదు ; రఘుగోత్రులు మిత్తికినేఁ గలంగ రె
క్కలనున, నిక్కమాడితిని ; గాంచుము విప్రకుల ప్రభుత్వ మిం
దళుకది లేక పోయిన భయం పడువారము మీకు"నం చిటుల్
పలికెడు తన్నిగూఢ మృదు వాణికి భార్గవహృత్కవాటముల్. 1104

మ. విడి నంతం గని యాతఁ డారఘుపతిన్ వీక్షించి, మత్సంశయం
బెడయన్ విష్ణుశరాసనంబుఁ గొను మం చీయంగఁ, దానంతటన్
వడి కర్షింపఁ బడెన్ భృగూద్వహుఁడు నెవ్వన్ నివ్వెరం జెంద మేన్
వడఁకన్ వేఁడె నెఱింగి రామవిభుతత్త్వం బంతరంగంబునన్. 1105

సీ. రవికులాబ్జ పతంగ! శివహృత్కమల భృంగ
అమరగోవిప్రహితాంతరంగ!
జిత శరీరద్యుతి శతసహస్రానంగ
కామాదిరిపు భంగ! ఘననిభాంగ!
కమనీయసర్వాంగ! కరుణామయాపాంగ
సర్వగుణాసంగ! సత్త్వసంగ!
కటినిబద్ధ నిషంగ! పటుకుబుద్ధి విభంగ
గంగాధరధనుర్విభంగ! రంగ!
నిన్ను సన్నుతిసేయ నే నేర్తు నెట్టు
లెన్నొ పరుసుల నాడితి నిన్నరయక
నన్ను దయఁజూడుమా" యన్న యన్ని సైఁచి
తాల్మి కిమ్ములు మీయనదమ్ము లనుచు. 1106

క. జయ జయ రఘుకులసోమా!
జయయని జే జేలు వెట్టి చనెఁ దపమునకై
పయన మయి భార్గవుం డట
భయమున నృపు లడఁగి రందు పరచిరి భీరుల్. 1107

క. కురిసి విరివాన మ్రోయిం
తురు భేరీశంఖఘోల దుందుభుల సురల్
పురకాంతల మురిపెంబుల
నరుసంబులఁ బొగడఁ దరమె యపు డహిపతికేన్. 1108

క. కురిసెను బూవుల వానలు
మొరసెను మంగళరవమ్ము మోదము మీఱన్
గరితలు కోకిల వాణులు
సొరిది నిలిచి పాడి రపుడు శుభగీతములన్. 1109

జనకరాజు దశరథునకు శుభవార్త నంపుట

చ. జనకజ భీతిఁ బాసె నెరచందురుఁగన్న చకోరికం బలెన్
జనకుఁడు పెన్నిధిం గనిన జన్మదరిద్రుని భంగిఁ బొంగుచున్
గని కుశికాగ్రజుం గనఁగ జాగిలి మ్రొక్కి మునీశ! మీకృపన్
ధనువును ద్రుంచి వీరు నను ధన్యు నొనర్చి రిఁకేమొనర్పనా. 1110

చ. తెలుపు మనన్ మునీశుఁడు విదేహ! వివాహ మధీనమూ ధను
ర్దళనము తోడ, నాధనువు బ్రద్దలుగా నయి నట్టె పెండ్లి, వే
ల్పులు నరనాగు లెల్ల గన భూవర! నీకులరీతి సేయుమా
తెలియుము పెద్దలన్ ద్విజుల దేశికులం బిలిపించి యంతయున్. 1111

ఉ. అంపుము దూతలన్ దశరథాధిపు ప్రోలికిఁ బిల్వఁగా ననం
బంపెద నిప్పుడేయని నృపాలుఁడు దూతలఁ బంచి కొందఱం
బంపెఁ గవాటములఁ బాటలఁగోట నలంకరింపఁగాఁ
బంపిన వారు పంత్రు పనివారికిఁ జాందినులన్ రచింపఁగన్. 1112

చ. అనిచిన వారి యాన శిరమందిడి మంటపసత్త్రి-యూర్ధ్వలా
ఘనకుశలాత్ములం బిలువఁ గట్టిరి ముందుగ విశ్వసృట్టు నె
మ్మనమున నెంచి వార లట మానుగఁ బైఁడి యనంటికంబముల్
ఘనమణులాకులుం బువులుఁ గాయలుగా విధియున్ భ్రమింపఁగన్.

ఉ. పచ్చలమానికంబులను బల్లవ సంయుత వంశజాతులం
దచ్చుగఁ బైఁడితోఁ దమలపాకుల భేదమెఱుంగరాని య
ట్లచ్చుగ శిల్పు లాత్మకళ లేర్పడ ముత్తెములుంచి గ్రుచ్చి పల్
పచ్చలఁ గెంపురాలఁ బలుపద్మములన్ విరచించి రింపుగన్. 1114

సీ. మంగళద్రవ్యంబులం గొని యున్నట్లు
దేవతాప్రతిమలఁ దీర్చి దిద్ది
బహువర్ణములతోడఁ బక్షి బంభరముల
గాలివీచినఁ గూయుకరణి నిలిపి!
కుంభి కుంభంబులం గూర్చిన ముత్యాల
నీటగు చౌకుల నింపి నింపి
పట్టుత్రాడునఁ గ్రుచ్చి కట్టిరి తోరణం
బులు నీలమాణిక్యములె రసాల
పత్రములుగఁ బూగ్గెలలుగ బంగర మది
పచ్చరాల్ బిందెగెలలుగఁ బ్రతిభమీఱఁ
జిత్తజుఁడు తాను బ్రేక్షకచిత్తములను
వసపడం గొన పన్నిన వలయనంగ. 1115

క. మణిమయదీపంబుల రా
మణీయకముఁ దద్విచిత్రమంటపశోభల్
గణుతింపనౌనె యాప
ట్టణమున నిల్లిల్లు రా బిడారుల మీఱున్. 1116

తే. భువన జనయిత్రి వధువఁట భూమిపుత్రి
రూపగుణశీల రుచిసాగరుండు వరుఁడు
రాముఁడల సర్వలోకాభిరాముఁ డట్టి
వారి కల్యాణ విభవముల్ బలుకఁ దరమె! 1117

శా. అవ్వీటం గల పేదయింటిసొబగున్ స్వాధీశుఁ జొక్కించుఁ జు
మ్మెవ్వీడున్ పరిపోల దామిథిల కెం దీ రేడు లోకంబులం
దవ్వాడన్ సిరి మాయరూపున వధూవ్యాజంబునం బుట్టఁగా
నెవ్వాఁడుం గొనియాడు వాఁడె పురిసౌ రాశేషభాషాదులున్. 1118

మ. చని సాకేతపురంబు దూతలట రాజద్వారముం జేరి రా
జున కంపింప నిజాగమం బతఁడు వేఁజొప్పింపఁగాఁ బంచినన్
వినయం బారఁగ వచ్చి పత్రమును భూభృన్మౌళి కందిచ్చి ర
య్యనఘుల్, మేను గగుర్పడన్ గనులు హర్షాశ్రుప్రపూరంబుగన్.

తే. గద్గదిక తోడ దశరథక్ష్మావిభుండు
లేఖఁగొని యెట్లొ పఠియింపలేక యోగు
బాగులు వచింప నేర కీపత్ర మిద్ది
రామసౌమిత్రులను గూర్చి వ్రాసినదని. 1120

ఉ. అచ్చుగ లేఖ నెట్టొ ముగియం జదువన్ విని మోదమొంది రం
దచ్చటి సభ్యులెల్ల రట నాడెడు నాభరతుండుఁ దమ్ముఁడున్
వచ్చి 'యి దెందునుండి యిటువచ్చె సుఖుల్ గద రామలక్ష్మణుల్
ఎచ్చట నుండిరో తెలుపవే'యని నెయ్యము మీఱ పల్కినన్. 1121

ఉ. వారి ప్రియోక్తులన్ విని నృపాలుఁడు లేఖఁ బఠించి విన్చినన్
వా రపు డుబ్బి గంతులిడ వారిరి ప్రేముడిఁ గాంచి తత్సభా
స్తారు లపారమోదమునఁ దద్భరతప్రియ ముగ్గడించి రా
క్ష్మారమణుండు దూతలను మన్ననఁ బిల్చి శుభంబు నారసెన్. 1122

దశరథుఁడు శుభవార్తవిని మిథిలాప్రయాణసన్నాహము లొనర్చుట

మ. “కనులం గాంచిరె మీరు మాయనుగులం గల్యాణమే వారి కా
మునివెంటన్ ఘనగౌరవప్ణు లనదమ్ముల్ గేలవిల్లమ్ములం
గొని వర్తింత్రు కుమారు లిర్వు రెపుడేన్ గుర్తించిరే వారి న
మ్ముని వెంటం జనుటాది వారి కుశలమ్ముల్ నేఁడె చూ విన్నడెన్.

మ. జనకుం డెట్టు లెఱింగె వారిఁ జెపుఁడీ సౌఖ్యంబె కా వారి” కం
చనుచున్ వేమరు సేమ మడ్గు నృపు ప్రేమాయత్తచిత్తం బటుల్
గని వారంద్రిటు “విశ్వభూషణుల లోకస్తుత్యులం బుత్రులన్
ఘనులం గన్న మహానుభావుఁడవు నొక్కండీడె నీ కెందునన్. 1124

తే. రాముఁ బోలిన జగదభిరామసుతులఁ
గన్న నీభాగ్య మేమని యెన్ను వార
మనఘ ! వారలు విశ్వకల్యాణకారు
లయి వెలింగింతు రీజగత్త్రయి సతంబు. 1125

ఉ. వేరి యశఃప్రభం బవట వేవెలుఁగున్ నిసి రేవెలుంగు బే
జా రయి తేజుజార పలుచం బడు వారో, మహాప్రతాపుల
వ్వారల నెల్లెఱింగి రని పల్కుదు ప్రొద్దునుఁజూప దివ్యాయే
లారమణీయమూర్తి ! విను మాత్మజు విక్రమ ముగ్గడించెదన్. 1126

చ. జనక సుతాస్వయంవరణశాలకు వచ్చి యనేక భూపతుల్
ఘనభుజశక్తి యుక్తుల నొకం డొకరిం దల మీఱు వీరులై
ధనువుఁ గదల్ప లేక బలదర్పము లోడిరి ముజ్జగాలఁ బే
ర్కొనఁబడు వీరులెల్ల కొనగోటను మేరువుమీటు మేటులున్. 1127

క. మేరువు నెత్తు సురాసురు
లూరక రజతాద్రి నెత్తుచుండు దశాస్యుం
డారీతి వింటికోడిరి
భూరిభరోపేత మట్టి పురహర ధనువున్. 1128

శా. త్రుంచెన్ నీ తనయుం డిభంబు బిసముం దొండంబుచేఁబోలె నే
తెంచెన్ భార్గవుఁ డంతఁ గన్గవఁ గ్రుధోద్రేకంబు తీండ్రింపఁగన్
వంచింపంబడి రామసత్త్వమునకున్ వందించి విష్ణ్వస్త్ర మం
దించెన్ వాని కతండు,వింటె నృప! తద్వీర్య ప్రభావోన్నతిన్. 1129

క. రాముం డెటు బలతేజో
ధాముండో లక్ష్మణుఁడును దాదృశుఁడె సుఁడీ
భూమీశు లతని చూపున
కామృగరాజమున కేన్గు లటు బెదరుదురా. 1130

ఉ. క్ష్మావర! నీ కుమాళ్ళఁగని క్రమ్మఱ నేసుకుమారుఁగన్న నా
పోవవు మాదుచూపు" లన భూపతి తచ్చతురోక్తి మెచ్చి యె
న్నేవిధులైన కానుక లిడియెన్ మొగమోడి భటుల్ తలంకఁగా
నేవిధి మాకు మీకెలన నిట్టి పరిగ్రహ మొప్పదం చెదన్. 1131

తే. ఉడుగరల్ గొన మోమోట పడెడు భటుల
ధర్మబుద్ధికి మెచ్చిరి తత్సభికులు
గురు వసిష్ఠున కంత నన్నరవరుండు
లేఖ నందించి శుభముఁదెల్పిన నతండు. 1132

ఉ. "చేరును బుణ్యపూరుషుల శీలనిధానుల సౌఖ్యసంపదల్
వారెదఁ గోరకుండినను వార్ధిఁ దమంతటఁ జేరు వాహినుల్
తీరునఁ బుణ్యకోటికి క్షితిం బరువంబడు సర్వసంపదల్
భూరమణా! భవత్సదృశ పుణ్యుఁడొకండుఁ గనం బడం డిలన్. 1133

క. దేవద్విజగురుగోగణ
సేవారతమతులు నీదుచెలువలు నీవున్
నీవలె రాముని బోలిన
ధీవరసుతుఁ గన్న సుకృతి తెలియం గలఁడే. 1134

క. ధీరులు సద్ధర్మవ్రత
ధారులు గుణనిధులు నైన తనయులు గల నీ
కారయ సముఁ డొకఁ డుండునె
భూరమణా! లెమ్ము శుభముఁ బొందుము వేగన్. 1135

చ. పరువును నిచ్చలున్ సకలభద్రము లొయ్యన నిన్ నరేంద్ర! వే
తరలు విదేహరాట్పురికిఁ దద్దయు వేడ్క—" ననన్ గురూక్తి కం
దరుసము నొంది పంక్తిరథుఁ డంతిపురిం గల రాణులందఱన్
బెరిమను బిల్చి లేఖ వినుపించెఁ బఠించి ప్రహృష్టచిత్తుఁడై. 1136

మ. విభువాణిం దమి మేఘనాదము శిఖుల్ విన్నట్లు వారంద ఱా
శుభసందేశము నాలకించి కని రస్తోకప్రమోదంబు భూ
విభుఁ డంతం దెలిపెన్ సమగ్రముగఁ దద్వృత్తాంత మ ష్టందఱా
శుభలేఖం దమి నక్కు నద్దుకొని రచ్చో నెక్కుడౌ మక్కువన్. 1137

శా. దీవించెన్ గురుపత్ని మోదమునఁ బ్రీతిం బొందఁగా రాణు లా
భూవర్యుండు నుతించుచున్ సుతయశంబుం గౌశికానుగ్రహం
బే వేరీతులఁ గూర్చి భద్రముల నం చేగెన్ మహీదేవులన్
దేవేరుల్ బిలిపించి యీవు లిడి రాప్తిన్ వారు దీవింపఁగన్. 1138

క. పిలిపించి భిక్షుకోటిని
బలు దానము లొసఁగ వారు 'పార్థివసూనుల్
వెలయుతను జిరాయువులై
యిల' నని యాశీర్వదించి యేగిరఁ టంతన్. 1139

క. కట్టుచుఁ బలుపుట్టంబులఁ
గొట్టఁగ దుందుభులు డోల్లుఁ గుతుక మలరఁగా
నిట్టి శుభోదంతం బా
పట్టణ మంతటను నిండెఁ బ్రతిగృహ మందున్. 1140

క. ఈరేడు జగమ్ముల సీ
తారామవివాహసమ్మదమ్ములు నిండెం
గేరింతల పౌరులు సిం
గారం బొనరించుకొని రగారము లెల్లన్. 1141

ఉ. రామపురం బయోధ్య యభిరామశుభాస్పదమైన నిచ్చలుం
బ్రేముడి మీఱఁ బ్రోలు సవరించిరి మంగళవస్తుసంతతిన్
హైమఘటంబులన్ మణిగణాంబర భూరివితానరాజులన్
జామరతోరణంబుల బజారుల నెల్ల నలంకరించుచున్. 1142

క. మంగళమయ మగు రచనల
శృంగార మొనర్చి రంత శ్రీరామపురిన్
భృంగారు కలశములతో
రంగారు పతాకరాజి రాజిల్లంగన్. 1143

చ. దధియుఁ బయో హరిద్రసుమదామము లక్షతలాదిగాఁగఁ బల్
విధముల భద్రవస్తువుల వేవిధులన్ సమకూర్చి రంతటన్
విధువదనల్ మృగేక్షణలు వేషవినిర్జిత రత్యహంకృతుల్
మధురకలస్వనంబులను మంగళగీతముఁ బాడి రింపుగన్. 1144

చ. తమకముతోఁ బురీజనులు తామును గీముల దిద్ది రందు భూ
రమణుని సౌధ మెన్నఁగఁ దరంబె వితానము విశ్వమోహనం
బమర రచించి రొక్కెడ సమంచిత శస్త్ర ప్రశస్త వస్తువుల్
డమరు మృదంగభేరులును ఢంకలు మ్రోసెను వీట నెయ్యెడన్. 1145

ఉ. ఒక్కెడ వంది లాడ బిరుదోక్తుల, నొక్కెడ వేదగానముల్
మక్కువసేయ బాడబులు, మానిను లొక్కెడ జానకీశులన్
మిక్కిలిఁ బేరుకొంచు రహి మించుచుఁ బాడ, ముదంబు నిండి నల్
దిక్కులఁ బొంగి యందిముడలేక నృపౌకము నిండి పొంగె నాన్. 1146

క. సర్వసుపర్వ శిరోమణి
యుర్వర నేయింట జనన మొందినవాఁ డా
యుర్వీశు భవ్యగేహముఁ
బర్విన శోభల నెవండు వర్ణింపఁ దగున్. 1147

చ. భరతునిఁబిల్చి రాజు గజవాజి రథాళి నలంకరింప స
త్వర మొనరింపు రాఘవవివాహ మహస్సున కేగ నన్న సం
బర మిగులొత్తఁగా నతఁడుఁ బంపెఁ బ్రధానుల కాజ్ఞఁజేసి వా
రరిగిరి జీను బూనిచి హయంబుల వేగ నలంకరించి తేన్. 1148

ఉ. మేలిరకంపుఁ దేజులు సమీరుని మీఁటియుఁ బర్వ నెంచె నాఁ
గాలెడు లోహ మందునను గాలిడుకై వడి నేలఁ గాలిడున్
జాలరకంబు లెన్నఁగ వశం బగునే భరతాదు లట్టి గు
ఱ్ఱాలపయిన్ సవారు లొనరం బొనరించిరి భూషితాంగులై. 1149

క. సుందరహయములపై నృప
నందను లానంద నిధులు నలువుగఁ జేవిం
డ్లందముగఁ దాల్చి కటితట
మందునఁ బొదిఁ బ్రేల నెక్కి రతిమోదమునన్. 1150

క. ఎక్కుడు లెక్కుడు లెక్కిన
చక్కని యుక్కరుల వెంట జంటగ బంటుల్
నెక్కొనుదు రసి కళాయుతు
లొక్కొక రుక్కునను బేరు నొందినవారల్. 1151

మ. వరయోధాకృతు లూని వారటు పురీబాహ్యప్రదేశంబులన్
వరవాహంబుల స్వారిసేసి రచటన్ బల్ పోకలం ద్రిప్పు చ
త్వరవాద్యధ్వని కుబ్బు నవ్వి రథముల్ పల్ పోకలన్ దిద్ది ర
త్తతి ఘంటాధ్వజ చామరాభ గెలువం దద్భానుధ్యానప్రభన్. 1152

మత్తకోకిల :

శ్యామకర్ణహయాళిఁ బూన్చిరి స్యందనంబుల సూతు లా
రామణీయముఁ గన్గొనన్ మునిరాణ్మనంబులె భ్రాంతపూ
భూమిపైఁబలె నీటనుం జను బ్రుంగ దద్దు జవంబునై
నామెయిన్ సవరించి తే ర్వెలునమ్ములన్ రథసారథుల్. 1153

తే. పిలువ రథికులు వచ్చి తేరులను గూరు
చుండి రంతటఁ బెండ్లివా రూరిబైట
నందఱుం గూడ శుభశకునాళితోఁచె
సరణి గమననిమిత్తానుసారముగను. 1154

క. కరుల యలంకరణం బే
కరణిని వర్ణింతుఁ బూన్పఁగా నంబారుల్
దరలె మదకరులు గంటలు
మొరయ నభోమేఘరాజి మొరయు ననంగన్. 1155

ఉ. ఇంతియకాక యానముల నెన్నొవిధంబుల యందలంబులన్
సంతసమొప్ప నెక్కిరి ద్విజప్రవరుల్ శ్రుతిమూర్తులో యనన్
గొంతకు వంది మాగధులుగూడి యథోచిత వాహనంబు ల
త్యంతముఁ బ్రీతి నెక్కిచని రంటె భరంబును మోయుచోం టెలున్.

ఉ. మోయు చగణ్య వస్తుభరమున్ వృషవేసరసంతతుల్ జనెన్
బోయిరి భారవాహకులు భూరిభరంబును బూని వెంబడిన్
బోయె భటౌఘ మా వెనుకఁ బూని నిజోచిత భూరిభారముల్
కాయము పుల్కలన్ గగురఁగా ముద మొందుచుఁబోయిరందఱున్.

## దశరథుఁడు సపరివారుఁడై మిథిలాపురమున కరుగుట

ఉ. కందుము రామలక్ష్మణులఁ గన్నుల పండువుగాఁగ నెన్నఁడం
చందఱు నాససేయుదురు హస్తులు ఘీంకృతి వెట్ట వార్వముల్
స్యందనపంక్తి లాగ రొద సల్పఁగ నేన్గులు ఘంటికాధ్వనిన్
దుందుభి నాదముల్ జెలఁగఁ దోఁపవు నొండొరులాడు మాటలున్.

క. భూపద్వారంబున ప్రజ రా
పిడికిని రాలుఁ గరఁగి రజమూ నన నా
తేప గుమిఁగూడి రట ప్రజ
చూపట్టిరి పొలతు లంత శుభహారతులన్. 1159

క. వేడుకలన్ శుభగీతముఁ
బాడుచు హర్మ్యాగ్రహములను వఱలఁగ నచ్చో
జో డరదంబుల సారథి
వేడుక నాయత్తపరచి విభుసన్నిధిఁ దేన్. 1160

ఉ. తేజునఁ బ్రొద్దుతేజుల నెదిర్చెడు తేజులఁ బూన్చి తెచ్చినన్
రాజరథధ్వయం బది సరస్వతికేని యవర్ణ్య మయ్యె నా
రా జటఁ గూరుచుండ నిడి రాజసమాజము నొక్క తేరునం
దేజము మీఱ నెక్కె నొక తేరునఁ దాను వసిష్ఠమౌనితో. 1161

క. గురుని గణేశు నుమేశుని
స్మరియించుచు నరద మెక్కె క్ష్మాపతి యలరెన్
గురుని వసిష్ఠుని కెలనున
సురగురునిం గూడుకొన్న సుత్రాముఁ డనన్. 1162

తే. శ్రుతికులాచారము లొనర్చి క్షితివిభుండు
తరలె గురునాజ్ఞ నా రఘువరుఁ దలంచి

పర్వ దివి భువి శంఖారవంబు నిండి
భేరులను గొట్టి వేల్పులు విరులు గురియ. 1163

క. నింగిని గోలాహలము లె
సంగెను సన్నాయి మ్రోగె స్వరగీతములన్
మంగళములఁ బాడిరి దివి
జాంగనలు వివాహవాద్య మప్పుడు మ్రోసెన్. 1164

ఉ. కాలిబలంబు తిర్గెఁ బడగల్ ధరియించుచు మ్రోసె గంటలుం
గేళి యొనర్త్రు హాసకులు గీతముఁబాడిరి గాయకాగ్రణుల్
తాళగతిం దొలంగక మృదంగరవానుగతిం బదంబిడన్
మేలి పటాణులన్ నడువ నేర్పిరి రాకొమరుల్ నటుల్ గనన్. 1165

క. అభి వర్ణింతును వారల
యభిమత శుభసిద్ధిదంబులౌ శకునములన్
శుభశకునము లటు తోఁచెను
రభసమ తా నిజముగాఁ దలంచిన యట్టుల్. 1166

సీ. శుభపరంపరఁ జూపఁ జూపట్టెనో యనఁ
జూపట్టె నెదురయి సుశకునములు.
దాపటన్ మేయుచుఁ జూపట్టె నెమళులు
జెలఁగెఁ గాకమ్ములు వెలుపలదెస!
నకులలోమశదర్శనములు మాటికి నయ్యె
మృగమాల కుడిదెస మగిఁడి వచ్చె
ననుకూలగతి వీచె ననిలుండు త్రివిధమై
శకునులు శుభమాడ్కెఁ బికము లెసఁగె

తే. డింభకుల నెత్తుకొని పూర్ణకుంభముఁ గొని
వచ్చు బాలఁతులుఁ బుస్తకపాణులైన
బాప లిర్వురు, లేఁగలఁ బాలుఁ గుడుపు
మొదవులును మీలుఁ బెరుగును నెదురు వచ్చె. 1167

మ. సగుణబ్రహ్మము నాత్మజాతునిగఁ గాంచంగన్న మన్నీని క
ట్లగుపట్టెన్ శకునంబు లంట యరుదే, యాజానకీరాము లా
జగదేకప్రభవుల్ వధూవరులు నై సాకేతరాణ్మైథిలుల్
దగు వియ్యంకుల రొట జిన్నెలకు మేల్దార్కాణగా నెంచిరా. 1168

తే. తాండవం బాడె శకునముల్ ధాతనేఁడు
సార్థ మొనరించె మన పుట్టు వనుచు నిట్టు
మేలి శకునాల మేలిమి మేళవింపఁ
బెండ్లివారేగి రూరేగి భేరిమ్రోఁగ. 1169

శా. ఇట్టేతెంచెడు వారికై జనకరా జేర్పాటుగా బాటలం
గట్టించెం బలు వాగువంతెనలు మార్గశ్రాంతికై సత్త్రముల్
వెట్టించెం జలిపంది రింద్రపురినిం బేల్పుచ్చు సంపత్తులం
గట్టం గుడ్వాను బండ నుండఁ దగు సౌకర్యంబులం జేయుచున్. 1170

జనకరాజు దశరథాదుల నెదురేగి తోడ్తెచ్చుట

ఉ. అత్తతిఁ బెండ్లివా రెద గృహస్మృతి మాని సుఖంబు మీఱఁగాఁ
జిత్తమువచ్చు భోజనము సేయుచు మెత్తని సెజ్జఁ బండుచుం
గ్రొత్తగు వల్వ లూనుచును గోర్కులు గార్కొన రాఁగ మైథిలుం
డత్తతి మంగళధ్వనుల నారసి పెండిలివారి రాకడన్. 1171

క. తోడుకొనిరా నెదుర్కొనె
వేడుక గజరథపదాతివీతియుతుండై
పైఁడికడవలను గొని పూఁ
బోఁడులు బహు పాయసాన్నపూరముఁ దేఁగన్.

ఉ. కానుకగాఁగఁ బంపె జనకక్షితినాథుఁడు కాంచనాంచితం
బౌ నురు భాజనంబుల సుధాధికమాధురి మీఱు పాసెముల్
మానితవస్తువస్త్రమణిమండనభూషణముల్ గజాదులౌ
యానములన్ మృగంబుల శుభావహచారు సుగంధవస్తువుల్. 1173

క. ఈవిధి శుభవస్తువులను
గావడులను దధులు మున్నుగాఁగల వెల్లన్
సేవకులు తెచ్చుచుండఁగ
నావిధిఁ గని పెండ్లివారు హర్షవివశులై. 1174

క. మేనెఱుఁగక మోదమునన్
మేనెల్లం బులకరింప మిథిలేశుని స
మ్మానవిధమ్ముం గని ని
స్సాణము మ్రోయించి రంత సాకేతజనుల్. 1175

శా. ఆవైవాహికు లెల్లరుం గలసి రయ్యానందకంధుల్ స్వపా
రావారంబుల మీఱి పొంగె ననఁగా హర్షించి, దివ్యాంగనల్
పూవుల్ జల్లిరి దివ్యగానముల వేల్పుల్ దుందుభుల్ మ్రోసిరం
దావైదేహుఁడు కానుకలందుకొని చే నందింప వియ్యానికిన్. 1176

మ. అనురాగంబునఁ గానుకలందుకొని రా జర్పించె భిక్షాళి కం
తను దోడ్తెచ్చిరి దానమానఘనసత్కారంబులం బెండ్లివా
రిని జిత్రాంబరరాజిపై నడపి వారింగాంచి తద్వైభవం
బునకున్ శ్రీదుఁడు శ్రీమదంబుడిగె లిబ్బుల్ గల్గు రారాజునై. 1177

ఉ. అందఱ కన్నిరీతుల సుఖావహమా విడుదుల్ గడుం గడున్
సుందరమైన వాని నిడ క్షోణిజ యంత యెఱింగి పెండ్లివా
రందుల వచ్చువార్తను మహత్త్వముఁ జూపఁగఁ బిల్చి సిద్ధులం
దందునఁ బంచె నందఱ యథార్హసమర్చల గారవింపఁగన్. 1178

ఉ. అత్తరళాక్షి యాన శిరమం దిడి సిద్ధులు సర్వసౌఖ్యసం
పత్తుల స్వర్గభోగవిభవంబులతో విడిదిం బ్రవేశమా
నత్తఱి స్వస్వవాసముల నారసి వార లెడంద దైవసం
పత్తులఁ జీరికిం గొనరు వైభవహేతు వెఱుంగ కయ్యెడన్. 1179

తే. సీత జరిపించు సత్కారరీతి యిద్ది
తర మెఱుఁగ కద్ది జనకకృతంబు గాఁగఁ
దలఁచి రెల్లరు దన్మహత్త్వంబు రామ
విభుఁ డొకఁ డెఱింగి సమ్మదావిష్టుఁ డయ్యె. 1180

## రామలక్ష్మణులు తండ్రినిఁ గలియుట

ఆ. అయ్యరాక నెఱిఁగి యారామలక్ష్మణు
లంతుఁ గనక యిముడ కంతకంత
కతులమయ్యెడు తమిఁ బితృదర్శనోత్కంఠ
నాపలేక గురుని నడుగఁ బోవ. 1181

ఉ. వారివినమ్రతం గని కృపామతిఁ గన్గవసమ్మదాశ్రువుల్
గారఁగఁ దోన మేనఁ బులకల్ బొడమన్ గుశికాత్మజాతుఁ డ
వ్వారల నక్కుఁ గూర్చుకొని పంక్తిరథేశ్వరుఁ డున్న చక్కిఁ గా
సారము తాఁ బిపాసుఁ గను చందమునం జనుదెంచు నంతటన్. 1182

ఉ. వచ్చెడు మౌనిఁగాంచి సుఖవార్ధి తలంబు కొలందిఁ గాంచ నీ
మచ్చున వచ్చు నాఁగ నృపమౌళి యెదుర్కొన వచ్చి మచ్చికన్
దచ్చరణాబ్జధూళిఁ దలఁ దాల్చి ధరాస్థలి మౌళిమోవఁగా
నచ్చపుబత్తి మ్రొక్క ముని యక్కునఁదీసి యొసంగె దీవనల్. 1183

ఉ. గారవ మార సేమ మడుగన్ రఘువీరులు రామలక్ష్మణుల్
క్ష్మారమణాంఘ్రిపద్మముల జాగిలి మ్రొక్కిన యంతఁ బుత్రులం

జేరఁగఁ దీసి కౌఁగిటను జేరిచి వాపుకొనెన్ నృపుండు దు
ర్వారవియోగవేదనను బ్రాణముఁ బొందిన బొంది కైవడిన్. 1184

మత్తకోకిల :

పిమ్మటన్ సహజన్ములిర్వురుఁ బేర్మి మీఱ వసిష్ఠుపా
దమ్ములం దల మోవ మ్రొక్క ముదమ్ముతో సనదమ్ములన్
ఱొమ్ము నద్దుకొనెన్ మునీశుఁడు, మ్రొక్కిరంత ద్విజాళికిన్
నెమ్మనమ్మున నున్న కోర్కులు నిండు దీవన వారిడన్. 1185

తే. భరతశత్రుఘ్ను లటు తన పదములఁబడ
గుచ్చి కౌఁగిటఁ గూర్చెను గూర్మి రాముఁ
డంత సౌమిత్రియును గాంచి యనుజయుగళిఁ
గలిసె సుస్నేహపులకితగాత్రుఁ డగుచు. 1186

క. పరమదయానిధి విభుఁ డె
ల్లరఁ గలిసె యథోచితగతి లాలించుచు నా
పురజన పరిజన భిక్షుక
గురు బాంధవ మిత్రసచివకోటిం గూర్మిన్. 1187

క. అన్నలువురు సుతు లద్దొర
పున్నెమునన్ మేముఁ గొన్న పురుషార్థములో
యన్నటు చెన్ను వహించిరి
సన్నుతయశు రాముఁగని ప్రజల్ మోదిలి రా. 1188

చ. సుతయుతుఁడైన పంక్తిరథుఁ జూచి పురీజనులుం బ్రహృష్టులై
రతికుతుకంబు మీఱఁ బటహంబులఁ గొట్టుచుఁ బూలఁ జల్లి రా
క్రతుభుజు లెల్ల రల్ల తెరగంటిపడంతుక లాడిపాడఁగా
హితులుఁ బురోహితుల్ గురుమహీసురమంత్రి ముఖాప్తవర్గముల్.

తే. ఎదురుకోలున కరిగిన యెల్లవారు
గౌతుకము మీఱఁ బరిజనోపేతముగను
బంక్తిరథు గారవించుచు బహువిధముల
ననుమతింగొని పురమున కరిగి రంత. 1190

## పెండ్లివారిని జూచి మిథిలాపురవాసులు ముచ్చటించుకొచుట

తే. పెండ్లి లగ్గాన కెడముగ వెనుకనాఁడె
తరలిరాఁగను సాకేతపురజనంబు
పురజనులు కోరి రానందపూర్ణమైన
నాటిపవ లవ్యయానంత హూటకొఱకు. 1191

తే. ధర్మధాములు మిథిలేశ దశరథు లని
ప్రేమధాములు జానకీరాము లనుచు
గుంపులుగఁ గూడి నరనారు లింపుమీఱ
ముచ్చటించిరి పురినెల్ల రచ్చటచట. 1192

మ. "జనకక్ష్మాపతిపుణ్య మెల్ల పొలిచెన్ క్ష్మాజాతయా పూని రా
ముని రూపానఁ దదాజిపుణ్యచయమున్ మూర్తీభవించెన్ శివా
ర్చన మివ్వారిబలెం బొనర్చి ఫలమున్ సాధించి రెవ్వారు మున్
గనున్నారె కలారె కన్పడిరె యెక్కాలంబునం దీదృశుల్. 1193

మ. జననం బంది విదేరాజపురవాస్తవ్యంబుఁ గైకొంట భూ
తనయారాఘవనూత్నదంపతుల సద్దాంపత్యసంపత్తినిం
గనుఁగొంటం గనఁగల్గియుంట నిఁక నీకల్యాణసమ్మోదమున్
మనవోలెం బరిపక్వపుణ్యులు సతీమాన్యుల్ మఱొండ్రుందురే."1194

మ. పికవాణుల్ గుమిగూడి వాకొని రిటుల్ పెంపార నన్యోన్యమున్
"సఖి ! యీపెండిలి సర్వలాభకర మీసంబంధసంధాన మిం
తకుఁ గూర్చెన్ మనభాగ్యమూలముననే దైవంబు నీసీతఁ దో
డుకపోఁ రాఁ గనుచుందు మష్టపుడు చూడ్కుల్ విందుగా వీరలన్.

క. తనయావాత్సల్యంబునఁ
గొనిరా మనరాజు సుతను గొనిపో వీరుం
జనుదెంచినఁ గనువిందుగఁ
గనుచుందుము కోటికామకాంతాకృతులన్. 1196

క. పలు వగల బంధుమర్యా
దల నొనరుతు రిట్టి శ్వశురధామసుఖమునే
యలఘు లెద మరగకుంద్రని
వెలఁదులు రాఘవులఁగాంచి వేడ్క లొనర్చున్." 1197

చ. అన విని భామ యోర్తనియె "శ్యామలగౌరకిశోరు లిర్వు రీ
యనుజులవంటి జంట కలదంట మఱొక్కటి యొక్కరూపమై
కని చనుదెంచు వారల నొకం డనె 'నెంచి సృజించెనో విరిం
చనుఁడు స్వహస్తపద్మముల జానుగ దిద్ది' యటంచు వారలన్. 1198

చ. భరతుఁడుఁ గొసలేయుఁ డొక వన్నియ వారలు, వారిభేదముల్
పెఱల కెఱుంగ రావు, కనుపిం త్రొకపోల్కి సుమిత్రపుత్రులున్,
హరువున మీఱి, తన్నఖశిఖాద్యఖిలాంగ మనోహరాభకున్
దొర గలదే, తదాభ మదిఁ దోఁచును గాని వచింపఁబోలునే. 1199

మ. వరవిద్యాగుణశీల ధామనిధులౌ వారే సముల్ వారి కెం
దరయన్ వారికి సాటి లేదనఁగఁ గొండాడం గలారే కవుల్
ధరలో నంచుఁ జెఱంగు సాచుకొని కాంతల్ వేల్పులన్ వేఁడి రి
ప్పురినే నల్వురిపెండ్లు లయ్యెడును మేమున్ గీతముల్ బాడఁగన్.

చ. అని యిటు సమ్మదాశ్రు కలుషాక్షులునుం బులకాంచితాంగులై
వనితలు సర్వమీశ్వరుఁడె వర్ధిలఁజేయుతగార్య సిద్ధులన్
జనవరు లిర్వురున్ సుకృతసాగరు లంచు మనోరథంబులన్
మనముల నింపి రిట్టులె యమంద ముదం బెదఁ బొంగువారఁగన్.

క. అంతఁ జని రిండ్లకును భూ
కాంతులును స్వయంవరమునకై వచ్చిన వా
రెంతయుఁ గని తద్భ్రాతల
సంతసమున రామయశము శ్లాఘించు చెదన్. 1202

చ. కడపఁగఁ గొన్ని నాళ్లిటు సుగంబునఁ బౌరులు మోదమూని య
ప్పు డొదవె మార్గశీర్షమున నుజ్జ్వలలగ్న దినమ్ము నంత మే
ల్గడియలఁ దారవార తిథులన్ గణుతించి విరించి లగ్న మ
య్యెడకు గుణించి పంచె దివిజర్షి కరంబునఁ బెట్టి యత్తతిన్. 1203

మ. విధినిర్దిష్ట ముహూర్త మద్ది మిథిలావిద్వద్వరుల్ జూచి వే
విధులన్ లగ్నము నిశ్చయించిరి ప్రజల్ వేధస్సముల్ వీ రనన్
మిథిలాధీశునకున్ వచించిరి ద్విజుల్ 'మేలైన లగ్నం బిదే
యధిపా! కన్గొను ధేనుధూళి సమయం బాసన్నమౌ నియ్యదే. 1204

క. విమలము సఫలము శుభదము
గమనీయము ధేనుధూళికాలగ్న' మనం
బ్రమదంబున జనకుఁడు 'నీ
సమయంబున జా గిఁకేల సల్పఁగ' ననియెన్. 1205

తే. అనిన విని శతానందుఁ 'డౌనౌ' నటంచు
సచివవర్యులఁ బిలిపించి సకలశకున
వస్తుతతులను మంగళవస్తువులను
బూర్ణకుంభాళిఁ దెప్పించెఁ బొల్పుమీఱ. 1206

ఉ. మంగళ వాద్యముల్ మొరయ మంగళహైమఘటంబు లొప్పఁగా
మంగళగీతముల్ సతులు మానుగఁ బాడ శ్రుతిధ్వనుల్ జెలం
గం గొని పోవ వచ్చిరటఁ గాంచిన కోసల రాట్సమాజ మె
న్నంగ స్వరాట్సమాజము ఘనంబని తోఁపదు చూచువారికిన్. 1207

ఉ. పిమ్మటఁ బెండ్లివారి నలవిందులు తోడ్కొని పోవ వచ్చి 'ల
గ్నమ్ము సమీపమయ్యె జననాథ ! వెసన్ దయసేయుఁ' డన్న నొ
క్కుమ్మడి మ్రోసె వాద్యములు కోసల పాలకుఁడంత సత్సమా
జమ్ములతో గురూక్తవిధి సల్పుచు వంశవిధుల్ పురింజనెన్. 1208

క. వనజాసనాది విబుధులు
కని దశరథువైభవముల ఘనసంపదలం
గనుచు వృథగ నిజ జననము
గొనియాడిరి వానిపేర్మిఁ గూరిమి గూడన్. 1209

మ. శివమూలం బగు లగ్న మియ్యదని జేజేల్ దుందుభుల్ గొట్టుచుం
బువులం జల్లిరి రోమహర్షణముగా మూర్తుల్, మహోత్కంఠులై
భువికిన్ వచ్చిరి స్వస్వయానములతో భూజావివాహంబు గాం
చువగం దాలిచి శంకరాదివిబుధుల్ చోద్యంబుగా నత్తఱిన్. 1210

శా. ఆలోకింప విదేహరాజపురి నత్యల్పంబులై వారి కా
యాలోకంబు లవెల్ల తోఁచె బహుచిత్రాపూర్వ శిల్పంబు నం
దాలోకించిరి, వింత నాపురజనం బత్యంత ధర్మవ్రతా
వాలంబై గుణశీల రూపనిధులై వర్ధిల్లు నవ్వీటిలో. 1211

క. ఆపురజనముల మ్రోలను
జూపట్టిరి చంద్రు ముందు చుక్కలటు సురల్
చూపట్టె విధికి నబ్బుర
మాపురరచనము తనరచనాధిక మాటన్. 1212

మ. తెలియంజెప్పి మహేశ్వరుం డపుడు తద్దేవాళి 'కెవ్వానిఁ లో,
దలవం బేర్కొన నష్టమైచను నభద్రం బెల్ల ధర్మాదిస
త్ఫల వర్గంబది కొంగు బంగర మగుం దజ్జానకీనాథునిం
దలఁపుం డియ్యది వారి పెండ్లి సుఁడి భ్రాంతస్వాంతులై పోకుఁడీ.'

క. ఈలాగు ననుచుఁ బశుపతి
ప్రోలను నిజవాహనంబు ముం దడుగు లిడం
ద్రోలు నెడ వేల్పు లాభూ
పాలుఁడరుగుచున్నఁ గనిరి ప్రమదము మీఱన్. 1214

ఉ. మేనులఁదాల్చి కోర్వఁ జనె మేల్మి సుఖంబు లనంగ బాడబుల్
తో నరుదేర, నాత్మజచతుష్టయ మా యపవర్గసౌఖ్య మి
ట్లూనెనొ మేను నా నలర, నుజ్జ్వల నీల హిరణ్మయాంగు లా
సూనులఁ గాంచి మింట విరిసోన లటుల్ గురిపించి రాసురల్. 1215

ఉ. క్రమ్మఱ రామరూప మటుకాంచి ముదం బెదఁ గ్రమ్మ దేవయూ
థమ్ములు కోసలేశ్వరుని దద్దయు మెచ్చుచు నున్నయంత నే
త్రమ్ముల నశ్రువుల్ గగురుగ్రమ్మఁగ మేన భవుండు గాంచె దు
గ్గమ్మను గూడి యానఖశిఖాంతము రామ లసత్స్వరూపమున్. 1216

ఆ. నీలకంఠ కంఠ నీలిమ గలమేను
మెఱపు మెఱపు మీఱు మేలి మడుఁగుఁ
బరమ మంగళమయ వైవాహిక విభూష
ణములు మేన మిగుల రమణ మీఱ. 1217

క. శరదిందు సుందరాస్యము
నరవిందదళాయతంబు నగు కందోయిం
దరుణేం దీవరసుందరు
పరమానందాకృతి యది వాకొన నగునే. 1218

తే. తోడ భరతాదిసోదరుల్ తురగములను
జిందుద్రొక్కించి తోలఁ గడింది నేర్మిఁ
గొమరు మీఱి రటా రాచకొమరు లెల్ల
వంశకీర్తుల వందింప వందిగణము. 1219

క. ఏజక్కి-పైన నా రఘు
రాజెక్కె-నొ దాని రయము రమణీయతఁ గ
న్గొఁ జొక్కుఁ బక్కి-తేఁడును
నీజక్కి-మిషన్ మనోజుఁ డీమెయిఁ గొనెనాన్. 1220

చ. రతిపతి యశ్వరూపమున రామహితార్థ మి ట్టొప్పెనో యనం
గతిబలరూపధామములఁ గాంచెడు వారి భ్రమింపఁ జేయు నా
రతనము ముత్తియంబులఁ బరంగెడు జీనును గళ్లెమున్ జగ
త్త్రితయము మోహ పెట్టఁగను దేవనరాదుల మాని కోటులన్.

క. విభునిమతిన్ మతిఁ గలుపుచు
రభసగతిం జను తదశ్వరమ్యత యొప్పెన్
శుభతటి దుడుసంచితతో
యభృదం బది బర్హికోటి నాడించుగతిన్. 1222

క. రాముం డెక్కి-నహరి వా
గ్భామకునేనిన్ నుతింప వచ్చునె యట్టుల్,
ప్రేముడిఁ గని రాము రమా
రామాపతి మోదమందె రామాయుతుఁడై. 1223

ఉ. పంచముఖుండు కన్గొనియెఁ బంచదశాక్షులు గల్గు నుబ్బునం,
గాంచె విరించి కించఁగొని కన్గొఁ గదా నయనాష్టకంబె నా
కంచును, గ్రౌంచవైరి చతురాస్యుని కంటె ఘనుండ నంచు ద
ర్శించెను ద్వాదశాక్షుల శచీపతి గౌతమదత్తశాపమున్. 1224

ఉ. మేలుగనెంచె వేఁగనుల మేల్మిఁ గనుంగొని, తన్నుఁగాంచి దే
వాళి సురేంద్రు సాటి ఘనుఁడారయ లేఁడని యాను నొంద, దే
వాళియు రాముఁగాంచి ముద మందెను రాజ సమాజమందు న
వ్వేళను హర్ష నాదములు భేరులతోడను మ్రోసె నెయ్యెడన్. 1225

తే. ఇరుకెలంకులవారలు నరుసమొంద
'జయ జయ రఘూత్తమ!' యటన్న జయరవముల
విరులవానలఁ గురిసిరి వేల్పుగములు
పెండ్లివారటు వచ్చెడు విధ మెఱింగి. 1226

ఉ. మంగళ వాద్యముల్ మొరసె మంగళహారతికై విదేహు న
ర్థాంగి సుమంగళీసతుల నర్మిలిఁ బిల్చుచుఁ బళ్లెరమ్ములన్
మంగళవస్తు లుంచె వరమానిను లంత నలంకృతాంగులై
నింగిని నేల మాఱ్మ్రొరసి నిండగఁ బాడిరి మంగళంబులన్. 1227

క. యానములన్ గజమానము,
గానమునం గేకిమానగౌరవమును వి
న్నాణెమునన్ రతిమానము,
మానిత చలదృశల హరిణమానము లడఁగన్. 1228

ఉ. పంకరుహాక్షు లారతులపళ్లెరముల్ గొని యేగి రంత సా
లంకృతగాత్రులై వరకళాకరువోలెఁ గళాకరాస్యలై
కంకణకింకిణీధ్వనులు ఘల్లున మ్రోయ నిజాంగదీప్తి మీ
నాంక సతీమదం బణఁచు నచ్చున వల్వలఁగట్టి యత్తఱిన్. 1229

క. ఇంద్రాణియు రుద్రాణి యు
పేంద్రాణీ బ్రహ్మరాణు లిత్యాది శర
చ్చంద్రానన లా ఘనఘన
సాంద్రచికుర లూని వివిధ ఛద్మాకృతులన్. 1230

క. పట్టమహిషి వేషంబులఁ
బట్టపు రాణులను జొచ్చి ప్రమదవివశలై
జట్టుగఁ బాడిరి గీతము
లట్టి తఱిం దెలియరై రటన్యోన్యమునన్. 1231

ఉ. సుందరకంఠ గానములు చొప్పడగా సుమవృష్టు లొప్ప నా
నంద నిమగ్నులౌచును వినంబడ కొక్కటె ప ల్కొకర్తెకున్
సందడి నొండొరున్ తెలియఁజాలక వారలు బ్రహ్మరూపుడౌ
సుందరు సౌఖ్యకందు వరుఁ జూచి రమంద ముదంబు మీఱఁగన్.

ఆ. బాష్పజలము లలమ వనజాయతాక్షుల
నొడలఁ బులకరింపు లొదవ నెటులొ
హర్ష సమయ మంచు నశ్రుధారను బాపి
హారతులిడి రతివ లంద అపుడు. 1233

క. కనిరామరూప విభవము
జనకసతీస్వాంత మెంత సంతసపడె దా
నిని శతకల్పముల వచిం
పను జనుదురె శతసహస్రభాషా శేషుల్. 1234

మ. కులరీతుల్ శ్రుతిరీతు లర్హగతిఁ జేకూర్పన్ యథారీతిగన్
జెలఁగం బంచవిధంబులైనరవముల్ స్త్రీల్ గీతముల్ బాడి మం
గళనీరాజన మీయ నర్ఘ్య మిడఁగాఁ గాకుత్స్థుఁ డందేగెఁ జూ
పలుచాయల్ మడువుల్ భువిన్ నడువఁగాఁ బర్వంగ నవ్వానిపై.

క. రాజిలె నాజితనూజుఁడు
రాజసమాజమునఁ గడలరాజులు దెలవోన్
జేజేలు విరులు గురియన్
భ్రాజద్ద్విజరాజి శాంతిపాఠముఁ జదువన్. 1236

ఉ. ఇట్టులు మంటపస్థలికి నేగిన రాఘవుఁ డర్ఘ్యమిచ్చి య
ప్పట్టున నొక్కపీఠమున వానిని గూరుచునుండఁ బెట్టె లోఁ
బట్టఁగ రాని సంభ్రమునఁ బాటలఁ బాడుచు నారతిచ్చుచున్
బుట్టములన్ ధనంబుల విభూషణముల్ దరిసించి రంగనల్. 1237

క. ధాత్రాదివిబుధు లత్తటి
ధాత్రీసురవేషములను దాలిచి రఘురా
డ్గోత్రాంబుజమిత్రుం గని
రాత్రంబున జనువు సఫలమయ్యె నటంచున్. 1238

చ. అల మిథిలేశ పంక్తిరథు లమ్మెయి లౌకికవైదికక్రమం
బలరఁగఁ గూడినంతఁ గవు లారసి యొండుపమాన మా నరేం
ద్రులకును సాటియైన దెద్దఁ దోఁపమి సిగ్గిలి యోటువోయి వా
రల కిఁక వారె సాటియని ప్రజ్ఞ నెటో యొడబాటుఁ జేసిరా. 1239

ఉ. ఇంపు దలిర్చు వియ్యముల నిర్వురఁ గన్గొని వేడ్క మీఱ నై
లింపగణంబుఁ బూల్ గురిసి లీల యశంబుల నుగ్గడించుచున్
సొంపగు పెండ్లు లెన్నిటినొ చూచితిమైన విధాతృసృష్టి ని
ట్లింపుగఁ గాన మన్నిటను నీడును జోడగు వియ్యకాండ్రనున్. 1240

ఆ. అనుచు మెచ్చఁగను వియచ్చరుల్ వచ్చిన
విందు బందులు గనువిందుగఁ గన
నర్ఘ్య మిచ్చి జనకుఁ డానృపుఁ గొనిపోయె
మంటపోర్వి కడుగు మడగులొగ్గి. 1241

ఉ. హానిమనమ్ములున్ బ్రమసె మంటపచిత్రవితానముల్ గనన్
ధీనిధి యావిదేహుఁ డటఁ దెచ్చి యొసంగె వరాసనంబులం
దానిజపాణిఁ బూని కులదైవముఁ బోలె వసిష్ఠుఁ గొల్చి య
హ్మాని యొసంగు దీవనల మస్తముఁ దాల్చి భజించెఁ గౌశికున్. 1242

క. కొలిచి యనర్ఘ్యప్రీతిని
దెలివిని బూజించి వామదేవాదుల నం
దెలమి నుచితపీఠము లిడి
ఘలఘుతరాశీస్సు లంది ఘనహ్మానులచే. 1243

ఉ. ఈశసమానుఁ డన్నతలపేర్పడఁ బేర్పడు బత్తిఁ గోసలా
ధీశునిఁ గ్రమ్మఱం గొలిచి యిట్టిది భాగ్యవిశేషమంచు ధా
త్రీశుఁడు దోసిలొగ్గి నుతియించుచు నర్చ లొనర్చెఁ గోసలా
ధీశునివోలె సర్వధరణీశుల నం దుచితాసనంబులన్. 1244

చ. జనకుఁడు దానమానముల సన్నుతులం గడు గారవించె సా
ఘనవిభవంబు నిట్లొక మొగంబున నేగతి నెన్నవచ్చుఁ గ
న్గొని రఘురాట్ప్రభావ మటు క్షోణిసురాకృతు లూని వచ్చి ర
జ్జనపతిపీఠి కంత హరిశంకరపంకరుహోదరాదులున్. 1245

చ. కనుఁగొని దేవతుల్యముగ క్ష్మాపతి వారల సత్స్వరూపముల్
గనుఁగొని నట్టె కొల్చెఁ దగు గద్దెలఁ గూరుచునుండఁ బెట్టి, యా
క్షణమున గుర్తు వట్టునె యొకం డొకనిన్ వరు సౌఖ్యకందునిం
గనుఁగొని రంత నయ్యుభయకక్షలవారుఁ బ్రహృష్టచిత్తులై. 1246

తే. వేలుపుల యున్నరూపుఁ గన్పట్టి రాముఁ
డాదటం గొల్చె మానసికాసనముల
నిలిపి యవ్వారి వారలు నలరి రట్టి
విభు సుశీలస్వభావంబు విధ మెఱింగి. 1247

క. శ్రీరామచంద్రముఖచం
ద్రోరుచ్ఛవిఁ బ్రేక్షకాక్షు లుత్సాహమునం
దారు చకోరములై సాం
పారఁగఁ బానంబుసేసె నలఘుప్రీతిన్. 1248

## సీతారామకల్యాణ మహోత్సవము

ఉ. అంత వసిష్ఠమౌని తఱి యారసి గౌతమసూతిఁ బిల్వ న
త్యంత సమాదరంబున, నతం డరుదెంచె, వసిష్ఠుఁ డత్తఱిం
'గాంతలు తోడి తెండిప్పుడె క్ష్మాసుత' నన్నను రాణియుం జెలుల్
సంతస మంది విప్రసతులం గులవృద్ధలఁ బిల్చి రాధటన్. 1249

శా. వారంతన్ శుభగానముల్ సలిపి పూర్వాచారముల్ దీర్చినన్
నారీవేషమునన్ సురాంగనలు రాన్ రమ్యాకృతుల్ దాల్చి శృం
గారంబుల్ జెలువారఁ దాలిచి, యెఱుంగం బోకె వారిన్ సతుల్
శ్రీరుద్రాణికి వాణికిన్ సమలుగాఁ జింతించి సేవించినన్. 1250

క. షోడశశృంగారంబులఁ
జేడెలు జానకిని దిద్ది చేకొని రాఁగాఁ
బాడుచు మంటపభూమికి
వ్రీడను మదకోకిలములు విటపుల డాఁగెన్. 1251

ఉ. పాయఁగ యోగి యోగధృతి, పాడుచు నైజకలస్వనంబులన్
మ్రోయఁగఁ దాళరీతి రవముల్ నిజకంకణకింకిణీధ్వనుల్
పోయి రిభేంద్రయాన లట భూసుతఁ దోడ్కొని మంటపోర్వి కం
దాయమ స్త్రీతతిం బొలిచె నాభలలోన మహాభయో యనన్.

క. నాయట్టి యల్పమతి కెటు
లాయమ పరమాభ పలుక నయ్యెడుఁ జెపుఁ, డ
ట్లాయమ యాయెడ కటు రా
నాయమలాకారఁ గాంచి యబ్బురపడుచున్. 1253

ఉ. అందఱు వందనం బిడి ర టాత్మల రాముఁడు పూర్ణకాముఁ డా
నందము నందె నా జనకనందన నందునఁ గాంచి, యాదశ
స్యందనుఁడుం బ్రమోదపడె నయ్యెడ నయ్యమఁ గాంచి దేవతా
బృందము సన్నుతించి కురిపించిరి వే విరి వాన లింపుగన్. 1254

ఉ. మంగళభేరి మ్రోయఁగ నమందముదం బెదఁబొంగఁ బౌరులు
ప్పొంగను, మంగళంబు విరిబోణులు బాడ మహీజ వచ్చె నా
యంగణ భూమి కందు మును లాదట స్వస్తి పఠించి రాత్రయీ
భంగిఁ గులక్రమానుగత పద్ధతులన్ జరిపించి రా గురుల్. 1255

శా. పూజింపించ నుమాగణేశగురులన్, భూదేవతల్, దేవతల్
పూజల్ చేకొని రాత్మరూపములతోఁ బొల్పారఁ బ్రత్యక్షమై
లాజంబుల్ మధుపర్కముల్ మునుగ గల్యాణార్థసామగ్రు లె
ప్డేజాడన్ మును లడ్గువారో యని బం ప్లైవ్వేళఁ దా ప్త్రన్నిటిన్.

మ. కులరీతిం గులపెద్ద పొద్దు తెలుపన్ క్షోణీసురుల్ వేడ్క వే
ల్పుల నెల్లం గొలిపించి సీతకొసఁగం బొల్పారుపీఠంబు నం
దలరం బల్కఁ దరంబె దంపతుల యన్యోన్యేక్షణ ప్రేమ మే
నల వాఙ్మానసబుద్ధ్యగోచరుని నెట్లగ్గింతుఁ బైపైనుడిన్. 1257

ఆ. హోమవేళ వీతిహోత్రుఁడు నొడలూని
వచ్చి యాహుతిఁ గొనె నచ్చెరువుగ
విప్రవేషమూని వేదచతుష్టయం
బరుగుదెంచి, పెండ్లి వరుసఁ దెలిపె. 1258

క. జనకనృప రాజ్ఞి త్రిజగ
జ్జనజననీజననిఁ బొగడఁ జనుదు నె యామెన్
ఘనసుయశ స్సుకృత సుఖక
మనీయతలఁ గూర్చి యాయమ విధి సృజించెన్. 1259

క. మును లత్తఱిఁ బిలువంగా
జనకసతిన్ సతి సునయన సాధ్వులు గొని రా
జనకుని దాపల నాయమ
మొనరెను దుహిన్రాదిపార్శ్వమున మేనక నాన్. 1260

ఉ. బంగరుగిన్నెలన్ మణుల పళ్లెములన్ శుచిగంధతోయమున్
రంగుగఁ దే సుమంగళులు, రాణ యెలర్ప విదేహుఁ డాలితో,
మంగళవేదపాఠములు మౌను లొనర్ప సురల్ ప్రసూనవృ
ష్టిం గురిపింపఁగాఁ, గడిగె శ్రీరఘురాముని పావనాంఘ్రులన్. 1261

ఆ. కడిగి రడుగు లటులు కాయఁముల్ బులకాయ
మానములయి పొంగ మాఱుమ్రోయ
జయజయధ్వనులు నిసాణముల్ నద్దెసల్
నింగి నేల విరిసి పొంగె ననఁగ. 1262

సీ. రాజిల్లు నేపాద రాజీవములు సదా
శివహృత్సరసి యందుఁ జెన్ను మీఱి
యేపుణ్యపాదమ్ము లెద స్మరించినఁ గలి
కలుషరాశి తొలంగి కలుగుముక్తి
యేపాదములు సోఁకఁ బాపరూప యహల్య
దురితరాశిఁ దరించి తరుణి యయ్యె
నిందుమౌళి పదారవిందమరంద మె
ద్దానిఁ దాలుచుఁ బవిత్రం బటంచు
మౌను లెందున నిజమనోమధుపములను
జొనుపుచుందురు మోగు లేనిని దలంచి
యమరు లయ్యెద రాపదాబ్జములఁ గడిగె
నమ్మహాభాగి జనకుండు సమ్మదమున. 1263

వ. కులగురు లిర్వు రంతఁ గలఁగూర్చి వధూవరహస్త యుగ్మముల్
గులవిధు లుచ్చరింపఁ గనుఁగొంచు సురర్షినరాదు లెల్ల పౌ
రులు తమకంబు మీఱఁగ వరున్ సుఖకందుని గాంచి యింపునం
గులుక, జగత్త్రయీవిధిని గూఁతు నొసంగె విదేహుఁ డింపునన్.

తే. మున్ను బన్నగధరునకు నన్నగపతి
కన్నె నిచ్చిన తెన్నున వెన్ను నకును
లచ్చినిం బాలమున్నీ రదిచ్చినటులు
జానకిని రాముని కొసంగె జనకరాజు. 1265

చ. సహజవిరాగియా నృపుని శ్యామలకోమలరూప మెంతయున్
రహిని విరక్తుఁజేసె నిఁక రాజెటు సన్నుతిసల్పు, నాత్రయీ
విహితగతిం జెరంగు ముడివెట్టుచు, వేలిమి వేలిపించి య
ద్దహను వలంగొనంగ నవదంపతులన్ నడిపించి రా గురుల్. 1266

చ. మొరసె జయధ్వనుల్, మునుల మోముల మ్రోసెను వేదనాదముల్,
మొరసెను మంగళధ్వనులు మోదముతో సురలీవుమ్రానిపూల్
గురిసిరి, సభ్యులెల్ల రొనగూడఁగ నేత్రఫలంబు, లవ్వధూ
వరులు ప్రదక్షిణం బొనగుపం గని రాదట భాగ్య మేమనన్. 1267

మ. తలమే యెన్నఁగ నవ్వధూవరుల సద్దాంపత్య సంపత్తి వా
రల ఛాయల్ గనుపట్టు చుండెను గన ద్రత్నాంచిత స్తంభ పం
క్తుల బహ్వాకృతులన్ రతిస్మరులు గన్గొంచుండి రప్పెండ్లి నాఁ
బలుమారుం గనుపట్టి డాగి పలుతేపల్ గొంకి దృగ్లాలసన్. 1268

క. స్నేహవశు లౌచు మఱచిరి
దేహముల విదేహనట్లు దృశ్యకు లట ను
త్సాహమున మునులు వారి వి
వాహవిధిన్ సలిపిరెల్ల వరుసగ నంతన్. 1269

తే. సిందురము నుంచె రాముఁడు సీత నొసట
దందశూకము పుష్పోడిఁ దమ్మినింపి
యమృతమం దాసఁ దవిలి తానలరఁజేయు
నిండు జాబిలి కందీయు నేర్పు మెఱయ. 1270

క. విధిసుతు ననుమతి వా రా
వధూవరు లేకపీఠిపయిఁ గూర్చుండన్
బృథివీశుఁడు గని దశరథుఁ
డధికామోదమున గగురుపారఁగ నెమ్మేన్. 1271

తే. తనర నిజపుణ్య దేవతాతరువినూత్న
ఫలమునీక్షించి హర్షించెఁ బల్మఱు నృపుఁ
డమ్మెయిన్ రామకల్యాణ మైన యంత
నఖిల జగముల నుత్సాహ మతిశయిల్లె. 1272

## భరతలక్ష్మణ శత్రుఘ్నుల వివాహములు

తే. పరమకల్యాణవైభవ ప్రాభవంబు
నేకముఖమున వర్ణించు టెట్లు చెప్పుఁడి
యంత గురునాజ్ఞ జనకరా జందుఁ దెచ్చె
నొనర మాండవిన్ శ్రుతకీర్తి నూర్మిళసుత. 1273

ఉ. నిండు మనమ్ముతోడ గుణనీరధియౌ కయికమ్మబిడ్డ కా
మాండవిఁ దమ్ముకూఁతు నిడి మక్కువఁ బెండిలిసేసి స్త్రీశిరో
మండన నూర్మిళాసుతను మైథిలిచెల్లె సుమిత్రసూతికిన్
మెండగు సత్కృతిం బొనర మేల్మి వివాహ మొనర్చె నత్తఱిన్. 1274

క. శత్రుఘ్నునకు నొసంగెను
బుత్రిని శ్రుతకీర్తినిన్ సుముఖి సునేత్రిన్
ధాత్రీశ్వరుఁ డా నయగుణ
పాత్రను రమణీయగాత్రిఁ బరమపవిత్రన్. 1275

మ. అనురూపాకృతు లవ్వధూవరులు దా మన్యోన్యముం గాంచుకొం
చును లజ్జించుచు నున్న మెచ్చెఁ బ్రజ తచ్ఛోభం గనుంగొంచు శో
భనపీఠంబుల, జాగ్రదాది చతురావస్థల్ నిజస్వాములం
దనరెన్ హృత్స్థలి నాన్ సతుల్ పతులతోఁ దైవారి రింపారఁగన్. 1276

క. సుతుల సతీయుతులం గని
క్షితిపతి యతిముదితుఁ డయ్యెఁ జెందెనొ ధర్మా
ది తతచతుర్విధఫలముల
నతులతపస్యాదిక్రియాయుతముగ నాన్. 1277

శా. ఆసీతేశువివాహరీతిని వివాహంబుల్ బొనర్పించి య
ష్టాసాకేతపురీశపుత్రుల కనేకానేకపానీకముల్
దాసీ దాసజనంబు నశ్వరథగోతండంబు స్వర్ణంబునున్
వా సాలంకృతులన్ విదేహుఁ డిడెఁ గాన్కల్ గాఁగ నవ్వారికిన్.1278

చ. అరణమొసంగు భావుకుఁ డనర్ఘ్య దుకూలసురత్న కాంచనో
త్కరముల వేదినిండ నిడి కంబళులన్ వరవస్త్రవస్తులన్
సురభిసమానధేనువులఁ జూచి దిగీశులు నీసు నొందఁగాఁ
దరము నెఱుంగకుండ నిడెఁ దన్మితి చూపఱ కెట్లు తెల్పనౌ. 1279

ఉ. ఇచ్చిన కట్నముల్ గొని యథేచ్ఛను బంక్తిరథుండు వెండి తా
నిచ్చెను బిచ్చగాండ్ర కెవఁ డెయ్యది కోరునొ దాని వానికిన్
దెచ్చెను దక్కువాని విడిదిన్ మిథిలేశుఁడు పెండ్లివారి నం
దచ్చుగ నాదరించి ఘటితాంజలియై మృదుభాషణంబులన్. 1280

ఉ. అందఱి దానమానముల నాదర మారఁగ గారవించి యా
నందముతోడ మ్రొక్కుచు నొసర్చి సమర్చల మౌనికోటికిన్
బెందలవంచి సాధుసురబృందము వేఁడె, ముదంబు నొందుఁ డీ
రందఱు భావసింధులు జలాంజలి నబ్ధి తలిర్చు రీతిగన్. 1281

చ. అనుచుఁ గుశధ్వజుం గలసి యామిథిలేశుఁడు కేల్మొగుడ్చుచున్
వినుతి యొనర్చెఁ బంక్తిరథుఁ బ్రేముడి మీఱు మృదూక్తిఁ గ్రమ్మఱన్
"జనవర ! మీదు వియ్యము నొనర్పఁగఁ బెద్దఱికంబుఁ గంటి మే
మనయము వచ్చిపోవు ననుయాయుల మంచుఁ దలంపుఁడీ మమున్.

క. మాకూఁతుల దాసులుగాఁ
గైకొని పాలింపుఁ డయ్య ! కరుణాదృశ మీ
కీ కరణి శ్రమ మొసంగిన
యీ కష్టాత్ముని సహింపుఁడీ" యనునంతన్. 1283

క. అయ్యినకులుఁడున్ నెయ్యమి
వియ్యంకులఁ దనిపె నట్టి వియ్యపుఁ దియ్యం
బొయ్యారం బయ్యారే
వెయ్యారుం బాపఁజేండ్లు బేర్కొను వారే. 1284

మ. ధర జేజే నుడి మ్రోతఁ బ్రానుడుల మ్రోతన్ నిండి మార్మ్రోగఁ, బూ
ల్జలురియింపన్ మొరయింప దుందుభులు వేల్పుల్, భూనభోవ్యాప్తిగా
నరుసంబుల్ బసకేగె నాదశరథుం డంతన్ వయస్యల్ వధూ
వరులం గేళిగృహంబుఁ జేరఁ గొనిపోవన్ మౌనివర్యాజ్ఞచే 1285

తే. పలుమఱుం గాంచి రామరూపమును సీత
జంకి కొంకెను మనసు నిశ్శంక మైన
కౌసలేయ సుప్రేమపిపాసువు లగు
నత్తెఱవకండ్లు మీన్గండ్ల కెత్తు వచ్చె. 1286

సీ. శ్యామలకోమల చారు తనుచ్ఛవి
కోటి మన్మథశోభ దీటొనర్ప
లాక్షా రసాంచిత లలితాంఘ్రిపద్మముల్
మునిజనహృద్భృంగములఁ జెలంగఁ
గమనీయ మహనీయ కనదుత్తరీయంబు
తరుణ తరణి తటిత్ప్రభల మీఱఁ
బీఁ
బీతోపవీతముం జేతియుంగరముల
మురువు చిత్తమ్మును ముచ్చిలింపఁ
తే. గింకిణీ కటి సూత్రాద్యలంకృతులును
దీర్ఘ భుజ భూషణమ్ముల తీరు నాయ
తోరువక్షాభరణము లొప్పారఁ బెండ్లి
కొమరు వేషంబు మిక్కిలి కొమరు మీఱె. 1287

ఉ. జందెము చందమై పరఁగ జానగు దుప్పట మంచులన్ మణుల్
పొందగు ముత్తెముల్ గలిగి భూషణ భూషిత కర్ణయుగ్మమున్
సుందరలోచనాబ్జములు శోభకు నిమ్మగు నాననమ్మునన్
డెందము ముచ్చలించు ముకుటీవియు గన్బొమతీరు నొప్పఁగన్. 1288

క. నొసటన్ దిద్దిన తిలకము
పసమీఱన్ బొమిడికంబు బహుమణిముక్తా
విసరస్థగిత మయి వెలుఁగ
మిసిమి నెసఁగు మేనివరుని మిథిలాకాంతల్. 1289

చ. కనుఁగొని హర్ష మందుచును గ్రాసముఁ ద్రుంచుచు దృష్టిదోషముల్
చనఁగను రత్నవస్త్ర మణిసంతతిఁ గానుక లొసంగుచుం గల
స్వనములఁ బాడుచుం దమి నివాళు లొసంగిరి వందిమాగధుల్
వినిచిరి కీర్తిగానముల వేల్పులు పూల్ గురియించి రత్తఱిన్. 1290

ఉ. తోడుక పోయి యంతట వధూవరులం దగ రాణివాసమున్
వేడుక నింతు లెల్ల సలిపించిరి లౌకికరీతి గీతముల్
పాడుచు దంపతుల్ గలిసి పంక్తి భుజింపఁగ వాణి సీతకున్
వేడుక గౌరి రామునకు నేర్పె ని టందఱు హర్షమగ్నులై. 1291

తే. రాణివాసంపు సతులు విలాసహాస
వివశలై జన్మసాఫల్యము వడసి రట!
స్వకరమణి ముద్రికం బతిచ్ఛాయఁ గాంచి
విడువ దయ్యె న దవనిజ విరహావశత. 1292

క. నెయ్యంబున సీతను సఖు
లెయ్యెకసకియఁంబు లాడి యెసఁగఁగఁ జేయిం
త్రయ్యాయింపులు సొంపులు
నెయ్యము లచ్చెలులె కాక నేర్తురె యితరుల్. 1293

క. ఇంపున నవదంపతులను
గొంపోయిరి విడిది కంతఁ గుతలఖతలముల్
దంపతులు చిరాయువ్వులై
సొంపారుతమంచు స్వస్తిసూక్తుల నిండెన్. 1294

శా. ఆనందంబులు నిండె నెల్లెడల భూమ్యాకాశ మాశీస్స్వలన్
ధ్వానం బయ్యెను దుందుభుల్ మొరసె, సందర్శించి రామప్రభున్
సూనంబుల్ గురిపించి యేగిరి మునీశుల్ యోగిసిద్ధాదు లా
యానందచ్ఛవి భద్రముల్ విరిసె నా నచ్చోటఁ దాఁకోన్నదరుల్. 1295

తే. జనక సన్నిధిఁ జేరిరి సతులఁ గూడి
విందుకొఱ కంత జనక భూవిభుఁడు పెండ్లి
వారిఁ బిలిపింప వచ్చె నప్పం క్తిరథుఁడు
కొడుకులం గూడి మడుగుల నడుగు లిడుచు. 1296

ఉ. అంత విదేహ భూవిభుఁడు నందఱి యంఘ్రులఁగడ్గి వారి క
త్యంత ముదంబుతో నొసఁగె నాసనముల్ తదపారమోద మే
నెంతని యెంచువాఁడ ధరణీశ్వరు నంఘ్రులఁ గడ్గి కడ్గె లో
సంతస మిమ్మడింపఁగను శంభుహృదీహిత రామపాదముల్. 1296

ఉ. రామసమాను లంచుఁగని రాముని తమ్ముల యద్ఘుదమ్ములన్
వేమఱుఁ గడ్గె నాన్నృపుడు స్వీయకరంబుల నర్హపీఠముల్
ప్రేముడిమై నొసంగి పిలిపింపఁగఁ గాంచనకీలకీలితం
బౌ మణిపాత్రముల్ బరచి యాదనికుల్ బొనరించి వడ్డనల్. 1298

క. రుచికలసూపాన్నాదుల
శుచిరుచియుతగో ఘృతమున సూదులు వారల్
రుచిరగతుల వడ్డించినఁ
బచరించిరి కుడువఁ బంచబలిపూర్వముగన్. 1299

చ. ఎకసకియఁంపు బాట లోగి నింతులు పాడ వినోదశీలలై
సుకుశలసూపకారు లటు చోష్యము లేహ్యము భక్ష్యభోజ్యముల్
సకలపదార్థముల్ రుచిరశాకసుధామయపాయసంబు లో
పిక మెయి వడ్డనల్ సలుప విందులు గుడ్చిరి పెండ్లివారటుల్. 1300

మ. తినుచున్ షడ్రసయుక్తమైన బహుజాతివ్యంజనంబుల్ వధూ
జనముల్ స్త్రీపురుషాళిఁ బేర్కొనుచు హాసం బేర్పడం బాడినన్
ఘనరమ్యధ్వని నాలకించి నృపుఁ డక్కాలానుసారంబ యిం
పున విందుల్ బొనరించి లేచె నగుచున్ భూరిప్రమోదంబునన్. 1301

ఉ. పిమ్మటఁ దమ్ములమ్ము లిడి పెండిలి విందుల వీడుకొల్పె తేఁ
డమ్మెయిఁ గోసలేశ్వరుఁడు నాత్మజబంధుసమాజయుక్తుఁడై
యిమ్ములకేగె మోదమున నెల్లశుభంబులు బర్వఁ గ్రొత్తలై
యమ్మిథిలన్ నిమేషసమమై కడచెన్ బలురేవగల్లటన్. 1302

ఉ. వందులు వంశకీర్తిఁ గయివారము సేయ నృపుండు జాగృతిం
జెంది యహర్ముఖంబుననె చేడెలతోడుతఁ జెన్ను మీఱు నా
నందనులం గనుంగొని మనమ్మున సమ్మద మంది యేగెఁ దా
నందునఁ గాలకృత్యముల నన్నిటిఁ దీర్చి వసిష్ఠు నొద్దకున్. 1303

చ. చని కరముల్ మొగిడ్చి యిల జాగిలి మ్రొక్కి సమర్చఁ జేసి యి
ట్లనియె సుధామయోక్తుల, 'మహాముని ! మీ మహితానుకంపచేఁ
గనుఁ డిదె నేఁ గృతార్థతను గంటిని నేఁడు ద్విజాళి కెల్ల గో
ధనమును నీఁ దలంతు' ననఁ దన్మనుజేంద్రుని మెచ్చి యాతఁడున్.

మ. మునిబృందంబును బిల్వనంపఁగను సమ్మోదంబుతో వచ్చె నం
దున జాబాలియు వామదేవుఁ డజపుత్రుండుం బ్రచేతస్సుతుం
డును గాధేయుఁడు మున్నుగాగ ముని రాడ్వ్యూహంబు రాజేంద్రుఁడం
తను బీఠంబు లొసంగి వారిఁ గొలిచెన్ దండప్రణామంబులన్. 1305

క. ఈవుల మొదవుల కెనలగు
గోవు లలంకృతులతోడఁ గూడిన వానిన్
భూవరుఁడు నాల్గులక్షల
వేవేఁ దెప్పించి యిచ్చె ద్విజముని తతికిన్. 1306

ఉ. వెండియు నమ్మహీధవుఁడు వేవిధులన్ నిజభాగ్య మెంచుచున్
బండెను నాదుపుణ్యమని బాపలు దీవన లీయ నందుచున్
దండిగఁ బిల్చి యాచకులఁ దత్తదభీష్ట మెఱింగి యిచ్చెఁ మేల్
వెండిఁ బసిండినిన్ మణులవీతి గజంబుల స్యందనంబులన్. 1307

తే. బిచ్చగాండ్రు డిచ్చగించెడు నిచ్చ లొంది
మెచ్చి పాడి జయధ్వను లెచ్చ గాఁగ
జని రటవ్వీధిఁ బరిణయోత్సవము లెసఁగ
ఫణిపతికి భారతికినేని గణుతి మీఱి. 1308

శా. అంతం బల్మఱుఁ గౌశికాంఘ్రులకు సాష్టాంగప్రణామంబులన్
సంతోషంబునఁ జేసి పంక్తిరథుఁ డీ సంతోషసౌఖ్యంబు లిం
దెంతే మీకరుణాకటాక్ష మహిమంబేసుం డటం చాత్మలో
నెంతే మెచ్చి విదేహ శీలగుణహార్దేచ్ఛావిభూత్యాదులన్. 1309

ఉ. అచ్చుగ నొక్కనాఁడు సెలవడ్గె విదేహనృపాలు నాతఁడున్
మచ్చిక నేగనీయఁ డతిమన్నన సేయుచు నాతిథేయముల్
నిచ్చలుఁ గ్రొత్తలై నెగడ, నెమ్మది వియ్యమువారిపోక నే
మచ్చున నిచ్చగింప రొకరందున నింపును సొంపు వాయఁగా. 1310

ఉ. ఇట్టులు ప్రేమరజ్జువున నెల్లరు గట్టువడంగఁ గొన్నినా
ళ్లెట్టె చనెన్ విదేహు దరికప్పుడు కౌశిక గౌతమాత్మజుల్
జట్టుగ నేగి 'హో సెలవొసంగుము వియ్యమువారి కర్థిమై
నిట్టిడి బందులన్ విడుచు టెంతయుఁ గష్టమవైన' నావుడున్. 1311

ఉ. మే లని మంత్రులం బిలువ మేల్మి విదేహుఁడు వారలున్ భువిన్
వ్రాలి శిరంబు వంచి కొలువన్ విభు డర్మిలి 'గోసలావనీ
పాలకు డేగ నెంచె నని పల్కుఁడు యంతిపురంబు లో ననన్
జాల ముదంబు నొంది రల సభ్యులు మంత్రులు విప్రవర్యులున్. 1312

క. పురజను లాశ్వైవాహికు
లరిగెద రని వినియు నడుగు చన్యోన్యమున
ట్లరుగుట దిరమని వినఁగనె
మురు వుడిగి దినాంత పద్మముల వలె నైనన్. 1313

క. అచ్చుగ నేయేవసతుల
వచ్చెడుతఱి విడిసి రట్టి వసతుల సిద్ధుల్
వచ్చె మునుముందె తెచ్చిరి
హెచ్చుగ నాహార వస్తు లెన్నేని భటుల్.

క. వివిధములగు పాయసముల
సువిధాన్నము లెన్నొ పంపె సూదవరులచే
నవునె వచియింప వానిని
వివిధంబౌ భోజ్యవస్తు విస్తారంబున్. 1315

మత్తకోకిల :

క్రమ్మఱన్ హరణ మ్మిడెన్ దురగమ్ములం దొక లక్ష నే
కమ్ముగాఁ బదివేల నానఖక్రమకాంచన భూషణాం
గమ్ములన్ ఘనదిగ్గజమ్ములఁ గా దనం దగు నేన్గుమొ
త్తమ్ము లిర్వది యైదువే లరదమ్ములం బలుసొమ్ములన్. 1316

ఉ. బండుల నిండ వేసి వరవస్త్రమహామణికాంచనాదులన్
మెండగు వస్తు సంతతుల మేలగు గోమహిషీసమూహమున్
దండిగఁ దోలిపెట్టె నటఁ దత్క్షణ మాజనకుం డయోధ్యకున్
మెం డొకఁడాడ వానిఁగని మెచ్చరు దిక్పతు లాత్మసంపదన్. 1317

క. వినఁగనె విద్యుఁముపా రటు
చనియెడునుడి, ఝుషము లల్పసలిలము లందున్
వనపుగతి వనరి రాణులు
జనకజ నొడి జేర్చుకొనుచు సప్రేమమునన్. 1318

చ. 'చిరము సుమంగళీత్వమును జెన్నుగఁ దాల్పుము భర్తృప్రేమకున్
దిరమగు తావలంబ వయి దేవిరో!' యంచిడి దీవనంబులన్
'గురువుల సత్త్వ మామలను గోరి భజింపుము భర్తృచిత్తముం
గర మనురక్తిలో నెఱిఁగి కార్యమొనర్పు' మటంచు ధర్మముల్. 1319

మ. ఉపదేశించిరి సూక్తిసారము సఖుల్ యోషార్హధర్మంబులన్
ఉపలాలించి సుతాచతుష్టయము నిం పొప్పారఁ బల్మారు నా
నృపపత్నుల్ తలిఁ గౌగలించి సుతలన్ సృష్టింపగా నే లోకో
విపులన్ బ్రహ్మ యటంచుఁ జింతిలి; రటా వేళన్ విదేహాధిపున్. 1320

తే. సెల నడుగ వచ్చె రాముఁడు చెన్నుమీరఁ
దమ్ములం గూడి యంతఁ దత్పౌరసతులు
పర్వపర్వున వచ్చిరి వారిఁ గనఁగ
నంచు నొక్కతె పెండ్లివా రరిగెద రని. 1321

మ. కనులారం గనుఁ గొమ్ము వీరిసొగసున్ గన్గొనగున్ నెచ్చెలీ
మన కివ్వారిని లోచనాతిథులుగా మన్నించి కల్పించెఁ బ్రా
ఘున పుణ్యాతిశయంబునన్ విధి యటుల్ గాకున్న వీరేడకో
మనకుం గన్పడు టేడఁ 'బాపి హరిధామప్రాప్తిఁ' బోలుం గదా. 1322

క. మరణాతురునకు నమృతము
కరఁశిని, దురితాత్మునకును కైవల్య మటుల్,
నిరుపేద కమరతరు వటు
దొరకెరి మన కనుల కీవధూవరు లరయన్. 1323

క. కనుఁగొని రామచ్ఛవి నిజ
మనములను ధరించుకొనుఁడు మదుల ఘణులుగన్
ఘనమూర్తుల మణులనుగా
నొనరించి" యటంచుఁ బల్కుచుండఁ బురస్త్రీల్. 1324

ఉ. ఇవ్విధి రాణివాసమున కేగగ నేత్రఫలం బొసంగుచున్
రివ్వున నాసహోదరులు, ప్రీతిని లేచిరి రాణులెల్లరున్
అవ్విధి రూపసింధువుల కత్తతి నత్త ప్రహృష్టచిత్తయై
మవ్వపుఁగూర్మి నారతిడి మక్కువ నెక్కొన రామురూపునన్. 1325

ఉ. ప్రీడను వీడి పాదముల వీడక పట్టుచు మాటిమాటికిన్
వేఁడెను ప్రేమవశ్య యయి ప్రేమ వచింపఁ దరంబె సాజహూ
వేడుకతోడ భ్రాతలకు వే జలకంబుల వోసి యిష్టమౌ
కూడుల నారగింప నిడెఁ గూర్మి విదేహుని రాణి యత్తతిన్. 1326

చ. తతిఁ గనుపెట్టి పల్కె భరతప్రియసోదరుఁ డత్త కిత్తతిన్
'బురమున కేగనెంచి సెలవుం గొనఁ బంపె నృపుండు మమ్ము నిం
దరుసముతోడ నాజ్ఞ నిడు మమ్మరో! మమ్ముల నెమ్మనమ్మునం
బెరిమను జూడు మర్భకుల పెంపున నిచ్చ లెటింగి' యన్నచో. 1327

క. విలపించి రతివ లెల్లరు
బలుకఁగ నోరాడ కత్త పరమప్రీతిన్
లలిఁ గౌగిలించి తనయుల
నలుగుర నం దొప్పగించె నాథుల కంతన్. 1328

చ. వినుతి యొనర్చి మ్రొక్కి రఘువీరున కాత్మజ నొప్పగించి యి
ట్లనుపమభక్తి వేఁడె "నఖిలాత్మక! యీవ యెఱుంగు దెల్ల నీ
జనకజ నాకు భూపతికి జ్ఞాతిసఖీజనబంధుకోటికిం
గనుఁగొనఁ బ్రాణతుల్య సుమి! కైకొను మీ యమ నాత్మదాసిగన్.

క. నీవు గుణగ్రాహకుఁ డవు
భావప్రియుఁ డవును జ్ఞాన వారిధి వీవే
నీవ పరిపూర్ణ కాముఁడ
వీవె దయానిధివి రామ, యెటు నిన్నెంతున్." 1330

క. అని పదపడి పడి పదయుగ
మున వ్రాకది ప్రేమపంకమునఁ గూరుకు పో
యెనన న్నోరాడక నె
క్కొన గాఢప్రీతి యామె కుతుకము తోడన్. 1331

ఉ. అత్తటి నారఘూత్తముఁడు నత్త ప్రియంబున కెంతయున్ ముదా
యత్త మనస్కుఁ డౌచుఁ గొనియాడుచుఁ బల్మఱు పెక్కురీతులన్
బత్తిఁగరంబు లొగ్గి మముఁ బంపుఁ డిఁ కంచును మ్రొక్కి క్రమ్మఱన్
జిత్త మెలర్చ దీవనలఁ జేకొని యేగెను భ్రాతృయుక్తుఁడై. 1332

ఉ. అయ్యెడ రాణు లెల్లరును శ్యామలగౌరకిశోరమూర్తులన్
నెయ్యమునన్ మదిన్నిలుప నెమ్మిని గూఁతులఁగూడి తల్లియుం
జయ్యన మాటికిం గలిసి సాగఁగ నంపఁగ వీడి వచ్చెఁ దా
నొయ్యన లేగ వీడి చననోపని లేఁగటి యావు పోలికిన్. 1333

క. కరుణా విరహంబులు గా
పురముండెనొ మిథిల ననఁగఁ బురనర నారుల్
వర రాణివాస జనమును
దెరలఁగ బోరై రటంచు దీరని ప్రేమన్. 1334

ఉ. మంజుల పంజరంబుల క్షమాసుతచే మును శిక్షితంబులై
మంజుల మాధురోక్తులను మచ్చికఁ బల్కెడు కీర శారికల్,
నెంజలిఁ నీటుఁ దక్కి యవనీసుతకై పలవించుఁ బేరుకొం
ఛుం జెపు దెట్లు మానవులఁ జూడఁగ పక్షులజాడ యిట్లుగాన్.

మ. జనకుం డంతఁ గుశధ్వజుండు వెను రాఁ జక్షుర్ద్వయం బశ్రులం
దనరం బ్రేముడి మే గగుర్పొడఁగ సీతం గౌఁగిటం జేర్చి తా
ఘనసుజ్ఞాని యనం బరంగియు విరాగం బెల్లఁ గోల్పోయి ప్రే
మనిమగ్నుండయి జ్ఞాన సీమ విడె 'రమ్మా యమ్మ!' యంచాదటన్.

చ. సచివులు నూరడం బలుక క్ష్మాపతి మాని మనోవ్యథన్ మదిన్
రుచిరము లైన పల్లకులఁ గ్రొత్తవి తే నియమించి వారికం
దుచితవధూపదేశముల నొప్పుగఁ జేసి కులోచితంబుగా
నచిరమె యోగ్యలగ్నమున నందలమెక్కఁగఁ బంచెఁ గూఁతులన్.

తే. సిద్ధిగణపతి లోనెంచి యిద్ధబుద్ధిఁ
బల్లకుల లోన నెక్కించి ప్రాణసమలఁ
గూఁతులను బంచి యవ్వారికూడఁ బనిచె
దాసదాసీజనంబుల ధరణివిభుఁడు. 1338

ఉ. వ్యాకులచిత్తులైరి పురవాసులు సీత చనంగ నందు భ
ద్రాకరమైన వస్తు లెదురయ్యెను భూసురమంత్రిముఖ్యులం
జేకొని కోసలాధిపుని జెల్మిని వీడ్కొలుపం జనెన్ నృపుం
డాకుశకేతుసోదరుఁడు నశ్వరథాదు లలంకరింపఁగన్. 1339

## దశరథుఁడు సపరివారుఁడై యయోధ్య కేగుట

మ. మొరయన్ మంగళవాద్యముల్ శకునముల్ మోదావహంబై తగన్
గురియన్ వేల్పులు పూలవానల నొగిం గూర్మిన్ సురాజ్ఞానల్
వరగానం బొనరింపఁ బంక్తిరథుఁ డవ్వారిన్ మహీదేవులం
బరిపూర్ణాత్ములఁ జేసి దానములఁ దద్భద్రావహాశీస్సులన్. 1340

మ. శిరమందూని తదంఘ్రిధూళిఁ గొనుచున్ శ్రీసిద్ధివిఘ్నేశ్వరున్
గరుణాబ్ధిన్ స్మరియించి ప్రోలు గదలెం గౌతూహలం బొప్పఁగాఁ
గర మర్గించి ద్విజాళి వీడ్కొలిపి, వేడ్కం గోర్కు లీడేర్చుచుం
బరిపూర్ణాత్ములఁ జేసె భిక్షుకతతిన్ వస్త్రాదిదానంబులన్. 1341

చ. బిరుదము లాడ వందితతిఁ బేరిమి రామమనోహరాకృతిం
బౌరి మది నిల్పి యేగి రలఁ బ్రోలిజనుల్ మిథిలాపురీశుఁడుం
బురిఁ జనఁ డయ్యెఁ బ్రేముడిని మున్గి పొరింబొరిఁగోసలేశుఁ 'డిం
కరుగుఁడు చాల దవ్వరిగె' నంచును దన్ను మరల్చుచుండినన్. 1342

శా. అంతం బంక్తిరథుండు కన్గవఁ బ్రమోదాశ్రుల్ గడున్ నిండుగా
నెంతేఁ బ్రేముడి మీఱఁ దేరు డిగఁగా నిట్లాడెఁ గేల్మోడ్చి య
త్యంతప్రీతి సుధామయోక్తుల విదేహాధీశుఁ 'డుర్వీశ! నా
కెంతేఁ బెద్దటికంబుఁ గూర్చితివి నీవింపారు వియ్యంబునై.' 1343

ఆ. అనుచుఁ బొగడు కొనుచు నన్యోన్య మిట్టు లా
నంద మొందు చిర్వు రందు మిగుల
గారవించుకొనిరి క్ష్మాపతు లొండొరు
లట్టి ప్రేమ మెవనికొ గణింప. 1344

క. అత్తఱి జనకక్ష్మాపతి
బత్తి మునుల యడుగు లొత్తి భద్రాశీస్సుల్
జిత్త మలరఁ బడసి యెలమి
నత్తి సుగుణశీలనిధుల నాయల్లుండ్రన్. 1345

తే. ప్రేమఁ గరపద్మముల్ మోడ్చి రామున కనె
"హంసవంశావతంస! చంద్రావతంస
విమలమానస మానసావేశహంస
నేర్తునే సేయనొక్కింత నీప్రశంస. 1346

ఉ. ఎవ్వని వాఙ్మనోగతుల నెంచి యెఱుంగరు తర్కమూఢ రెం
డెవ్వనిఁ గూర్చి తార్కికులు నెవ్వనికై ధరియింత్రు యోగులున్
మవ్వపు బత్తి యోగముల, మానమదక్రుధ లెల్ల మాని యెం
దవ్వలఁ జేర వాశ్రుతులు యన్మహిమాంబుధి దాటి నిచ్చలున్.

ఉ. ఎవ్వఁడు మూఁడుకాలముల నేర్పడఁ దోఁచెడు నొక్కరూపరై
యెవ్వఁ డలక్ష్యుఁ డాద్యుఁడెవఁ డెవ్వఁడు నిర్గుణుఁ డీశుఁ డెవ్వఁడో
యవ్విభు నిన్ను సౌఖ్యనిధి వ్యాపకు బ్రహ్మముఁ గన్నులార నేఁ
డివ్విధిఁ గంటి నీకృప నెల్లరకున్ సులభుండ వై తిటుల్.

క. అవినాశివి గుణరాశివి
వివిధవిధుల నిడితి నాకుఁ బెద్దరికంబున్
స్వవశాశ్రితుఁ డను మది నను
నవిరళకృప నాదరించి తహహా మహాత్మా. 1349

క. పూషకులభూషణా! సుర
పోషణ! నీ సుగుణగాథ భువి మద్భాగ్యం
బీషణ్మాత్రము యుగముల
భాషింపఁ గలారె శేషభాషలు వేవుర్. 1350

ఉ. ఐన నొకింత యాసకల దారయ నీవొకయింత ప్రేమ కెం
తేనియు సంతసింతు వని యేమఱ కెన్నఁడు నా మనంబు నీ
మానిత పాద పద్మముల మక్కువ సేయుత" నంచు వేఁడగా
నానెనరారు పల్కులకు హర్షము నొంది రఘూద్వహుండునున్.

ఆ. మాన్యగురుపితృసమ మాననీయుఁ డటంచు
వివిధవిధుల మామఁ బెద్దఁజేసి
పరమ హర్షమందెఁ బరిపూర్ణకాముఁ డా
రాముఁడంత జనకరాజుఁ బ్రీతి. 1352

చ. భరతునిఁ గూడి కూడి రిపుభంజను లక్ష్మణుఁ గూడి మోదసం
భరిత మనస్కులై తలలు వంచిన వారి కొసంగి దీవనల్
ధరణిపుఁ డేగి కౌశికపదంబులు వట్టి తదంఘ్రిధూళినిన్
శిరమునఁ గండ్ల నద్దుకొని చెన్నగు బత్తి నుతించె నివ్విధిన్. 1353

ఉ. 'ఏసుఖ మేయశంబును దిగీశులు గోరఁగ సంశయించుచుం
డ్రా సుఖసద్యశంబుల మహాత్మ! భవత్పద దర్శనంబునన్
నే సుకరంబుగాఁ బడయ నేర్చితి దుర్లభ మొండు లే దిలన్
వాసిగ మిమ్ముఁ బోంట్లఁ గనువారి' కటంచు నుతించి యమ్మెయిన్.

ఉ. దీవన లంది వీడ్కొని విదేహుఁడు నాత్మగృహంబుఁ జేరె భ
ద్రావహవాద్యముల్ మొరయ హర్షము మీఱఁగఁ బెండ్లివారు నా
శ్రోవను రాకొమాళ్లకోమరుం గని నేత్రఫలంబుఁ గాంచి ప్రే
మావిలు లౌచు నుండ జనులవ్విధిఁ బట్టుల నాగు చేగిరా. 1355

క. చేరి రయోధ్యానగరము
చేరువ కొక భద్రవేళఁ జెలఁగఁగ ఢక్కా
భేరీశంఖారవములు
వారణ హయరవము లెసఁగఁ బలుసహానాయీల్. 1356

క. రాగములఁ బాడ మద్దెల
మ్రోగఁగఁ దద్ధ్వనుల వించు ముదితు లగుచుఁ ద
న్నాగరులు పెండ్లివారి స
మాగమన మెఱింగి పులక లలమఁగ నొడలన్. 1357

## రామాదుల పురప్రవేశ మహోత్సవము

సీ. వాడను మేడలన్ బాటలఁ గోట లే
వంకల సరిగ నలంకరించి
పథముల బహుచతుష్పథముల రాట్పథం
బుల నెల్ల నత్తరువులను జిలికి

ధ్వజతోరణవితానతతులచే విపణు ల
వర్ణ్యరీతిని జాలవరకు దిద్ది
ఫలయుతపూగముల్ వకుళ తమాల ర
సాల రంభా కదంబాళి భువిని

తే. జెలఁగు నటు నిల్పి మణులఁ బాదులను జెక్కి
నిలిపి యింటింట మంగళకలశముల న
యోధ్య శృంగారముం జేసి రొనర దానిఁ
జూచి బ్రహ్మాదిసురలు నసూయఁ గలఁగ. 1358

మ. వలతేనిన్ వలపింపఁ బోలు నను శోభన్ మీఱు తద్భూమిభృ
న్నిలయం బందున నిల్చె మేన్గొని భువిన్ శ్రేయస్సుఖోత్సాహముల్
బలుసంపత్తులు బుద్ధిసిద్ధులును శోభల్ వేయు నింకేల నీ
యిల సీతారఘురాములం గను తలం పెవ్వాఁడు సేయండొకో.

ఉ. మారసతీవిలాసముల మ్రాన్పడఁ జేయు తనూవిలాసినుల్
పౌరసువాసినుల్ పసిఁడిపళ్లెములందు సుమంగళంబులా
హారతు లుంచి భారతి వరాకృతులన్ ధరియించి వచ్చి యిం
పారఁగఁ బాడుచుండె నన నచ్చుగఁ బాడిరి మంగళంబులన్. 1360

క. కోలాహల మయ్యెను భూ
పాలాలయ మందు వేడ్క వర్ణింతు నె టా
వేళను గౌసల్యాదులుఁ
దేలిరి ప్రమదాబ్ధి నోడలు దెలియని యొలమిన్. 1361

క. ఈశగణేశుల భూత్రిది
వేశులఁ బూజించి యీవు లిడి భిక్షులకున్
వాసిఁ జతుర్విధఫలముల
రాశిం గనుపేదమాడ్కి రాజిలి రెలమిన్. 1362

క. ప్రేమప్రమోదవశలయి
యా మహిషులు పదములాడ కాత్రముపడుచున్
రామకుమారునిఁ గనుఁగో
హేమకలశముల నివాళు లిడి సిద్ధముగా. 1363

ఉ. తాలిచి, రంత మ్రోసెఁ బలుతప్పెట లప్డు సుమిత్ర మంగళా
వాలములైన దూర్వములఁ బళ్లెన లాజ హరిద్ర పూగ తాం
బూలము లక్షతల్ దధియుఁ బుష్పములం దులసీదళంబులం
దాలిచి సిద్ధపర్చె వనితల్ గొని హారతులందు నిల్చిరా. 1364

మ. బహువర్ణాంచిత హైమకుంభము లటన్ బద్మ్యామ్మనీడంబు నా
గ్రహిమితెన్ శుభవస్తువుల్ గొనుచు సన్నాహంబుఁ గావించి రా
మహిషుల్ బాడుచు భద్రగీతముల హైమస్థాళు లందున్ శుభా
వహమా హారతు లుంచి కేలఁగొని నివ్వాళింప నేతెంచిరా. 1365

ఉ. శ్రావణికాంబుదంబు వలె శ్యామము గ్రమ్మఁగ ధూపధూమ్రముల్
దైవతరాజి మింటఁ బువులం గురియింప బలాకపంక్తి నా
దేవవిభుండు చాపమును దిద్దెనొ నా మణితోరణంబు లెం
తే విలసిల్ల మించు లన నింతులు తళ్కును బెళ్కుఁ జూపఁగన్. 1366

ఆ. దుందుభిధ్వని యది తోయదనిర్ఘోష
మనఁగఁ జాతకశిఖు లనఁగ భిక్షు
లమల గంధవారి నమకులు గురియింపఁ
బౌరసస్యము లటఁ బ్రమద మందె. 1367

తే. అంతఁ గులగురు నాజ్ఞను సంతసమున
సిద్ధిగణపతి గౌరీశు నిద్ధబుద్ధిఁ
దలఁచి రఘుకులచంద్రుఁడు తరలి పురిని
జేరెఁ బరివారయుక్తుఁడై సేమ మెసఁగ. 1368

చ. శుభశకునంబు లయ్యెఁ ద్రిదశుల్ విరులం గురియించి మింట దుం
దుభి మొరయించి రా సురవధూతతు లాడుచుఁ బాడె గీతముల్
త్రిభువన దీప్తమౌ యశము దీటుగఁ బాడిరి వంది మాగధుల్
నభమున దేవరాజి నరనారులు ధాత్రి నెలర్చి రెంతయున్. 1369

చ. దశదిశలన్ జయధ్వనులు దద్దయు వేదరవంబు నిండె నం
త శుభనినాదముల్ చెలఁగె నర్మిలి వారిని జూడ సమ్మదా
వశులయి రంద అయ్యెడ నపారముదంబునుగాంచి పౌరులున్
దశరథరాజు కంజ లిడి దాశరథిం గని హృష్టచిత్తులై. 1370

క. పులకిత సుతనూలతికలు
సలలిత బాష్పాంబు పూర్ణచక్షులునై యా
లలనలు నివాళు లొసఁగిరి
బలిహారణముగాఁగ మణుల వలువల నిడుచున్. 1371

చ. నలువుర రాకుమార్లఁ గని నల్వుర రాకొమరాండ్రనుం దెరల్
దొలఁగఁగ ద్రోసి కాంచుచు వధూతతి కౌతుక మందె, నందు న
ట్టులు ధర నెల్లవారికిఁ గడున్ సుగ మిచ్చుచు నేగుదేర వా
రలు నృపగేహసీమకును, హారతు లిచ్చిరి తల్లు లింపునన్. 1372

మ. ధనరత్నాంబరముల్ దిగందుడుచుచుం దద్దంపతీశ్రేణిపై
జనయిత్రుల్ గణుతింపరానిపెరిమన్ సంతుష్టలై రంత నా
జనకాత్మోద్భవయున్ రఘూత్తముని వేసారుల్ విలోకించుచున్
జననంబున్ సఫలంబుగాఁ దలఁచెఁ దత్సందర్శనాభీష్టయై. 1373

శా. భూజాతాననముం గనుంగొని సఖుల్ పున్నెంబు బన్నించుకో
జేజే లాటలఁ బాటలన్ కుసుమవృష్టిన్ సేవఁ దెల్పంగ న
ష్టోజన్ సొంపెసలారు దంపతులకేయుద్దిన్ మదిం దోఁపమిన్
యోజించెన్ విధిపత్ని ; సాటిఁ గనఁబో కొక్కమ్మడిన్ గాంచెడిన్.

తే. వెదకి వేసారి వే సారు లొదవ నుపమ
రామరూపానురాగిణి యా మడంతిఁ
గాంచె నొకపెట్టునన్ దెప్పవాంచకామె
సలిపి లౌకికవైదికాచార విధుల. 1375

చ. అడుగుల నొత్తుచున్ మడుఁగు లారతు లర్ఘ్యము లిచ్చి వారలన్
వడిఁ గొని తెచ్చి చిత్తభవపాణివినిర్మితమో యనం గడుం
గడు సొగసైన పీఠముల గారవమారఁగఁ గూరుచుండఁగా
నిడి యొనరించి రర్చలఁ ద్రయీవిధి షోడశరీతి సేవలన్. 1376

ఉ. అంగన లంత దంపతుల కర్ఘ్యముఁ బాద్య మొసంగి భక్తి ను
ప్పొంగుచు ధూపదీపము లపూపనివేదన మాచరించి స
న్మంగళహార తిచ్చి వ్యజనంబుల వీచి, ధ్వజంబువట్టి వా
రిం గడుబత్తిఁ బూజ లొనరించి యపారముదం బెలర్పఁగన్. 1377

సీ. పరుసవేదిని గన్న నిరుపేద కంటెను
నక్షులం గన్న జాత్యంధు కంటెఁ
బరతత్త్వమును గన్న వరయోగి కంటె న
య్యమృతసిద్ధిఁగను రోగార్తు మించి
వాణీప్రసన్నతం బడయు మూఁగను మీఱి
విజయగర్వియయిన వీరు మీఱి
శతకోటిగుణితమహాసౌఖ్యంబు వడసిరి
సుతులను నిజసతీయుతులఁ గాంచి

తే. మాత లీగతి సంప్రాప్తమతులు గాఁగ
భ్రాతలం గూడి పెండ్లాడి వచ్చె రాముఁ!
డపుడు లౌకిక రీతుల నలరఁజేయ
లోన లేనగ పూనె నాభానుకులుఁడు. 1378

ఉ. మోదవిషాదముల్ దనర మోమున లేనగవూనె రాఘవుం
డా దివిషత్పితృవ్రజము నర్మిలి బూజ లొనర్చి తల్లు ల
త్యాదర మొప్ప మ్రొక్కలిడి యం దనయంబు శుభం బొనర్పుఁడీ
యాదట మారఘూత్తమున కంచుఁ జెఱంగును సాచివేడగన్. 1379

క. వరములిడి సురలు నెలవుల
కరిగి రయోధ్యావిభుండు నందఱ కపు డా
భరణమణి వస్త్రముల నిడ వా
రరిగిరి శ్రీరామభద్రు నాత్మఁ దలఁచుచున్. 1380

చ. పురనరనారు లందఱకుఁ బుట్టములం దగఁ గట్టబెట్టి యా
నరపతి భిక్షుకవ్రజము నందెవఁడెయ్యదికోరు మోదసం
భరిత మనస్కుఁడై యొసఁగి వానికి నయ్యది సేవకాళి సం
భరిత మనస్కులన్ జలిపె మాన్య బహూకృతులన్ దలిర్పగన్.

తే. వార లాశీర్వచించుచు నారఘువరు
సుగుణగాథల వర్ణించుచును వెడలిరి
సదనముంజేరి దశరథక్ష్మావరుఁడును
గురుమహీసురబాంధవ పరివృతుఁ డయి. 1382

క. కులగురు ననుశాసనమునఁ
గులవిధి శ్రుతివిహితరీతిఁ గూర్మి నొనర్చెన్
లలనలు ద్విజతతిఁ గనఁగనె
తలఁచుచు నిజభాగ్యములను దఱుకున లేవన్. 1383

క. ఒడయం డడఁగులఁ గడుగుచుఁ
గడుబత్తిని బుడమివేల్పుగమిఁ గొల్చి కడుం
గడుఁబేరిమి మృష్టాన్నముఁ
గుడిపించి సదక్షిణముగఁ గూర్మి నుతింపన్. 1384

క. ఆశీస్సులిడిరి వారుం,
గౌశికమానిం బ్రసన్నుఁ గావించి యయో
ధ్యేశుఁడు తనసాటి సుకృత
రాశి యొకఁడు లేఁడటంచు రాజర్షివరున్. 1385

చ. పలువగలన్ నుతించుచును బాదరజంబు సతీసమేతుఁడై
తలను ధరించి రాణులును దానుఁ గనంగ సులభ్యుఁడౌ నటుల్
నిలయమునంద నిల్పుకొని నిచ్చలు నెమ్మి వసిష్ఠు నంఘ్రులం
గొలిచె నపార మోదమునఁ గోర్కులు దీఱ సబాంధవమ్ముగన్.

మ. సుతసంపత్తుల మ్రోలవెట్టుక వసిష్ఠున్ మాటికిం గొల్వఁగా
నతఁడుం గానుకలంది పల్విధములౌ నాశీస్సులం జేసి స
మ్మతి సీతారఘురాములం దలఁచి యమ్మైమ్మె నిల్లుసేరెన్ మహీ
పతియుం బౌరసుమంగళీతతిని బిల్వం బంచి యవ్వారికిన్. 1387

క. ఎవ్వారి కెయ్య్య దుచితం
బవ్వారలకట్టి కాన్క లర్మిలితో నం
దవ్వారిగ నిప్పించెను
గ్రొవ్వలువల మణుల వారికోర్కుల కొలఁదిన్. 1388

చ. అతిథులఁ బూజ్యులం గనుచు నాదర మార బహూకరించె, నా
క్రతుభుజులున్ వివాహకుతుకంబుఁ గనుంగొని పుష్పవృష్టులన్
క్షితిఁ గురియించి యిమ్ములకుఁ జేరిరి భేరులఁ గొట్టు చొండొరుల్
క్షితితనయామనోవిభునికీర్తులు మాటికి నుగ్గడించుచున్. 1389

శా. ఆరీతిన్ నరనాథుఁ డెల్లరను బూర్ణాభీష్టులం జేసి య
ష్టా రాజ్ఞీనిలయంబుఁ జేరి నిజభార్యాయుక్తులం బుత్రులన్
గారామారఁగఁ గాంచి వారిని నిజాంకంబందునన్ నిల్పి యిం
పారన్ లాలన సేసె తత్ప్రమదమె ట్లగ్గింపఁగా నయ్యెడిన్. 1390

ఉ. నిండె ముదంబు రాట్సుతుల నెమ్మది లందు నను క్షణంబునున్
నిండు మనంబుతోడ నవనీపతి రాణుల కెల్లఁ దెల్పె నా
పెండిలి వేడుకల్, జనకు పెద్దతికంబు గుణస్వభావముల్
మెండగు ప్రీతిరీతులను మేలిమి వందు లోనర్చు సన్నుతుల్. 1391

క. విని యంత సంతసించిరి
వనితలు నృపుఁ డపుడు వేడ్క బాపలతోడన్.
దనయులతో బంధులతో
ఘనముగ భుజియించెఁ బంచఘటికారాత్రిన్. 1392

ఉ. మంగళగానముల్ సలుప మానిను లానిశ సౌఖ్యసీమయున్
మంగళదాయి యయ్యె సుమమాల్యసుగంధ విభూషితాంగులై
యంగనలెల్ల వార్చి విడె మంది రఘూత్తముఁగాంచి తేని యా
జ్ఞం గొని యూడలన్ నిలిపి స్వస్వగృహంబుల కేగి రెల్లరున్. 1393

ఉ. ఆ ముద మా వినోదముల నా ఘనసంపద లట్టిప్రేమ మిం
కేమన శేషభాషలు మహేశగణేశచతుర్ముఖశ్రుతుల్
వేమఱుఁ బల్కఁజాల రలవేవురునైన ననన్ వచింతు నే
నేమెయి, వానపామెటు మహీభరమున్ భరియింపఁ జాలెడిన్. 1394

ఉ. ఇవ్విధిగారవించి నృపుఁ డిట్లనె రాణుల నెల్లఁగాంచి య
“ప్లివ్విధిఁ బిన్ననాటఁ బెఱయింటికి వచ్చినవారు వీరి మీ
రెవ్విధిఁ బేర్మిఁ బెంచెదరొ యీజనకక్షితినాథకూతులన్
మవ్వపుఁప్రేముడింగనుఁడు మన్ననతోఁ గను రెప్ప లట్టులై. 1395

క. కడు బడలినారు సుతు లిం
పడరం బవళింపఁ బెట్టుఁ” డని సెలవిడి యా
యొడయఁడు వెడలెను వడి వడి
యెడ రామబ్రహ్మపద సమీహిత మతియై. 1396

తే. సహజసుందర మైన యజ్ఞనవరోక్తి
విని సుమణిమయఖట్వముల్ వేడ్కఁ బరచి
దుగ్ధఫేనసమానమౌ తూలికల న
వర్ణ్య మైనట్టి మృదులోపబర్హములను. 1397

తే. స్వచ్ఛసువితాన మణిదీప సంయుతంబు
స్రక్సుగంధసుగంధితరమ్యము నగు
మణినికేతన మందు రామప్రభువును
బండుకొనఁబెట్టి మృదులతల్పమున నపుడు. 1398

ఉ. శ్యామల కోమలాంగముఁ బ్రియంబున నంటుచు మాతలెల్ల రం
దీమెయి ముచ్చటించి "రెటు లీమృదు మంజుల నీలగాత్రుఁ డీ
రాముఁడు భీకరాటవుల రాక్షసిఁ దాటకఁ గీటడంచెనో
యేమెయి సోఁకు మూఁక మడియించె నొకం డసహాయశూరుఁడై.

చ. మునివరుసత్కృపన్ భవుఁడు మున్న తొలంచ విపత్తు లెన్నొ యీ
యనుజు లిటెన్నఁగన్ గురుదయన్ బహువిద్యల నభ్యసించి యా
ముని మఖరక్షణన్ సలిపి ముజ్జగముల్ యశమావహిల్లఁగా
మునిసతి నంఘ్రిధూళినిఁ బ్రపూత నొనర్చి విదేహుపీటిలో. 1400

ఉ. రాజసమాజ మందు ద్విజరాజకిరీటునిచాపరాజమున్
రాజితకూర్మపృష్ఠ సురరాజవరాయుధవజ్రకర్కశం
బైజిగి మీఱు దాని దునుమాడి జగద్విజయంబు నాఁగ నీ
రాజతనూజ కేల్గొని పురంబున కేగు నమానుషక్రియల్, 1401

చ. ఒనరుచు నెల్ల మానికృప నొందియకాదె త్వదాస్యబింబమున్
గనుఁగొని మాదు పుట్టువులు గణ్యతఁ గాంచెను రామచంద్ర! నిన్
గనని దినంబు మాబ్రతుకుకాలమునన్ విధి దుర్దినంబుగాఁ
గని గణుతింప కుండు" ననఁగా రఘువీరుఁడు సంతసించుచున్. 1402

క. హరగురు విప్రపదాబ్జము
లురవడి స్మరియించి నిదురనొందఁగ సంధ్యా
సరసీరుహంబు వరుసం
గర మరుదుగఁ దన్ముఖంబు కన నొప్పారెన్. 1403

క. ఇంటింటను మేల్కాని క్రా
ల్గంటులు దా మాడుకొనిరి లాస్యోక్తు లిటుల్
'కంటే పురి రాజిల్లిన
వెంట నెసఁగె నిశయు' ననుచుఁ బృథ్వీశసతుల్. 1404

ఉ. వాకొను చిట్లు కోడలుల వ్యాళము లాత్మశిరోమణుల్ దగం
గైకొని లోన డాచికొనుకై వడిఁ దోడ్కొని కూర్కు సెంది రా
రాకొమరుండు రాఘవుఁడు గ్రన్నన వేకువ వందిమాగధుల్
ప్రాకట మొప్పఁ గీర్తిఁ గయివారము సేయుచునుండ మేల్కొనెన్.

చ. పురజను లంగణంబులను మూఁకలు గూడఁగ దర్శనార్థమై,
వరయశమున్ నుతింపఁగను వందిజనంబు, నమస్కరించి యా
గురుపితృమాతృదేవతలకున్ క్షితిదేవుల కందు దీవనల్
గరము గ్రహించి సోదరులు క్ష్మాపతితోఁ జనఁ జేరి ద్వారమున్.1406

క. ప్రాతఃకృత్యము లొనరిచి
ప్రీతిని సరయూనదీకృపీటములందున్
స్నాతు లయి సహజపావను
లాతఱి జనకాంతికమున కరిగిరి వారల్. 1407

క. అక్కుమరులఁ గనుఁగొని తేఁ
డక్కునకుం జేర్చుకొనుచు నలరారంగా
మక్కువఁ గని రచ్చొటిజను
లక్కుమరుల కొమరు దృక్ఫలావధి యంచున్. 1408

మ. అప్పు డేతెంచ వసిష్ఠ కౌశికులు పీఠాసీనులం జేసి యా
నృపుఁ డవ్వారి భజించెఁ బుత్రయుతుఁడై, నెయ్యంబునన్ రాము నా
తపసుల్ గాంచి ప్రసన్నచిత్తు లగుచున్ ధర్మేతిహాసంబులం
గృప విన్పించి ర టవ్వసిష్ఠమునిపల్కం గౌశికోదంతమున్. 1409

చ. అల మునిమానసాగమములౌ కుశికాన్వయు చెయ్వు లన్నిఁటిం
దెలుపఁగ వామదేవుఁడును బల్కె 'నిజంబుగ నేతదీయస
ల్లలితయశంబు ముజ్జగములన్ విలసిల్లె' నటంచు నప్డు డం
దెలమిని మీఱి రంద ఱెద నెంతయుఁ బొంగిరి రామలక్ష్మణుల్. 1410

క. మంగళ మోదోత్సవము లె
సంగెను సుఖమయములౌచుఁ జనె దివసంబుల్
పొంగెనొ నిండి యయోధ్యా
ప్రాంగణమున నెల్ల సమ్మదాంబుధు లనఁగన్. 1411

ఉ. కంకణమోచనంబు శుభకాలమునన్ జరిపించి రత్తఱిం
బొంకము మీఱు తన్నగర భూరిసుఖంబుల కీసు నొంది యా
పంకజ సూతి కోరె సురవార మయోధ్యను జన్మమందఁగాఁ
గొంకక గాధిసూతి చనఁ గోరియు నాగె నృపానురుద్ధుఁడై. 1412

క. దినదినమును శతగుణ మగు
జనపతిసద్భావ మరసి శ్లాఘించుచు లోఁ
జన ననుమతిఁ గొన వచ్చెను
ముని కౌశికుఁ డపుడు, నృపుఁడు పుత్రయుతుండై, 1413

మ. నిలిచి 'మహానుభావ! యివి నీయవి కావె సమస్తసంపదల్
తెలిసి తనూజ బాంధవసతీయుతు నన్ నిజదాసుగాఁగఁ బు
త్రులపయి సత్కృపన్ మునిశిరోమణి! దర్శన మిచ్చుచుండుఁ డ
ర్మిలి' నని వేఁడుచున్ మునివరేణ్యు పదంబులఁ బట్టె నత్తఱిన్. 1414

క. నడి యోడకడుగులం బడు
నోడయని దీవించి మౌని యూరు వెడలినన్
గడువడి రాఘవుఁడున్ వె
న్నిడుకొని తమ్ములను బంపనేగె మునీంద్రుల్. 1415

ఆ. గాధితనయుఁ డంతఁ గాకుత్స్థుని మఱల్చి
వాని రూపు నాత్మలోన నిలిపి
దశరథనృపు భక్తిఁ దత్సుతపరిణయో
త్సవవిశేషములను దలఁచుచుఁ జనె. 1416

చ. కులగురువామదేవులటఁ గూరిమిఁ దెల్పఁగ గాధిసూనుగా
థల విని తద్యశంబు సుకృతంబును మెచ్చుచు భూధవుండు పు
త్రులఁగొని సౌధసీమఁ జనెఁ దోడనె సభ్యులు నేగి రిండ్లకున్
లలిత యశంబు ముజ్జగములం బఱువన్ వినుతింత్రు పెండ్లినిన్.

క. జానకిఁ గేల్గొని రాఘవుఁ
డా నగరికి రాఁగ నిలిచె నానంద మయో
ధ్యానగరి నాటిసుత యా
యానందము నెంత్రె శతసహస్రాననులున్. 1418

క. పావనమును వరకవికుల
జీవనమును శుభద మనుచు సీతాపతి స
త్త్వావనచరితముఁ బలికితిఁ
బావన మొనరించుకొనఁగ వాగ్వైభవంబున్. 1419

శా. వాకుం బావనముం బొనర్చుకొనఁగా వర్ణించె నీతం డిదిం
దీకాకుత్స్థచరిత్రవార్థి దరి నెం దెవ్వండు గాంచున్ సుభ
ద్రాకం బీకథ, రాఘవోపనయనం, బుద్వాహగాథాదికం
బాకాంక్షం బఠియింప విన్న సుఖ మత్యంతంబు సిద్ధించెడున్. 1420

క. క్షేమాయతనము సీతా
రామవివాహోత్సవకథ రమణఁ బఠింపన్
బ్రేముడి విన్నను సీతా
రామకృపం జిరసుఖంబు ప్రాప్తించు నిలన్. 1421



ఇది శ్రీమద్భారద్వాజసగోత్రపవిత్ర రామనార్యతనూభవ
సుజనవిధేయ సూర్యనారాయణ నామధేయ
ప్రణీతంబును, సకలకలికలుషవిధ్వంసనంబు నగు
శ్రీమదాంధ్ర తులసీరామాయణం బను
శ్రీరామచరిత మానసమున విమల
వైరాగ్యసంపాదననామకం బగు
ప్రథమ సోపానము బాల
కాండము సమాప్తము.

# తప్పొప్పుల పట్టిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| iii | 9 | నారాణ | నారాయణ |
| iii | 16 | రామాయుణ | రామాయణ |
| iv | 18 | సమ్మతినౌ దల | సమ్మతి నౌదల |
| v | 11 | గాంభీరము | గంభీరము |
| vi | 3 | రజ నీ | రజనీ |
| vi | 14 | చిత్తరి | బిత్తరి |
| vii | 7 | గ్రామ | గ్రామ్య |
| vii | 11 | ప్రోత్సహము | ప్రోత్సాహము |
| vii | 18 | చెప్పగును. | చెప్పఁదగును. |
| ix | 2 | ఏకస్వాదు | ఏకస్స్వాదు |
| ix | 25 | దనియుం. | దనియుం, |
| xi | 26 | గాతయని | గాతమని |
| 1 | 7 | యెల్ల | నెల్ల |
| 2 | 24 | యెంచు | నెంచు |
| 6 | 19 | పట్ణముంజేరి | పట్టణం జేరి |
| 8 | 2 | జ్యోత్స్నంబునై | జ్యోత్స్నాభమై |
| 8 | 9 | మనథ్మ | మన్మథు |
| 8 | 19 | మూఁక | మూఁగ |
| 10 | 9 | సుబ్బ | సుబ్బన |
| 12 | 3 | మరంది | మఱంది |
| 16 | 16 | బాదవిని | బాదవిన |
| 16 | 16 | జూఁడి | సుఁడి |
| 19 | 2 | ప్రాకటఛందోర్థములకు | ప్రాకటమగు ఛందములకు |
| 19 | 3 | గర్తల రగునా | గర్తలయిన యా |
| 19 | 7 | సచ్చద్ధా | సచ్ఛద్ధా |
| 26 | 13 | తెల్లజూమ్ములన్ | తెల్లజమ్ములన్ |
| 27 | 5 | మాపున్ | ఘుస్రము |
| 28 | 8 | వానిన్ | వాసిన్ |

| | | | |
|---|---|---|---|
| 44 | 5 | రక్షసానీక | రాక్షసానీక |
| 44 | 6 | ప్రనాశనంబు | ప్రణాశనంబు |
| 44 | 11 | దురాశల | దురాశ |
| 44 | 14 | అంహానీకంబును | అంహోనీకంబును |
| 46 | 3 | తలియుందడ్రియు | తలియుందండ్రియు |
| 50 | 4 | మానసోల్లాయి | మానసోల్లాసి |
| 52 | 1 | మున్నెంన్నడు | మున్నెన్నండు |
| 53 | 21 | కాయికవాచక | కాయికవాచిక |
| 57 | 13 | మూర్ధ్న | మూర్ధ |
| 59 | 5 | సౌభ్రాతృత్వము | సౌభ్రాతంబును |
| 59 | 13 | పోషకమోచు | పోషకమూచు |
| 66 | 18 | వేషమున్ | వేషముల్ |
| 66 | 20 | పరువు | పఱచు |
| 68 | 18 | భీతివి | భీతిలి |
| 70 | 6 | త్రిజగద్వంద్యుగభీర్య మిట్టిదని | త్రిజగద్వంద్యుని గుట్టిదెట్టిదని |
| 70 | 12 | నిజోకంబున | నిజాకంబున |
| 76 | 2 | లక్షణావతియు | లక్షణాన్వితయు |
| 77 | 8 | లోకస్ధులన్ | లోకస్థులున్ |
| 78 | 22 | కనక్యన్ | కన్యకన్ |
| 80 | 5 | బొల్లవ నేరవంచు | బొల్లగు నే యటంచు |
| 80 | 10 | విధిసృష్టైక | విధిసృష్ట్యైక |
| 80 | 16 | తపోత్సుక | వ్రతోత్సుక |
| 81 | 14 | పట్టుబట్టక | పట్టుపట్టక |
| 83 | 20 | మహాత్తప | మహాతప |
| 84 | 6 | మహీంశు | మహేంశు |
| 85 | 3 | యల్లము | యుల్లము |
| 85 | 21 | దోషయుక్తుఁడగుచో | దోషయుక్తుఁడగుఁబో |
| 85 | 23 | మూర్ధ్నంబు | మూర్ధంబు |
| 86 | 23 | భాధకు | బాధకు |
| 87 | 7 | రాణ్ణందన | రాణ్ణందన |
| 94 | 20 | రగ్త | రక్త |

| Page | Line | Error | Correction |
|---|---|---|---|
| 95 | 1 | పీనసుండును | పీనదేహుఁడు |
| 95 | 12 | నౌదాటుగ | నౌబాటుగన్ |
| 95 | 15 | బుద్ధిసిద్ధులు | బుద్ధిసిద్ధులు |
| 96 | 6 | బాలులెల్ల | బాలురెల్ల |
| 96 | 13 | ఒంటిన్ | ఒంటన్ |
| 98 | 22 | నసహా | నతుల |
| 100 | 21 | మునుజనానుమతిని | మునిజనానుమతిని |
| 102 | 17 | కూఁతునల్లురుల | కూఁతునల్లునిని |
| 103 | 19 | అలకాక్షా | అలికాక్షా |
| 106 | 6 | అలక్ష్యరతిని | అలక్ష్యగతిని |
| 106 | 7 | సగుణుఁడున్ | నగుణుఁడున్ |
| 109 | 18 | నామచరిత్రముత్ | నామచరిత్రముల్ |
| 110 | 5 | సువివేకచక్షురహితుల్ | సువివేకనేత్రరహితుల్ |
| 112 | 14 | మోము | నోరు |
| 112 | 15 | క, తిను | క, తినున్ |
| 113 | 9 | నుపన్యాసంబుగావింప | మహోపన్యాసముంజేయ |
| 113 | 16 | ప్రసత్తి | ప్రపత్తి |
| 113 | 17 | నంయున్ | నయినన్ |
| 116 | 3 | రక్షేశుండు | రక్షోనేత |
| 116 | 15 | శేతి | రీతి |
| 117 | 11 | గానఁబోనొ | గాను నేమొ |
| 119 | 16 | తర్ధృతరతీ | వపుర్భృతరతీ |
| 120 | 8 | పిచ్చరింపఁగన్ | పిచ్చలింపఁగన్ |
| 120 | 20 | దైవమాయంచున్ | దైవమా యంచునున్ |
| 120 | 21 | నన్నుఁగన | నన్నుఁ గని |
| 121 | 21 | హరిరూప! మర్ధాంతర | హరిరూప మర్ధాంతర |
| 122 | 4 | ఆతతాయులు | ఆకతాయలు |
| 124 | 17 | మూర్ధ్నంబు | మూర్ధంబు |
| 126 | 23 | యగుసుత | యగసుత |
| 130 | 10 | క్షుత్త్యైక | క్షుత్త్యేక |
| 131 | 18 | తదైకా | తదేకా |

| | | | |
|---|---|---|---|
| 132 | 19 | పసుఁగల | పసుఁగని |
| 135 | 22 | దేవుళ్ల | దేవళ్ల |
| 135 | 22 | పుడమిదేవుళ్ల | పుడమిదేవళ్ల |
| 137 | 16 | డిగ్గుర | డిగ్గున |
| 140 | 17 | తుంతురు | త్రుంతురు |
| 141 | 12 | నిన్ గన ప్రముష్టుఁడనంటివిగాన గోరుదున్ | నైనఁదలఁపు స్వైరవేర్పద నంటి కావునన్ |
| 141 | 15 | బరయోద్ధా జేయ | బరయోద్ధక జేయ |
| 142 | 13 | పోదు | పోవు |
| 142 | 22 | బోరిన | బోలిన |
| 143 | 17 | డాచరితు | డాచరింతు |
| 148 | 14 | బుంగోని | బుంగని |
| 148 | 23 | తండ్రియ | తండ్రియు |
| 150 | 4 | తపోన్నతి | తపోనిష్ఠ |
| 151 | 4 | ముక్కడించి | ముక్కడంచి |
| 151 | 5 | యోద్ధా | యోద్ధల |
| 152 | 24 | దునుతుమనుచు | దునుముదుమని |
| 153 | 20 | పోరున | పేరున |
| 155 | 17 | శ్రీహరినొందు | శ్రీహరిసెందు |
| 157 | 13 | మహాత్తప | మహోతప |
| 158 | 8 | యుండిరన్ | యుండఁగన్ |
| 158 | 20 | గడుణార్ద్రి | గరుణార్ద్రి |
| 159 | 1 | భువిని విశ్రుతులు | భువనవిశ్రుతులు |
| 159 | 23 | గన్నడిరి | గన్పడిరి |
| 163 | 5 | స్వరూరు | స్వరూపు |
| 171 | 23 | సౌదరునితో | సోదరునితో |
| 173 | 1 | కచ్చిన | కబ్బిన |
| 175 | 11 | గాధేయుఁడన్ | గాధేయుఁడో |
| 175 | 12 | ఈక్షింపఁగన్ | ఈక్షింపనాన్ |
| 176 | 2 | శిలాకృతి యంతనవాయ | అహల్య శిలాకృతిబాసి |
| 180 | 13 | సౌభ్రాతృత్వము | సౌభ్రాతంబును |

| | | | |
|---|---|---|---|
| 181 | 18 | లోకాలోకన సౌఖ్యదాతను | లోకాలోకన సౌఖ్యదాతలు |
| 182 | 24 | రక్షోరగ | రక్షఃఫణి |
| 184 | 12 | గుండు | గండు |
| 187 | 16 | కేక లెట్టఁగన్ | కేక వెట్టఁగన్ |
| 189 | 3 | జేసుకొంచు | జేసికొంచు |
| 190 | 18 | బడెలెను | బడలెను |
| 198 | 13 | రాడ్పుత్రులన్ | రాట్పుత్రులన్ |
| 200 | 22 | చెగ్గలింపఁగన్ | చెంగలింపఁగన్ |
| 201 | 23 | క్ష్మాపతియెంచి | క్ష్మాపతు లెంచి |
| 202 | 15 | మామాకురికి | మాకుమారికి |
| 204 | 2 | పోరికిన్ | పోలికన్ |
| 204 | 6 | తొట్రుపడె | తొట్రిలె |
| 205 | 16 | హితుల రయ్యును | హితులె యయ్యును |
| 206 | 3 | యేడన నింకింపఁజే | యేడన దింకింపఁజే |
| 206 | 13 | చెలిబల్కుల్ | చెలిపల్కుల్ |
| 206 | 20 | యొడన్ | యొడల్ |
| 208 | 5 | నరనాథులు | నరనారులు |
| 210 | 4 | యశోవిధి నుగ్గడించుచున్ | యశఃక్రమ ముగ్గడించుచున్ |
| 210 | 17 | చందురునిఁ గన్న కోకంబు | చంద్రుగన్న చకోరంబు |
| 214 | 3 | నృపులెల్ల దొరగుచు | నృపు లెల్ల రొరగుచు |
| 215 | 4 | లివ్వెఱిచి | విల్వెఱిచి |
| 215 | 11 | గనిరి | గవలి |
| 215 | 13 | ఎన్ని | ఎన్న |
| 216 | 2 | మచ్ఛత్రృ | మచ్ఛత్రు |
| 216 | 15 | చాపము | బాపము |
| 218 | 16 | దేవుళ్ల | దేవళ్ల |
| 221 | 4 | సెలవుగ | నెలవుగ |
| 221 | 6 | మూయచో | మూయుచో |
| 222 | 21 | మదీయదోష | మదీయదోష మీ |
| 224 | 13 | గని | జని |
| 224 | 24 | గవాటముల | గవాటవాటముల |

| | | | |
|---|---|---|---|
| 226 | 5 | స్వాధీశు | నాకేశు |
| 226 | 6 | పరిపోల | సరిపోల |
| 231 | 6 | మహాస్ను | మహామ్రు |
| 233 | 10 | హార్మ్యాగ్రహములను | హార్మ్యాగ్రములను |
| 233 | 12 | పరచి | పఱచి |
| 235 | 8 | వియ్యంకుల రౌట | వియ్యంకులు నౌట |
| 239 | 5 | కోచుట | కోనుట |
| 242 | 20 | తనరచనా | నిజరచనా |
| 242 | 23 | దజ్ఞానకీ | దజ్జానకీ |
| 245 | 8 | మాఱ్మోరసి | మార్మోరసి |
| 245 | 11 | విన్నాణౌము | విన్నాణము |
| 245 | 14 | గాత్రులై | గాత్రలై |
| 246 | 2 | నిమగ్ను | నిమగ్న |
| 246 | 20 | భాజ | భ్రాజ |
| 247 | 16 | మడగు | మడుగు |
| 252 | 14 | విదేహ | విదేహు |
| 253 | 11 | చెల్లె | చెల్లి |
| 253 | 20 | హృస్థలి | హృత్స్థలి |
| 254 | 5 | మొసంగు | మొసంగె |
| 254 | 13 | అందఱె | అందఱ |
| 261 | 19 | వీరేడకో | వీరేడ యా |
| 268 | 17 | మయ్యూను | మయ్యెను |

